# రైతాంగానికి సహాయం... పెరిగిన రుణ సదుపాయం



మన రాష్ట్రంలోని గ్రామీణ, వ్యవసాయ రంగాలు నిలకడగా అభివృద్ధిని సాధించాలంటే సమర్థమైన పరపతి విధానం చాలా అవసరం. ప్రస్తుత సరళీకృత ఆర్థిక విధానాలు మన గ్రామీణ పరపతి సంస్థలను తీవ్రంగా ప్రభావితం చేస్తున్నాయి. అందువల్ల వీటికి అనుగుణంగా మన విధానంలో మార్పులు తీసుకొని రావాలి. వ్యవసాయ రంగంలోని ఉత్పత్తికీ, పెట్టుబడులకూ, వెన్నుదన్నుగా నిలిచే పరపతి విధానాన్ని రూపొందించుకుని, గ్రామీణ పరపతి సంస్థలను బలోపేతం చేయాలి.

## పెరిగిన రుణ సహాయం

రాష్ట్రంలో చిన్నతరహా, మధ్యతరహా రైతులు వ్యవసాయ రుణాల అవసరాలు ఇంకా తీరాల్సి ఉన్నా ఈ తరుణంలో రాష్ట్ర ప్రభుత్వం అనేక చర్యలు చేపట్టింది. 2003-2004 ఆర్థిక సంవత్సరంతో సరిపోల్చి చూస్తే 2004-2005 సంవత్సరానికి గాను పంట రుణాలను 41.78 శాతానికి, కాలావధి రుణాల్లో 147.41 శాతానికి పెంచింది. ఈ ఏడాది ఖరీఫ్ కాలానికి కేటాయించిన 7,500 కోట్ల రూపాయలలోని ఆగస్టు 25 నాటికి 5,066 కోట్ల రూపాయలను పంపిణీ చేసింది. గత సంవత్సరంతో సరిపోల్చి చూస్తే ఇది 1161 కోట్ల రూపాయలు ఎక్కువ.

## ప్రభుత్వం చేపట్టిన చర్యలు

మన రాష్ట్రంలోని గరిష్ఠ సంఖ్యలోని రైతులను రుణ సహాయం అందేందుకు రాష్ట్ర ప్రభుత్వం సత్వర ఆదేశాలు జారీచేసింది. అవి సక్రమంగా అమలు జరిగేందుకు వ్యవసాయ శాఖలోని యంత్రాంగం చురుగ్గా వ్యవహరిస్తోంది.

- పట్టాదారు పాసుపుస్తకాలు లేవన్న కారణంతో రుణాలు పొందలేకపోతున్న రైతులకు ప్రత్యామ్నాయ ఏర్పాట్ల ద్వారా సహాయం అందించాలని జిల్లా కలెక్టర్లకు ఆదేశాలు జారీ అయ్యాయి.
- ఈ విషయమై రాష్ట్ర వ్యవసాయ శాఖ, బ్యాంకులు విస్తృత ప్రచారాన్ని నిర్వహిస్తున్నాయి.
- ఇంతవరకు గ్రామీణ పరపతికి నోచుకోని రైతుల జాబితాను రూపొందించాలని, ఆ జాబితాలోని రైతులకు గ్రామీణ పరపతి సంస్థల ద్వారా రుణాలు అందేలా చూడాలని జిల్లా కలెక్టర్ల పర్యవేక్షణలో ప్రభుత్వ యంత్రాంగం పెద్దఎత్తున కృషి చేస్తోంది. ఇప్పటివరకు 13.56 లక్షల రైతులు ఆ జాబితాలో చోటు చేసుకున్నారు. ఒక్కో బ్యాంకూ ఇప్పుడు ఉన్న సంఖ్యకు అదనంగా నూరుగురు రైతులకు రుణలివ్వాలని ప్రతిపాదనలు వెళ్లాయి. ఈ ఏడాది కనీసం 4.90 లక్షల మంది అదనపు రైతులకు 1345 కోట్ల రూపాయల రుణాలు బ్యాంకుల ద్వారా అందజేయబడతాయి.
- నాబార్డ్ రూపొందించిన మార్గదర్శక సూత్రాల సహాయంతో విశాఖపట్నం, గుంటూరు, అనంతపురం, కడప, నిజామాబాద్, మహబూబ్‌నగర్ జిల్లాల్లోని 6000 రైతు మిత్రా గ్రూపులను రుణ సహాయం కోసం గుర్తించడం జరిగింది. వివిధ బ్యాంకులు, వాటి శాఖలు చిన్నతరహా, మధ్యతరహా రైతులకు రుణాలను పంపిణీ చేస్తున్నాయి.
- అన్ని రకాల పంటలకూ పూర్తిస్థాయి పరపతి లభించేలా జిల్లా కలెక్టర్లు, జేడీయేలు, బ్యాంకు అధికారులు కృషి చేస్తున్నారు.

## కరువు బారినపడ్డ రైతులకు బకాయిలపై ఊరట

- ఇంతవరకు రైతులు బకాయిపడ్డ అసలు, వడ్డీలను 2004 మార్చి 31 నాటి అసలు మొత్తంతో కలిపి, దీన్ని ప్రస్తుతం అమలులో ఉన్న వడ్డీ రేట్లలో అయిదు సాంవత్సరిక వాయిదాల్లో రైతులు చెల్లించేందుకు ప్రభుత్వం వీలు కల్పించింది.
- గతంలో బకాయిలు ఉన్న రైతులకు కొత్త రుణాలు అందేలా నాబార్డ్ మార్గదర్శక సూత్రాలను వెలువరించింది.
- క్షామపీడిత బడుగు రైతులకు తోడ్పడేందుకు సల్పకాలిక రుణాలతో అసలు మొత్తాన్ని మధ్యకాలిక రుణాలుగా మార్చడం జరిగింది. చిన్న, మధ్యతరహా రైతులు తమ స్వల్పకాలిక రుణాలపై చెల్లించాల్సిన వడ్డీలను ప్రస్తుతానికి వాయిదావేసి, రాబోయే పంట కాలంలో చెల్లించేలా ఏర్పాట్లు చేయడం జరిగింది. వీటికి చక్రవడ్డీ వర్తించకపోవడం గమనించాల్సిన విషయం.
- పరపతిని అవసరాలకు అనుగుణంగా పొందేందుకు వీలుగా బ్యాంకులు కిసాన్ క్రెడిట్ కార్డులను రైతులకు అందజేస్తున్నాయి. ప్రస్తుతం 56.6 లక్షల మందికే ఇవి అందుబాటులో ఉన్నాయి. ఇంకా 43.4 లక్షల మంది రైతులకు వీటిని అందించేందుకు బ్యాంకులు కృషి చేస్తున్నాయి.
- 5.85 లక్షల రైతులు చెల్లించాల్సిన 1417 కోట్ల రూపాయల పంట రుణాలను మధ్యకాలిక రుణాలుగా మార్చడం జరిగింది.

జారీచేయువారు : సమాచార, పౌర సంబంధాల శాఖ, హైదరాబాద్.

'హాసం'

హాస్య - సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

76

**Also available on net: www.haasam.com**

**ముఖచిత్రం**

'శంకర్ దాదా' M.B.B.S. చిత్రంలో అంజలాజవేరి, చిరంజీవి



## హాస్యం





## సంగీతం



'సెంటర్ స్ప్రెడ్' లో



సినిమా పాటల ప్రత్యేకం

పాత పాటల ప్రత్యేకం

71వ పేజీ నుండి 74వ పేజీ వరకూ






గాయనీ గాయకులకు బాలకృష్ణప్రసాద్ గారిచ్చిన సూచనలు అన్నమయ్య కీర్తనలకే కాదు సర్వత్రా పాటించవల్సినవే. రాతలో ఙ,ఞ,ణ్,న్,మ్ లకు బదులుగా సున్నాను ఆయా అక్షరాలకు ముందర వినియోగిస్తున్నామన్నది తెలియక వచనం కూడా అన్నిచోట్ల మ-కారప్పాల్లు (మ్)గా కొంతమంది చదివేస్తున్నారు. బాలకృష్ణప్రసాద్‌గారు చాలా చక్కగా సూచన చేశారు.

**-కే.వీ. జయపురం.**

'హాసం' 1-15,16-31 సంచికలో "హ్యూమర్‌బాక్స్" శీర్షికలో జోక్స్ ప్రచురించినందుకు ధన్యవాదాలు. కాంప్లిమెంటరీ కాపీ, గౌరి మరియు సామ్రాట్ రీమిక్స్ సి.డి.లు రెండూ అందినాయి. 'హాసం'లో వచ్చే పాటలు చాలా బాగుంటున్నాయి. హిందీ పాటకు తెలుగులో అర్థం రాయటం బాగుంది. 'హాసం' ఇలాగే మంచి, మంచి పాటలతో, శీర్షికలతో అందరి ఆదరాభిమానాలు పొందుతూ ఉండాలని కోరుకుంటూ...

**- గొల్లపూడి శ్రీనివాస్, హైదరాబాద్.**

1-15 నవంబరు 'హాసం' లో "వాదసంవాదాల రఫీ" శీర్షికలో (పేజీ నెం.43) కవ్వాలీ పాటలు కొన్ని వ్రాశారు. కాని 'మై ఇధర్ జావూ యా ఉధర్ జావూ' ఈ పాటను మీరు 'తాజ్‌మహల్' చిత్రంలో మన్నాడే, ఆశాలతో కలిసి రఫీగారు పాడారన్నారు. ఇది తప్పు. యీ పాట "పాల్కీ" చిత్రంలోనిది. సంగీతం నౌషాద్, రాజేంద్రకుమార్ హీరో, సవరించుకునేది.

**-కె. వేణుగోపాల్‌శెట్టి, కర్నూలు.**

**(మీరు కరెక్ట్ - ఎడిటర్)**

'హాసం'16-31 అక్టోబరు సంచికలో డా॥పురుషోత్తమాచార్య గారు" మీరజాలగలడా" పాట పుట్టు పూర్వోత్తరాల గురించి అందించిన స్పెషల్ వ్యాసం మాకు సందేహ నివృత్తిని చేసినది. డా॥పురుషోత్తమాచార్యగారు శ్రమపడి ఓపికతో 'స్థానం' వారి 'నటస్థానం' గ్రంథం నుండి సేకరించిన వివరణాత్మకమైన వ్యాసాన్ని ఇచ్చినందుకు వారికి కృతజ్ఞతలు. పలకరిస్తే పద్యం శీర్షికన డా॥గరికపాటి నరసింహారావుగారు తన అవధాన కార్యక్రమంలో పృచ్ఛకులడిగిన ప్రశ్నలకు ఇచ్చిన సమాధానములలో వాజ్‌పేయ్, జయలలిత లను తీసికొని ఇచ్చినవి సమయోచితంగా వున్నవి. అందరికీ సులభంగా అర్థమయ్యే రీతిలో అవధానిగారు పద్యములను చెప్పడం మాలాంటి వారికి బాగా నచ్చింది. 'హ్యూమరథం' శీర్షికన రావికొండలరావుగారి అనుభవాలు మాకు కళ్ళకు కట్టినట్లుగా వున్నాయి. 'అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం' శీర్షికన మృణాళినిగారందించిన 'ప్యాసా' చిత్రంలోని 'జానే క్యా తూనే కహీ! పాట వివరాణత్మకంగా వుంది. రఫీ గారి పాటలను శ్రమించి మాకు అందిస్తున్న మృణాళినిగారికి కృతజ్ఞతలు. 'లోఫర్' చిత్రంలోని రఫీగారి 'ఆజ్ మౌసం, బడా బే ఇ మాన్ హై బడా' గీతాన్ని మృణాళిని గారు మాకు అందిస్తారని ఆశిస్తున్నాను. 'జంధ్యామారుతం' శీర్షికన మీరు ఇచ్చిన 'పడమటి సంధ్యారాగం' చిత్రకథ, డైలాగ్స్ మాకు నచ్చాయి. పులగం చిన్నారాయణగారికి మా కృతజ్ఞతలు. బాలకృష్ణప్రసాద్‌గారు అందిస్తున్న 'అన్నమయ్య' పద భావ దర్శనమ్ హాసానికే హైలెట్. 'నేను నా పాటలు' శీర్షికన యీసారి జమునగారు కేవలం తన అనుభవాలనే ఇచ్చినారు. కానీ పాటలను ఇవ్వలేదు.

**-ఏలూరు అశోక్ కుమార్‌రావు, గుర్రంపోడ్.**

మార్కెట్‌లోకి పత్రిక రాకముందే అచ్చయిన జోక్‌కి స్రామాట్ రీమిక్స్ -సి.డి పంపటం - నేను అందుకోవటం సాహితీ లోకంలోనే లేదు ఇలా! అచ్చయిన తర్వాత - కనీసం కాపీ పంపటమే గగనంగా వున్న ఈరోజుల్లో మీ కృషి అభినందనీయం.

**-జి. భారతి, నెల్లూరు.**

1-15 నవంబరు సంచిక చాలా బావుంది. సంపాదకీయంలో వ్రాసినట్లుగా 'హాసం'సంచిక సినిమాలలో కనబడటం గర్వించదగిన విషయం. ఉత్తమాభిరుచి గల పాఠకులకు 'హాసం' ఒక వరప్రసాదం లాంటిది. హాస్యం, సంగీతం అనే రెండు సబ్జెక్టులతో మూడు సంవత్సరాలు దిగ్విజయంగా పూర్తి చేసుకుని అప్రతిహతంగా ముందుకు సాగడం వెనుక మీరు చేసిన, చేస్తున్న కృషి, పట్టుదల అర్థమౌతుంది. సినిమా పాటల ప్రత్యేకం శీర్షికన కె.విశ్వనాథ్ స్వరాభిషేకం సినిమా వేసినందుకు మా అభినందనలు. అలాగే ఆపాత మధురంలో జగదేకవీరునికథ గురించి వివరణ మాకెంతగానో నచ్చింది. జి.వి.వి. శారదాప్రసాద్‌గారి 'యిండెంటింగ్ ఆఫీసర్' కథలోని సిగరాజు లాంటి వాళ్ళకు ఈ కథ ఒక కనువిప్పు కలిగిస్తుంది. 'జంధ్యామారుతం' శీర్షికన 'బాబాయ్ అబ్బాయ్' సినిమా గురించిన పూర్వాపరాలు తెలుసుకొని చాలా ఆనందించాం. ప్రతి సంచికా కొని దాచుకోవలసిన విధంగా తీర్చిదిద్దుతున్నందుకు మిమ్మల్ని అభినందించకుండా ఉండలేక పోతున్నాం. హాసం క్లబ్ కర్నూలులో ఎవరైనా ప్రారంభిస్తారని ఎంతో ఆశగా ఎదురుచూస్తున్నాం.

**-సి.యం. అనూసారథి, కర్నూలు.**

'హసం'లో అర్థంచేసుకుందాం ఆస్వాదిద్దాం (తెలుగు-తమిళం) లో తమిళ పాటకు భావం మాత్రమే ఇస్తున్నారు. హిందీ అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాంలోని శీర్షికలో లాగా పదాలకు అర్థం ఇస్తే బావుంటుందని మనవి. 'హాసం' పత్రికను సినిమాలలో చూపించడం గూర్చి ఎడిటోరియల్ లో నాలుగు సినిమాలలో చూపించారన్నారు. 'హాసం'కు ఈ గుర్తింపు అభినందనీయం.

**-వర్రె సతీష్‌బాబు,ఉయ్యూరు.**

సరసి కార్టూన్లు రియల్లీ అద్భుతం. నవ్వీనవ్వీ కళ్ళల్లోంచి నీళ్లొస్తుంటే ఇదుగో, ఈ అభినందన లెటర్ వెంటనే రాసేసి పోస్టు చేస్తున్నాను ఆనందం ఆపుకోలేక...

**-సునీల్, హైద్రాబాద్.**

'హ్యూమర్‌బాక్స్" శీర్షికలో ప్రచురించిన నాజోక్‌కు సామ్రాట్ రీమిక్స్ సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా పంపడం చాలా సంతోషంగా ఉంది. పత్రిక మార్కెట్‌లోకి విడుదల అయిన మూడవరోజే పత్రికతో పాటు సి.డి. రావడమూ చాలా బాగుంది. పాఠకులను ఏ పత్రికా ప్రోత్సహించని విధంగా 'హాసం' పత్రిక ప్రోత్సహిస్తోంది అని అనడంలో ఎటువంటి సందేహం లేదు. 'హాసం' దిన దినం మరెంతో అభివృద్ధి చెంది ప్రతిపాఠకుని హృదయంలో చెరగని ముద్రవేసుకోవాలని నేను మనసారా ఆశిస్తున్నాను.

**-షేక్ అస్లాం షరీఫ్ , శాంతినగర్.**

'హాసం' అంటే నాకు ప్రాణం. అలా అని అందరికంటే ముందే చదవను. పక్షం చివరి రోజున కొని చదువుతాను. చదివే కొద్దీ ఇంకా చదవాలనిపించే మధుర భావన. సంగీత సాహిత్య అభిలాష వుండి తెలుసుకోవాలని ఆరాటపడే మాలాంటి వాళ్ళకి మీరు ఓ ప్రత్యేక ఆశాకిరణం. రెండు సంవత్సరాలనుండి చదువుతున్నాను. ప్రతి పత్రికను హృదయంలో పదిలపరుచుకున్నాను. చిత్రకారుని చేతిలో చిత్రం. శిల్పి చేతిలో శిల్పం ఎన్నో సుందరమైన ఆకృతులను సంతరించుకుంటుంది. అలాగే 'హాసం' కూడాను. పక్షం చివరరోజున ఎందుకంటే హాసంను మైమరచి చదువుతుంటాను. హాసంని 7వతరగతి, 9వ తరగతి చదివే నా మేనకోడళ్ళు చదువుతారు. అప్పుడప్పుడు స్కూల్‌కి తీసుకుని వెళ్తారు. వారి ఉపాధ్యాయులు ఈ పుస్తకాన్ని చదువుతారంట. ఇప్పుడు మా ఊరి పాఠశాలనందు సగం మంది 'హాసం' చదువుతున్నారు.

**-అంగలకుర్తి కోటేశ్వరరావు, మర్లపాడు.**

సంపుటి:4 సంచిక04

16 -30 నవంబరు 2004

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా: రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా: రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 400


The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక

76


మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

మేనేజర్
పి.గిరి
చీఫ్ లే-అవుట్ డిజైనర్
జి.రాజేష్



HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com



Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82


సమాజంలో మధ్యశ్రేణి అన్నది క్రమంగా కనుమరుగయిపోతున్నది. విద్యార్థుల విషయంలో చూస్తే - పాఠశాలలు ఐఐటి స్థాయివారిని తొలిదశలలోనే విడగొట్టేసి వారిపట్లనే శ్రద్ధ వహిస్తున్నారు. తక్కినవారు ఏ గంగలో దూకినా వీరికి పట్టదు. ఉద్యోగాల కొస్తే - నెలకు నలభైవేల జీతం అందుకునే సాఫ్ట్‌వేర్ నిపుణులు కొందరైతే, నెలకు నాలుగువేల గుమాస్తా ఉద్యోగం కూడా సంపాదించలేని నిరుద్యోగసమూహాలు మరోపక్క! జీవనప్రమాణాల విషయానికొస్తే - మధ్యశ్రేణి ఆదాయజీవులను ఉన్నతశ్రేణికి ఎగబాకమంటూ క్రెడిట్‌కార్డుల మాయాజాలంలో పడవేసి వారిని అధోశ్రేణికి నెడుతున్న కన్స్యూమరిజం రక్కసి కనబడుతున్నది.

అభివృద్ధి విషయంలో కూడా చూడబోతే నగరాలు విస్తరిస్తున్నాయి. వసతులు లేక పట్టణాలు అటూ ఇటూ కాని పరిస్థితుల్లో ఉన్నాయి. 'కొడితే జాక్‌పాట్ కొట్టాలి, లేదా అడుక్కుతినాలి' అనే మనస్తత్వం ప్రజల్లో ప్రబలుతోంది. ఇది క్రమంగా నేరప్రవృత్తికి దారితీస్తుంది. విఫలమైనవాడు చేతులు ముడుచుకుని కూచుంటాడనుకోరాదు.

సర్వ కళల సమాహారమైన సినిమాను తీసుకుందామంటే - ఇదివరకు మధ్యశ్రేణి సినిమాలెన్నో ఉండేవి. మరీ లో-బడ్జెట్ లో తీసే సినిమాలు ఒకపక్క, అగ్రస్థాయి సినిమాలు (మొత్తం సినిమాల్లో ఇవి ఇరవైశాతం మాత్రం ఉండేవి) మరోపక్క ఉన్నా ఇవి తమ ఉనికిని కాపాడుకునేవి. నాలుగైదు వారాలాడి, బి క్లాసు సెంటర్లలో ఒకటికి నాలుగుసార్లు విడుదలయి క్రమంగా తమ పెట్టుబడి రాబట్టుకునేవి. తగుమాత్రం ప్రతిభ వుండి, అదృష్టం కలిసిరాని ఎందరో కళాకారులకు ఇవి ఉపాధి కలిగించేవి, సగటు ప్రేక్షకులను అలరించేవి.

ఈనాటికీ మననలరించే అనేక పాటలు ఇలాటి సినిమాలలో పెక్కుసంఖ్యలో ఉన్నాయన్న విషయం మరువకూడదు. రాజేశ్వరరావు, పెండ్యాల వంటివారిని నియోగించుకునే స్తోమత లేని నిర్మాతలు కోదండపాణి, సత్యం, రాజన్-నాగేంద్ర వంటివారిచే పని చేయించుకునేవారు. ఇలాటి సినిమాలు తమ ప్రతిభాప్రదర్శనకు వేదికగా ఉపయోగపడడం వలన క్రమేపీ అగ్రసంస్థలకు ఎదిగిన కళాకారులు అన్ని రంగాలలోనూ ఎందరో ఉన్నారు. మరి ఆ రేంజ్ సినిమాలే తయారు కానప్పుడు వీరందరూ ఏమవుతారు?

టెన్షన్లు తగ్గించే సినిమాలు ఒక సామాజిక అవసరమని పాలకులు గుర్తించాలి. అన్ని తరగతులవాళ్లు వెళ్లేందుకు వీలుగా సినిమాహాళ్లు రూపొందాలి. ప్రతి హాలూ ఏసీ హాలు కానవసరం లేదు, ప్రతీ సినిమా 'రిచ్'గా 'కాంప్రమైజ్ కాకుండా' తీయనవసరం లేదు. అన్నీ అగ్రశ్రేణి, కోట్లాది బడ్జట్ సినిమాలే కానవసరం లేదు. నాలుగైదు వారాలు ఓ మోస్తరు హాళ్లలో ఆడి పెట్టుబడిలో 80, 90 శాతం తిరిగి రాబట్టుకొనగలిగే విధంగా సినిమా వ్యవస్థ రూపొందినపుడు ఈ మధ్యశ్రేణి సినిమాలు పుట్టుకొస్తాయి. అనేకమంది కళాకారులకు ఉపాధి, ప్రతిభ చూపే అవకాశం దొరుకుతాయి. సంగీతప్రియులకు టాప్‌రేంజ్ బాంబే గాయకుల పాటలకు ప్రత్యామ్నాయాలు వినబడతాయి.

ఈ మధ్యశ్రేణి సినిమాలకు నిలువనీడ లేకుండా చేసిన పక్షంలో ఏమవుతుంది? గుమాస్తా ఉద్యోగమైనా లభించని, కాలూనడానికైనా అవకాశం లభించని వాతావరణంలో జరిగేదే జరుగుతుంది. నేరమనస్తత్వం ప్రబలుతుంది. పైరసీ విజృంభిస్తుంది. 'నా సినిమా ఎలాగూ తయారుకావటం లేదు. ఇంకోడి సినిమా డబ్బు చేసుకోకుండా చూస్తాన'నే వారి సంఖ్య పెరుగుతుంది.

చట్టాలద్వారా ఈ సమస్య తీరదని అనిపిస్తుంది. ఈనాడు స్మగ్లింగ్ కొంతైనా అదుపులో ఉందంటే దానికి కారణం - అందుబాటుధరలో స్వదేశీవస్తువులు దొరకడం! చట్టాలద్వారా నక్సలైట్లను అణచడానికి అనేక ప్రయత్నాలు చేసి, చివరకు చర్చామార్గాన్ని చేపట్టిన ప్రభుత్వానికి ఈ విషయం బాగా తెలుసు. అందువల్ల పైరసీకి మూలకారణాలను శోధించి, మధ్యశ్రేణి సినిమాలు బతికే వాతావరణం కల్పించినపుడే ఈ పరిశ్రమ బతుకుతుంది.

ఈ శుభపరిణామం కోసం 'హాసం' ఎదురుచూస్తోంది.





# "వెర్రి వెంగళప్పలు"

**- కె. మీరాబాయి**

"ఏవండీ! మనపెళ్ళైయ్యాక ఈ అరవై రోజుల్లో మిమ్మల్ని ఎప్పుడైనా ఒక్క కోరికైనా కోరుకున్నానా?" గోముగా అంది రాగిణి.

నాలుగు కిలోమీటర్ల దూరం సైకిలు తొక్కుకుని వచ్చిన అలసట తీరక ముందే, కొత్తపెళ్ళాం కోరికంటూ బాంబు పేల్చడంతో మరింత నీరసం ముంచుకొచ్చింది కల్యాణ సుందరానికి.

అరవై రోజుల్లో ముప్పై రోజులు ఊళ్ళోనే వున్న పుట్టింట్లో గడిపిన విషయం ఇప్పుడు గుర్తుచేయడం వల్ల లాభం కన్నా నష్టమే ఎక్కువగా వుండొచ్చన్న దూరాలోచనతో ఆ విషయం ప్రస్తావించకుండా భయాన్ని దాచుకుంటూ నంగినవ్వు నవ్వాడు సుందరం.

"అలా నవ్వొద్దు కల్యాణీ..ఆ నవ్వు నా గుండెలోకి దూసుకుపోయి నన్ను పిచ్చిదాన్ని చేస్తుంది" అంటూ భర్త కళ్ళలోకి రెప్ప వేయకుండా చూస్తూ గుసగుసగా అంది రాగిణి 'గీతాంజలి'లో సిల్క్‌స్మిత స్టైల్‌లో

'నన్ను ఆడపేరుతో పిలవద్దన్నానా?' అని జుట్టు పీక్కోబోయి ఆగిపోయి చుట్టూ అనుమానంగా చూసి "ఎవరూ లేరే... ఎందుకు రహస్యంగా మాట్లాడుతున్నావ్?" అనడిగాడు సుందరం.

"రహస్యంగా కాదురా సుందరీ! హస్కీగా మాట్లాడానన్నమాట" అంది రాగిణి మొగుడి దగ్గరగా వచ్చి చెదిరిన క్రాపును మరింత గారంగా చెరుపుతూ.

చిరాకుగా జుట్టు 'సర్దుకుని, ఆ చిరాకుని పైకి కనబడనీయకుండా పక్కకు తిరిగి "ఈ చీరెలో భలే అందంగా వున్నావోయ్" అంటూ కుర్చీలో కూలబడ్డాడు సుందరం.

"నేనేం కట్టుకున్నానో కూడా సరిగ్గా చూడరన్న మాట! దీనిని మ్యాక్సీ అంటారు. .. చీరె అనరు "ముద్దుగా కోప్పడింది.

"సరే ఏడు గంటలవుతోంది. కాస్త కాఫీ లాంటిది ఇస్తావా?" అడిగాడు సుందరం దీనంగా.

"ఆఁ అపుడే ఏడుగంటలయి పోయిందా? ఇక అయిదు నిముషాలే వుంది.. నేను చెప్పేది వినండి" హడావిడి పడింది రాగిణి.

కంగారుగా కుర్చీలో నుండి లేచాడు సుందరం. "అయిదు నిముషాలేమిటి? ఏవన్నా అఘాయిత్యం చేసావా ఏమిటి? నీకేం తక్కువ చేసాను? నన్ను అన్యాయం చేసిపోకు రాగిణీ..." రాగిణిని గట్టిగ పట్టుకుంటూ దీనంగా అన్నాడు.

"హయ్యో.. మూడు నిమిషాలే వుంది...

చెప్పేస్తున్నా వినండి.... ఫ్లాస్క్‌లో కాఫీ వుంది. డబ్బాలో కారప్పూస వుంది. .. టేబులు మీద పొద్దున్నే వండేసిన భోజనం సిద్ధంగా వుంది.. ఏడుగంటల నుండి తొమ్మిదిన్నర దాకా నన్ను పలకరించకండి.. మీకు కావలసినవి పెట్టుకుని తినండి.... ''అనేసి బెడ్‌రూమ్‌లోకి పరిగెత్తింది రాగిణి.

సుందరానికి దిక్కుతోచలేదు..తనేం తప్పు చేసాడు? ఏమిటిదంతా? అన్నం వడ్డించుకుని తినేయమంది అంటే తను భోజనం చెయ్యడా? తొమ్మిదిన్నర డెడ్‌లైను దేనికి? జవాబు దొరకని ప్రశ్నలతో తలనొప్పి రాగా నెమ్మదిగా తనూ పడక గదిలోకి నడిచాడు.

గదిలో టి.వి. ముందర సెటిలయిపోయి వుంది రాగిణి. ఆవిడ చేతిలో పేపరు, పెన్నూ సిద్ధంగా వున్నాయి. సుందరం లోపలికి రాగానే 'వుష్' అంటూ నోటిమీద వేలువేసుకుంది. 'మాట్లాడొద్దు, డిస్టర్బ్ చెయ్యొద్దు' అన్నట్టుగా..

ఈ బిల్డప్ అంతా దేనికో అర్థం కావడం లేదు సుందరానికి.. 'కొంపదీసి నాలుగు సీరియల్స్ వరుసగా చూసి తనో క్రొత్త సీరియల్‌కి కథగానీ రాయాలనుకుంటుందా?' అనుకుంటూ టి.వి. కేసి చూసాడు ఆశ్చర్యంగా.

రాగిణి మామూలుగా చూసే ఛానల్ కాదు అది. ఏదో కొత్తది. కానీ తెలుగు సీరియల్స్ వస్తున్నాయి. 'మీదీ కాదు మాది కాదు ' అన్న ఛానల్ లోగో వెనకాల స్క్రీన్ మీద కనబడగానే 'ఓహో' అనుకున్నాడు.

'ఇదేదో చూద్దాం... తనే చెప్పక పోతుందా' అనుకుంటూ వంటింట్లోకి వెళ్ళి ఫ్లాస్కులో కాఫీ గ్లాసులోకి వంపుకుని కారప్పూస ప్లేట్లోకి తీసుకుని మళ్ళీ పడకగదిలోకి వచ్చి కూర్చున్నాడు.

పెళ్ళికి ముందే కాబోయే మొగుడి వదిన గారి మీద పగతో ద్వేషంతో రగిలిపోయే పెళ్ళికూతురు కథ ఏదో వస్తోంది.

''అదేమిటి రాగిణి! 'ఆడపిల్లనే కను' 'నిప్పుసాక్షి' నీ కిష్టమైన సీరియల్స్ కదా.... అవి వదిలేసి ఇది పెట్టావెందుకు?''.. కారప్పూస పరపర నములుతూ వుత్సుకత ఆపుకోలేక అడిగాడు సుందరం.

టి.వి. మీద నుండి కళ్ళు తిప్పకుండానే 'చాలు' అన్నట్టు చెయ్యి చూపించింది రాగిణి.

'అదిగో మొదటి అక్షరం వచ్చింది. 'కుర్చీలో నుండి లేచి గంతు లేసినంత పనిచేసి పేపరు మీద ఆ అక్షరం రాసుకుంది. 'ల్' అనే అక్షరం అది.




ఇంతలో అడ్వర్‌టైజుమెంట్ మొదలైంది. "కారప్పూస చప్పుడు కాకుండా తినండి... నా కాన్సన్‌ట్రేషన్ దెబ్బ తింటోంది." అంది రాగిణి కళ్ళు రెండూ టి.వి. తెరకు అంకితం చేస్తూ.

"సరే విషయమేమిటో చెప్పు... సస్పెన్స్‌తో ఛస్తున్నాను.."బ్రతిమాలాడు కల్యాణసుందరం టెన్షను భరించలేక.

"బ్రేక్ సమయంలోనైనా ఇటు చూడొచ్చు కదా!" అని కూడా అడిగాడు.

"ఏమో..ప్రకటనలు వచ్చేటప్పుడే ఇంకో అక్షరం వచ్చేస్తే... మిస్సయిపోనూ... మీకు ఇప్పుడు తెలియదు నా మనసంతా మీదే అని. మీ సుఖమే నేను కోరుతున్నాననీ... రేపు మారుతి కార్లో తిరిగినపుడు అర్థం అవుతుంది" అంటూ ఎవెూషనల్‌గా మాట్లాడింది రాగిణి టి.వి.స్క్రీన్ మీద నుండి దృష్టి మరల్చకుండా.

అంతలోనే 'కెవ్' అంటూ లోకా తీతమైన కేక పెట్టింది. "చెప్పానా అదిగో అక్షరం.." అంటూ.

సుందరం వీపు మీద చరుచుకుని, లాల్చీ లోకి 'థూ థూ' అనుకుని టి.వి. వైపు చూసాడు 'ష్ణ' అన్న అక్షరం. పెద్దగా కనబడుతోంది. అక్షరం రాసుకోవడంలో మునిగిపోయిన రాగిణి తన అరుపుకి మొగుడు ఝడుసుకోవడం కూడా గమనించలేదు.

మళ్ళీ "ల్" 'ష్ణ' తో అర్థవంతమైన పదాలు ఏమొస్తాయో ఆలోచిస్తూ వుండండి.. మనకి అరగంటే టైము.. తొమ్మిదిన్నర దాకా వచ్చే అక్షరాలన్నీ కలిపి ఏ పదమో మనం ఫోను చేసి చెప్పాలి. అదీ తొమ్మిదిన్నర నుండి పది లోపుగానే.." అంటూ ఈసారీ 'కెవ్' అనే అరుపుకి ప్రత్యామ్నాయంగా ఒక గంతువేసి టి.వి.లో మీరు మాకు ఫోను చేసి చెప్పాల్సిన నంబర్లు అంటూ వస్తున్న ఒక సెల్ నెంబరు, రెండు ఫోను నంబర్లూ గబగబ రాసుకుంది.

ఎనిమిదిన్నర అయ్యేసరికి సుందరంకు ఆకలేసింది. "నీకు అన్నం కలిపి తీసుకురానా?" ప్రేమగా అడిగాడు.

'మాట్లాడొద్దు' అన్నట్టు సైగ చేసింది రాగిణి. సుందరం వెళ్ళి భోజనం చేసి వచ్చేసరికి మరో



నాలుగు అక్షరాలు రాసుకుంది రాగిణి.

అవన్నీ మరో పేపర్లో రాసుకోమని సైగలతో చెప్పింది భర్తకు. బుద్ధిగా అవన్నీ రాసుకున్నాడు సుందరం. 'ల్, ష్ణ, ని, లా, ద్వా, లా' అని వున్న ఆ అక్షరాల వైపు చూస్తూ వుండి పోయాడు.. బుఱ్ఱ బద్దలు కొట్టుకున్నా అదేమిటో, అర్థం మేమిటో పాలు పోలేదు అతనికి.

టి.వి. వెనకాల వున్న గడియారం తొమ్మిదిం పావు చూపిస్తోంది. "ఇంకో పదిహేను నిముషాలు'' ట్రాన్స్‌లో వున్నట్టుగా అంది. 'హాఫెనవర్‌మోర్' అనే చిన్ననాటి టీచరు, తోడుగా లెక్కల పరీక్ష గుర్తొచ్చి చెమటల్లు పట్టాయి సుందరానికి.

'అ' అంటూ మరో అక్షరం కనబడింది తెరమీద. సుందరం బుఱ్ఱలో ఏదో మెరిసినట్టయి నోరు తెరవబోయాడు.

'ఉష్' అంటూ ఆఖరి బిట్ రాసే విద్యార్థినిలా.. ఊపిరి బిగపట్టింది రాగిణి. ఈసారి 'కృ' అన్న అక్షరం రాగానే ఇక ఉత్సాహం ఆపుకోలేక ఆర్కిమెడీస్ తాతలా అరిచాడు సుందరం "లాల్ కృష్ణ అద్వానీ " అని.

"అయ్యో... ఫోనండీ ...నంబరు దొరకదు" అంటూ రాగిణి అరవటంతో ఇద్దరూ ఫోను దగ్గరికి పరిగెత్తారు.

"ముందు సెల్ ట్రై చేయండీ" కంగారుగా అంది. "లైన్లన్నీ బిజీగా వున్నాయి కాసేపాగి ప్రయత్నించడండి'' అన్న కలకంఠి కంఠం వినగానే ఫోను పెట్టేసి 'లైన్స్ బిజీ ట' అన్నాడు సుందరం.




"అయ్యో.. టైమయిపోతోంది. మామూలు ఫోను ప్రయత్నించండి. ఒకదాని తరువాత ఒకటి.. నా వైపు అలా మొద్దులా చూసి చెప్పకండి" టెన్షన్‌లో మొగుడన్న విషయం మర్చిపోయి విసుక్కుంది రాగిణి.

"ఈ నంబరుతో ప్రస్తుతం ఏ టెలిఫోనూ పని చేయడంలేదు" అని ఒక సారీ... 'మీరు డయల్ చేసిన నంబరు ఒకసారి సరిచూస్కోండి' అని మరోసారీ వస్తున్నాయి.

గడియారం మీద సెకండ్ల ముల్లు కదులుతుంటే తన గుండెలో టైంబాంబు టిక్ టిక్‌లు వినిపించినంత ఆదుర్దాగా వుంది రాగిణికి.

సుందరం చేతిలో నుండి ఫోన్ లాక్కుని తనే గబగబ నంబర్లు నొక్కింది రాగిణి.

మళ్ళీ 'డిటో' రెస్పాన్స్ వచ్చింది 'ఈ వైపు లైన్లన్నీ బిజీగా వున్నాయి. కాసేపాగి ట్రై చెయండి' అని ఒకసారి 'ఈ నంబరుతో ప్రస్తుతం ఏ టెలిఫోనూ పనిచేయడంలేదు' అని మరోసారీ 'మీరు డయల్ చేసిన నంబరు ఒకసారి సరిచూసుకోండి 'అని ఇంకోసారీ వచ్చింది.

గడియారం నెమ్మదిగా పది గంటలు అయినట్టు పాట పాడింది.

రాగిణి ముఖం నిరాశతో నిస్పృహతో వాడి పోయింది. పట్టలేనంత కోపం కూడా వచ్చింది.

గుమ్మందాకా వచ్చిన మారుతీ కారు రయ్యిన వెనక్కి పోయిందన్న ఊహ మనసును మండిస్తుండగా...

''అంతా బోగస్... నంబర్లన్నీ కావాలని తప్పు ఇవ్వడమో లేక ఫోను పక్కన పెట్టేయడమో చేసి వుంటారు...'' అంటూ టి.వి. వాళ్ళ మీద మండిపడటం మొదలు పెట్టింది.

కల్యాణసుందరానికి జాలేసింది. "పోనీలే రాగిణీ.. మొన్న మనం అదేదో పుస్తకంలో ఫోటోలకు కాప్షన్ రాసి పంపించాం కదా "అక్కడ అది ఇక్కడ ఇది" అని... "దానికి గ్యారంటీగా ప్రైజు వస్తుందిలే..." అన్నాడు ఓదార్పుగా..

"మీదీ కాదు మాదీ కాదు" ఛానల్ లో అంత వరకు వస్తున్న సీరియల్ - మీ మొహాలకు ఈ రోజుకిది చాల్లే - అన్నట్టు తన రెండో భర్త చేసుకోబోయే మూడో పెళ్లిని భగ్నం చేయటానికి పథకం రచించిన కథానాయిక వికృతంగా నవ్వుతుండగా ఫ్రేమ్ ఫ్రీజ్ చేయబడింది.

''ప్రేక్షకుల విశేష ఆదరాభిమానాలు చూరగొన్న 'వెఱ్ఱివెంగళప్పలు' ఇంత వరకూ చూసారుగా. ఇక ఈ వారం ప్రశ్న.... 'తన రెండో భర్త చేసుకోబోయే మూడోపెళ్లిని కథానాయిక ఎలా భగ్నం చేస్తుంది?' సరైన సమాధానం రేపటిలోగా మాకు రాయండి! రెండు కే.జి.ల వెండి గెలుచుకోండి!" అంటూ అరుస్తోంది టి.వి. యాంకర్.

పళ్ళు నూరుతూ టి.వి. ఆఫ్ చేసి నీరసంగా మంచం మీద వాలి పోయింది రాగిణి.



# Some పుస్తకం

(గత సంచిక తరువాయి)

సమాజాన్ని పరికిస్తే చాలు, కార్టూనిస్టులకు బోల్డంత ముడిసరుకు దొరుకుతుంది. సమాజంలోని అవకతవకలు చూసి ఖండిస్తూ కవిత్వం అల్లుతారు కొందరు. వాటిని ఎత్తి చూపించి వదిలేస్తారు కార్టూనిస్టులు. ఉదాహరణకి ఈ కార్టూన్ చూడండి.




బస్సులు చాలలేదని ఆందోళన చేస్తూ ఉన్నవాటిని ధ్వంసం చేసే అవకతవక చేష్టలు చూస్తే ఒక చెంప నవ్వు, మరో చెంప ఏడుపు వస్తాయి. సమాజంలో వ్యత్యాసాలు ఎలా వుంటాయో చెప్పేందుకు ఓ రెండు కార్టూన్లు - రెండింటిలోనూ ఒకే ప్రశ్న 'పొదుపంటే ఏమిట'ని. కానీ బొమ్మ చూస్తే గానీ ధ్వని అర్థం కాదు. పొదుపుచేసే అవకాశమే లేని స్థితి ఒకరిదైతే, అవసరమే లేని స్థితి మరొకరిది.




సరసి కార్టూన్లు
250 కార్టూన్లు, 50 రూ॥లు
ప్రతులకు - విశాలాంధ్ర




సరదాకోసం క్రికెట్ ఆడేది కొందరయితే, దాన్ని చూడడానికి వచ్చి డబ్బు, సమయం నష్టపరచుకునే వారెందరో! మరి వారి మధ్య 'టాస్' వేయడానికి ఉపయోగించే నాణెం కోసం అర్రులు చాచేవాడూ ఉంటాడన్న కఠోరసత్యాన్ని చెప్పిన కార్టూనిస్టు సరసి.



నేటి యాంత్రిక సమాజంలో మారిపోతున్న వైవాహిక వ్యవస్థ గురించి కూడా సరసి ఘాటుగానే వ్యాఖ్యానించారు. పదిరోజుల వ్యవధిలో వందమంది పెళ్లికూతుళ్లను చూసే అమెరికా పెళ్లికొడుకుల పోకడలను కాస్త అతిశయోక్తి స్థాయికి తీసుకెళ్లి మరీ చూపించారు. 'కాస్త' అని మాత్రమే అనడానికి కారణం ఏమిటంటే చాప అదీ లేకపోయినా ఏర్‌పోర్ట్ లాంజ్‌లో ఇలాటి తంతు ఇప్పటికే జరుగుతూండవచ్చన్న సందేహం వల్ల!




నేటి వైవాహిక వ్యవస్థను శాసిస్తున్నది ఆర్థిక పరమైన లావాదేవీలే! పెళ్లిపీటల మీదనే జీతం ఏం చేశావని పెళ్లాన్ని అదిలించే మొగుళ్లకు ఎలా బుద్ధి చెప్పాలోకూడా సూచించాడాయన! వీలైతే ఆ వికటపు నవ్వు కూడా ప్రాక్టీసు చేయవచ్చు!




నాణానికి మరోవైపు కూడా చూపాడు సరసి, ఈ కార్టూన్ ద్వారా! ఎలాగోలా పెళ్లి చేసేస్తే చాలు. మొగుడిదే భారం అను కునే ఆడపిల్ల తలిదండ్రులకు ఓ చెంపపెట్టు!




(సశేషం)

- ఎమ్బీయస్ ప్రసాద్

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

## ఎం.చిత్తరంజన్

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

| | |
|---|---|
| **రచన** | : సత్యవాడ సోదరీమణులు |
| **గానం** | : శ్రీమతి వేదవతి ప్రభాకర్‌రావు |
| **సంగీతం** | : ఎం. చిత్తరంజన్ |
| **రాగం** | : నటభైరవి - అసావ్‌రి థాట్ (హిందుస్తాని సం॥) |
| **తాళం** | : త్రిశ్రగతి (కర్ణాటక సం॥) దాద్రా (హిందుస్తాని సం॥) |
| **ఆరోహణ** | : స రి గ మ ప ద ని స |
| **అవరోహణ** | : స ని ద ప మ గ రి స |

షడ్జము, చతుశృతి రిషభం, సాధారణగాంధారం. శుద్ధమధ్యమం, పంచమం, శుద్ధదైవతం , కైశికి నిషాదం యీ రాగంలోని స్వరాలు.

### అనురాగపు వెన్నెలలు

ప॥ అనురాగపు వెన్నెలలు కురిపించే జాబిల్లి
చెలిమిలోని నెత్తావులు వెదజల్లే సిరిమల్లి
మనసులోన తలపులోన నిలిచిన నానెచ్చెలి ॥అనురాగపు॥
చ॥ ఆకురాలువేళ నీవు ఆమనివై వచ్చేవు
చీకటి కన్నుల వాకిట దీపిక వెలిగించేవు
మూగవడిన హృదయవీణ తీగలు సవరించి
మధురగీతికలు ఎంతో హాయిగ వినిపించేవు ॥అనురాగపు॥
చ॥ నీ చల్లని చేయితాకి పల్లవించె నాహృదయం
నీ తీయని పలుకులలో కురిసెనులే అమృతం
నెచ్చెలీ నీవులేక లోకమంత శూన్యము
వాడనీకు ఏవేళల చెలిమి పారిజాతము ॥అనురాగపు॥

అన్యస్వరమైన చతుశృతిదైవతం కూడా యీ పాటకు కూర్చబడిన బాణీలో వాడబడినది. 20వ మేళకర్తయైన యీ రాగం కర్ణాటక శాస్త్రీయ సంగీతంలో కంటే లలిత శాస్త్రీయ, లలిత సంగీతాలలో ఎక్కువ ప్రాచుర్యాన్ని పొందినది. జయదేవ అష్టపదులు, అన్నమాచార్యకీర్తనలను లలిత శాస్త్రీయ పద్ధతిలో చాలామంది కళాకారులు పాడుతుంటారు ఈ రాగంలో. 'యామిహే కమిహ శరణం' (జయదేవుని రచన - బాల మురళీకృష్ణ గానం), 'రాజీవనేత్రాయ రాఘవాయనమో' (అన్నమాచార్యకీర్తన-నూకల చినసత్యనారాయణ గానం)మొదలగునవి మచ్చుకు కొన్ని. లలిత సంగీతంలో నటభైరవి చాలా పాప్యులర్ రాగం. ఆకాశవాణిలోను, చలన చిత్రాలలోను ఎంతో మంది స్వరకర్తలు సుమధురమైన పాటలను రూపొందించారు. భక్తి, విరహ, విషాదాలకు బాగా అనువుగా వుండే రాగం. లలిత సంగీతంలో నటభైరవి రాగాన్ని వినియోగించడంలో అన్యస్వరమైన చతుశృతి దైవతాన్ని కూడా కలుపుకుంటూ బాణీలు కూర్చినవి చాలామంది స్వరకర్తల పాటలలో మనకు దర్శనమిస్తాయి. రజనీకాంతరావు, ఈమనిశంకరశాస్త్రి, సాలూరు రాజేశ్వరరావు మొ॥ వారి పాటలు అలాంటివి వున్నాయి. నేను కూడా అలాంటి మిశ్రమంతో కొన్ని బాణీలు కూర్చాను. చలన చిత్రాలలో కూడా చాలామంది సంగీత దర్శకులు నట భైరవి రాగం ఆధారంగా ఎన్నో పాటలు మనకు అందించారు. శంకర్ -జై కిషన్, హేమంత్ కుమార్, మదన్‌మోహన్, నౌషాద్, చిత్రగుప్త మొదలగు॥వారు హిందీ చిత్రాలలోనూ, పెండ్యాల, రాజేశ్వరావు, ఘంటసాల, కె.వి.మహదేవన్, సి.ఆర్. సుబ్బరామన్, యం.యస్. విశ్వనాథన్ మొదలగు వారు తెలుగు చిత్రాలలోనూ నట భైరవి రాగం ఆధారంగా కూర్చినపాటలు నేటికీ ప్రజల హృదయాలను అలరిస్తూనే వున్నాయి.

జన్మతః అంధులైనా, కంటితో చూడలేని వాటిని మనోనేత్రంతో దర్శించగలిగిన సత్యవాడ సోదరీమణుల మనసు, ఆలోచన ఒకటే. శరీరాలు వేరైనా వారిమాట ,పాట, బాట అంతా ఒకటే. చూపులేని అటువంటి వారికి ప్రేమ పూరితమైన స్పర్శ, చల్లని మాట కొండంత బలాన్నిస్తాయి. జాబిల్లి కురిపించే వెన్నెల తన చల్లని స్పర్శతో వారి హృదయానికి అనురాగాన్ని పంచి యిచ్చి ప్రేమామృతాన్ని కురిపిస్తుంది. అట్టి వెన్నెలను నెచ్చెలిగా భావించి తమ పట్ల చూపే ఆ చెలిమి పారిజాతము వంటిదని, అది ఎన్నడూ వాడిపోకూడదని, ఆ చెలిమి వారి 'చీకటి కన్నుల వాకిట దీపిక' వెలిగిస్తుందని "అనురాగపు వెన్నెలలు కురిపించే జాబిల్లి " అనే యీ గీతంలో వారు సున్నితమైన భావాలతో ఎంతో హృద్యంగా రూప కల్పనగావించారు. ఈ పాటకు నటభైరవి రాగం ఆధారంగా నేను బాణీ కూర్చగా శ్రీమతి వేదవతి మధురంగా గానం చేయగా ఆకాశవాణి హైద్రాబాద్ కేంద్రం 'ఈ మాసపు పాటగా' ప్రచారం చేసింది.

### సత్యవాడ సోదరీమణులు

విశాఖపట్నం వాస్తవ్యులు శ్రీసత్యవాడ శివరామదాను, శ్రీమతి నారాయణమ్మ దంపతుల సంతానమైన రఘునాథమ్మ, సూర్యకుమారి సాహిత్య, సంగీత రంగాలలో 'సత్యవాడ సోదరీమణులు'గా మంచి పేరు గడించుకున్నారు.

తమకు అంధత్వం పుట్టుక నుంచి వున్నందువలన జీవితమంతా శూన్యమని ఎంతో నిరాశతో కలత చెందిన మనసులకు ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంనుండి నేను 70వ



సత్యవాడ సోదరీమణులు

దశకంనుండి నిర్వహించిన "ఈ పాట నేర్చుకుందాం" అనే లలిత సంగీత శిక్షణా కార్యక్రమం ఊరట కలిగించింది. ఆ కార్యక్రమాలలో నేర్పిన పాటలను వారు అభ్యసిస్తే సంగీత రంగంలో పైకి రాగలమనే ఒక నమ్మకం ఏర్పడింది. త్వరలోనే కొన్ని పాటలు అభ్యసించి విజయవాడ కేంద్రంలో

లలిత సంగీతంలో ఆడిషన్ టెస్టుకు హాజరై, అందులో ఉత్తీర్ణులై మొట్టమొదటి లలిత సంగీత కార్యక్రమంలో నేను నేర్పిన పాటలు పాడి ఆ క్యాసెట్‌ను హైద్రాబాదులో వున్న నాకు వారి తండ్రిగారి ద్వారా పంపారు. అది విన్న నాకు ఎంతో ఆనందం కలిగింది.

తమకు గల ప్రతిభ వలన, చేసిన అభ్యాసం వల్ల మంచి గాయనీమణులుగా వారు తరచూ ఆకాశవాణి విశాఖపట్నం కేంద్రం నుండి పాడుతూ పేరు ప్రఖ్యాతులు గడించుకున్నారు. వీరి సోదరుడు వేణుగోపాల్ మంచి వయొలిన్ విద్వాంసుడు. 1995 నుండి ఆకాశవాణి హైదరాబాద్‌లో నిలయ విద్వాంసుడుగా వున్నాడు. రెండు దశాబ్దాలుగా సత్యవాడ సోదరీమణులు సాహిత్యరంగంలో ఎంతో కృషి చేశారు. 'సత్యసాహితి' అనే సంస్థను స్థాపించి విశాఖపట్నంలో ఎన్నో సాహితీ సభలు నిర్వహించారు. ప్రతిఏడూ కృష్ణశాస్త్రి జయంతి ఉత్సవాలు జరుపుతూ వుండేవారు. 1996 ప్రాంతంలోను, మరొకసారి కూడా విశాఖపట్టణానికి నన్ను ఆహ్వానించి సన్మానించారు. జంట గాయనులుగాను, జంట రచయిత్రులుగాను వర్ధిల్లుతున్న యీ సోదరీ మణులు ఒకే ఆలోచన, ఒకే వ్యక్తీకరణ, ఒకేనాదంగా వుంటున్నారు.



వీరికి కథారచన జీవనానికి అవసరమైన ఊపిరి. నేటి మధ్య తరగతి జీవితాన్ని అధ్యయనం చేసి జీవితంపై అపారమైన మమకారంతో అనుకంపనతో ప్రవచించిన కథలు వీరివి. వీళ్ళు చాలా కథలతో పాటు, నవలలు, రేడియోనాటికలు, సంగీతరూపకాలు, లలిత గీతాలు కూడా రాశారు. ముత్యాలు నీళ్ళోసుకుంది, మాయని పున్నమి, అమ్మాయి పరికిణి మొ॥గు కథలు, గుడిసెలో గులాబీలు, రాగతరంగాలు (నవలలు), చిగురు తొడగని వసంతం, మధుర సంక్రాంతి, చిలకల పందిరి, మహాత్ముడు మొ॥గు సంగీత రూపకాలు, నాటికలు , రసమయి (లలిత గీతాల సంపుటి) మొ॥నవి మచ్చుకు కొన్ని. ఎంతో వస్తువైవిధ్యంతో సున్నితమైన భావాలను సుకుమారంగా తమ రచనలలో పొదిగారు. అనేక మంది ప్రముఖ పండితులు, కవులు , సాహితీవేత్తల ప్రశంసలను పొందారు.

1995లో అమెరికాలోని 'తానా' సభలలో చికాగోలో వీళ్ళిద్దరూ తమగానాన్ని వినిపించారు. 1999 లో రఘునాథమ్మకు సాహిత్యానికై రాష్ట్రపతి కె.ఆర్. నారాయణన్ నుండి అవార్డు లభించింది. 2001లో ఆంధ్రప్రదేశ్ గవర్నర్ డా॥సి . రంగరాజన్ నుండి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర బెస్ట్ మ్యూజిక్ అవార్డును వీరికి హెలెన్ కెల్లర్‌డేను పురస్కరించుకుని ప్రధానం చేశారు. 2003లో సూర్యకుమారి వీణా వాయిద్యానికి ప్రస్తుత రాష్ట్రపతి డా॥అబ్దుల్ కలాం నుండి అవార్డు లభించింది.

ఇలా సవ్యసాచులుగా తమ సంగీత సాహిత్య ప్రతిభలతో సరస్వతీ ఆరాధన చేసుకుంటూ జీవనం సాగిన్తున్న యీ సోదరీమణులు ధన్యజీవులు.

## నటభైరవి రాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| **తెలుగు** | | | |
| 1. కనుపాప కరవైన కనులెందుకో | చిరంజీవులు | ఘంటసాల, పి. లీల | ఘంటసాల |
| 2. జగదభిరామ రఘుకుల సోమ | రామాలయం | ఘంటసాల, బృందం | ఘంటసాల |
| 3. వాడిన పూలే వికసించెనే | మాంగల్యబలం | ఘంటసాల, సుశీల | మాస్టర్‌వేణు |
| 4. అనురాగము విరిసేనా | దొంగరాముడు | సుశీల | పెండ్యాల |
| **హిందీ** | | | |
| 1. తూ ప్యార్ కా సాగర్‌హై | సీమా | మన్నాడే,బృందం | శంకర్ - జైకిషన్ |
| 2. టూటే హువే ఖాబోఁనే | మధుమతి | రఫీ | సలిల్ చౌధురి |
| 3. హమ్ దర్ద్ కె మారోఁకా | దాగ్ | తలత్ మొహమూద్ | శంకర్-జైకిషన్ |
| 4. ఆప్ కీ నజ్ రోఁ నే సమ్‌ఝా | అన్‌పఢ్ | లత | మదన్‌మోహన్ |
| 5. తేరేబినా ఆగ్‌మే చాంద్‌నీ తూ ఆజా | ఆవారా | లత | శంకర్- జైకిషన్ |
| 6. తుమ్ అప్‌నీ దిల్‌కి దునియాసే మిటా జాతేతో అచ్ఛాథా | యాస్మిన్ | లత, తలత్ | సి.రామచంద్ర |

50 సంవత్సరాల నట జీవితాన్ని పూర్తి చేసుకున్న స్వర్ణోత్సవ నటి జమున 'హాసం' పాఠకుల కోసం ప్రత్యేకంగా అందిస్తున్న జ్ఞాపకాల ధారావాహిక

17

# నేనూ నా పాటలు



- శ్రీమతి జమునా రమణారావు

'బంగారు సంకెళ్లు' గురించి విశేషంగా చెప్పుకోవల్సింది ఏమిటంటే - పెళ్లయిన తరువాత సాధారణంగా సినిమా స్టార్స్‌కు గ్లామర్ పోతుంది, లావెక్కి పోతారు..! పెళ్లయింది కదా ఇక ఆవిడకు గ్లామర్ ఏముంటుంది అన్న టాక్ కూడా సినిమా పరిశ్రమలో స్ప్రెడ్ అవడం చాలా సహజం. కానీ నా అదృష్టం ఏమిటంటే పెళ్లయిన కొత్తలో శ్రీకృష్ణ తులాభారం, మిలన్, పూలరంగడు... ఇలా 5 సినిమాలు రిలీజ్ అయ్యాయి. అందులో మూడు సూపర్‌హిట్. మిలన్, శ్రీకృష్ణతులాభారం, పూలరంగడు... జమున పెళ్లయిన తరువాత ఇంకా అందంగా ఉంది అన్న టాక్ వచ్చింది. ఇక ఆ తరువాత నాలుగైదేళ్లు సక్సెస్‌ఫుల్ పిక్చర్లు వచ్చాయి.

'బంగారుతల్లి' సినిమా షూటింగ్ టైమ్‌లో గర్భవతిని అవ్వడం... తరువాత సంవత్సరం పాటు గ్యాప్ తీసుకోవటం జరిగింది. 15, 20 రోజులు షూటింగ్ అయిన తరువాత నుంచీ నా డెలివరీ అయ్యేవరకూ వెయిట్ చేశారు. బాబుకు 3వ నెల వచ్చిన తరువాత షూటింగ్ స్టార్ట్ అయింది... విచిత్రమేమిటంటే నేను డెలివరీకి హైదరాబాద్ వచ్చాను. వంశీ పుట్టాడు. బాబుకి మూడో నెల వచ్చింది. కోగంటి కుటుంబరావు గారికి నన్నూ, నాగేశ్వరరావుగారిని పెట్టి సినిమా తీయాలని చిరకాల వాంఛ. కథ అన్నీ రాసుకున్నారు. అంతా రెడీ చేసుకున్నాక... అక్కడ ... మద్రాస్‌లో టాక్ ఎలా పెట్టారంటే... అమ్మో జమున చాలా లావు అయిపోయింది.. ఇక అసలు సినిమాలకే పనికిరాదంట.. అన్న రూమర్ స్ప్రెడ్ చేశారు. ఇక ఆదరాబాదరాగా కుటుంబరావుగారు హైదరాబాద్‌కు వచ్చారు. వచ్చి నన్ను చూసేసరికి ... ఇదివరకటి కంటే...

'బంగారు సంకెళ్ళు' చిత్రంలో పాశ్చాత్య నృత్య రీతులను అభినయిస్తూ



# నేనూ నా పాటలు



ఇంకా సన్నబడి పోయాను నేను. నేనెప్పుడూ డైటింగ్‌లాంటివి చేయను. నాకు సిజేరియన్ అయింది కాబట్టి జనరల్‌గా నేను కొంచెం కేర్ తీసుకోవాలి కాబట్టి... బిడ్డ తల్లి అంటే శారీరకంగా కొంచెం మార్పులొస్తాయి అని చెప్పి ఒక్కపూట భోజనం.. సాయంత్రం చపాతీలు. ఇలా చాలా కేర్ తీసుకున్నాను. దాంతో యంగర్‌డేస్‌లో కంటే చాలా సన్నబడిపోయాను. ప్రాణాయామం చేయటం వల్ల పొట్ట పెరగలేదు. అటువంటి సమయంలో ఆయన రావటం.. చూడటం, నన్ను హీరోయిన్‌గా పెట్టి 'మనసు-మాంగల్యం' తీయడం జరిగింది. తరువాత పిక్చర్ 'శ్రీమంతుడు'. ఇదీ నాగేశ్వరరావుగారితోనే.

ఆ పిక్చర్‌లు రిలీజ్ అయిన తరువాత జమున బాగుంది... ఎక్కడా బిడ్డ తల్లిలా అనిపించలేదనే టాక్ వచ్చేసింది. ఆ తరువాత బంగారు తల్లి రిలీజ్ అయింది. బాబు పుట్టాక కలెక్టర్ జానకి, పండంటి కాపురం.. అలా చాలా సినిమాలు యాక్ట్ చేశాను. ఈ బంచ్‌లో వచ్చిందే 'బంగారు సంకెళ్లు'. దీని ప్రత్యేకత ఏంటంటే సినిమా చూస్తుంటే... జమునకు పెళ్లయింది.. ఒక కొడుకు కూడా ఉన్నాడు అని ఎవరూ తలుచుకోరు. అంత సన్నగా.. అందంగా కనిపించాను. అన్నిటికంటే ఎక్కువగా ఆ సినిమాలో డ్యాన్సులు...! ఒక డ్యాన్సర్ పెంచుతుంది కథానాయికను... జి. వరలక్ష్మిగారు ఆ పాత్ర వేశారు. మొదట... నేను 'పెళ్లి రోజు'లో డ్యూయెల్ రోల్ వేశాను. తర్వాత ఇందులో. తల్లిగా, కూతురుగా నేనే వేశాను. తల్లి పాత్ర చచ్చిపోతుంది. కూతురేమో ఒక డ్యాన్సర్ దగ్గర పెరుగుతుంది. మంచి సూపర్బ్ డ్యాన్సులు పెట్టారు నాకు. కూచిపూడి, కథక్, భరతనాట్యం, వెస్ట్రన్... ఇలా !

**చిత్రం: బంగారు సంకెళ్లు** **రచన : ఆత్రేయ**
**సంగీతం: పూర్ణచంద్రరావు** **గానం : ఘంటసాల, సుశీల**

అ: అందం వురికింది
వయసుతో పందెం వేసింది
మనసులో బందీ అయింది
ఇదేమి బంధం అంటూంది
అందాలొలుకు చంద్రుని అందుకోవాలనుకొనా
ఎగిసే అలలు తెలిపేదేమని
ఆ: ఏమని?
అ: జగమంతా ప్రేమబంధం
సొగసంతా నీది నీదే రా రమ్మని!
ఆ: విరిసే నిండు జాబిలి కడలిపూచి పూవులే
ఆ: ఎగసే అలలబాల అదే కడుపున పంటలే
అది, అన్నా చెల్లి బంధం
హృదయాల జన్మజన్మల అనుబంధం....
అ: ఎదిగే మావికొమ్మల కౌగిలించాలనుకుని
ఒదిగే మాధవీలత వలపు పిలుపే ఏమని?
ఆ: ఏమని?
అ: తనలోనే కరిగిపొమ్మని
తనువంతా నీది నీదే రా రమ్మని?
ఆ: ఎదిగే గున్నమావిని పుడమితల్లే కన్నది
ఒదిగే మాధవీలత తోడబుట్టిన చిన్నది
అది అన్నా చెల్లి బంధం
హృదయాల జన్మజన్మల అనుబంధం













డ్యాన్సు డైరెక్టర్ హీరాలాల్ మాస్టర్ !! నిజంగా మాట్లాడితే నేను ప్రొఫెషనల్ డ్యాన్సర్‌ను కాను. అయినా ఆయన ఎంత బాగా చేయించారంటే.. ఒక ప్రొఫెషనల్ డ్యాన్సర్‌లాగా పర్ఫెక్ట్ మూమెంట్స్ ఇప్పించారు. నేనుకూడా దానికి చాలా కృషి చేశాను. ఇంట్లో కూడా

**ఆయా నృత్యాలకనుగుణమైన దుస్తులలో శ్రీమతి జమున (హీరో హరనాథ్‌తో)**



## నే నూ నా పా ట లు



**చిత్రం: బంగారు సంకెళ్లు** | **రచన : సి. నారాయణ రెడ్డి**
**సంగీతం: పూర్ణచంద్రరావు** | **గానం :పి.సుశీల**





మనసైన... నా స్వామి.. రాడేలనే..
మనసైన నా స్వామి రాడేలనే
నా మదిలోని నెలరాజు లేడేలనే ॥ మనసైన॥
జిలిబిలి నవ్వులు చిలికినవాడే
వలపే తానై పిలిచినవాడే
నందకిశోరుడే నా వగకాడే
వేణుగానఝురిలోన ముంచెనో
నితాంతలతాంతవసంత వేళల
మరులు గొలిపినాడే
మరచినాడే - దరికిరాడే - మగువరో॥మనసైన॥
అల్లరిగాలి - చల్లగ వీచె
సిగలో పూలే - నగవులుదాచె
విరివిలుకాడే - తరుణమువేచె
పొంచిపొంచి పులకించి మించి
బిరబిరాన వరాలశరాలు దూసె
కలలబరువు పెరిగె
నిదుర తరిగె - రేయి కరిగె - చెలియరో॥మనసైన॥

















ప్రాక్టీస్ చేసేదాన్ని. అంత పెద్దాయన హీరాలాల్‌గారు... చాలా బిజీ.. అయినా కూడా మా ఇంటికొచ్చి నేర్పించేవారు.

'బంగారు సంకెళ్ల'లో పాటలు తక్కువే. కథాగమనమే ఎక్కువ. ఉన్న పాటల్లో నాకు నచ్చినవి రెండున్నాయి. కథలో మంచి ట్విస్ట్ ఉంది. ఓ అన్న తనకు తెలియకుండా తన చెల్లెల్ని ప్రియురాలనుకుని... ప్రేమిస్తాడు... అదీ ట్విస్ట్! అందులో. గుమ్మడి గారు ఇందులో విలన్ పాత్ర వేశారు. ఆయనకు పుట్టిన పిల్లలమే నేనూ, హరనాథ్‌గారూనూ! అన్న చెల్లెల్ని ప్రేమిస్తే - ఈమె మాత్రం వేరే అతన్ని ప్రేమిస్తుంది. ఆ పాత్రను రామకృష్ణ వేశారు. ఈ సినిమాలో హరనాథ్ గారితో నాకు ఓ డ్యూయెట్ సాంగ్ పెట్టారు... అందం ఉరికింది... వయసుతో పందెం వేసింది అని చెప్పి.. పాట రాసింది ఆత్రేయ. మహానుభావుడు. ఎంత గొప్పగా రాశారో ఈ పాటను. అన్నేవెా హీరోయిన్‌ను ఊహించుకుంటూ పాట పాడుతుంటే.. ఈ అమ్మాయి సముద్రపు అలలు, జాబిలి... ఆ సముద్రం కడుపులోనుండే వచ్చాయని. అలాగే కొమ్మా, తీగ గురించి చెప్పినప్పుడు.. అవి కూడా భూమిలో నుండే వచ్చాయని ఓపెన్‌గా అన్నాచెల్లెళ్ల బంధంగా చెబుతుంది. అది సాహిత్యపరంగా ఆత్రేయగారి గొప్పతనం. మ్యూజిక్ పరంగా చాలా మంచి పాట. అలాగే టేకింగ్ కూడా చాలా లెంగ్తీ షాట్స్ తీశారీ పాటలో.

ఈ సినిమాకి మ్యూజిక్ ఇచ్చింది పూర్ణచంద్రరావుగారు. 'చాంద్' అని అంటారాయన్ని. నేటి ప్రముఖ నృత్య దర్శకురాలు, ఇటీవల 'పల్లకిలో పెళ్లికూతురు' సినిమాకి దర్శకత్వం కూడా వహించిన సుచిత్రగారికి ఈయన నాన్నగారు. చంద్రబోస్‌కి మావగారు...! అంతేకాదు పండంటి కాపురం సినిమాలో 'మనసా కవ్వించకే నన్నిలా' వంటి గొప్ప పాటను రాసిన ప్రముఖ దివంగత రచయిత గోపీగారికి చాంద్ గారు చిన్నాన్న అవుతారు. ఈ చాంద్ గారు స్వరపరిచినదే మరో పాట.... 'మనసైన నా స్వామి రాడేలనే...!' క్లాసికల్ సాంగ్... చాలా మంచి సాహిత్యమూ, సంగీతమూ ఉన్న పాట. ఇందులో మూడు రకాల నృత్యరీతుల్ని పెట్టారు. మంచి గెటప్‌లున్నాయి. అందులో మొదటిది క్లాసికల్‌గా కూచిపూడి గెటప్‌లో ఉంటుంది.. రెండోది రాధలాగా గోపిక డ్రెస్. మూడోది కథక్.... కాస్ట్యూమ్స్ అదే స్టయిల్‌లో ఉంటాయి.

ఈ సినిమాలో ఇంకోటేమిటంటే మామూలుగా నేను వెస్ట్రన్ డ్రస్‌లు ఎప్పుడూ వేసుకోలేదు.. చాలా స్ట్రిక్ట్. సినిమాలో కథ ప్రకారం హరనాథ్ వచ్చి "ఇంత చక్కగా డ్యాన్స్ చేశారు.. మరి లలిత కళలన్న తరువాత అన్నీ నేర్చుకోవాలి కదా'' అని చెప్పి.. ''నేను శాంతినికేతన్‌లో వెస్ట్రన్ టైప్ డ్యాన్సులు కూడా నేర్చుకున్నాను.. అవి మీకు నేర్పుతా''నని అంటాడు. అలా ఆయన నేర్పుతున్నప్పుడు ఆ టైట్ జీన్స్.. టైట్ టీ షర్ట్ వేసుకుని సెట్‌లోకి వెళ్లాను. నాకేమిటంటే ఇటువంటి డ్రెస్‌లు వేసుకున్నప్పుడు చాలా సిగ్గేస్తుంది. ఏదో వేషం కోసం వేస్తాం. ఇటువంటివి వేసినప్పుడు పైన ఓ దుప్పటిలాంటిదో, ఓ సిల్కు శాలువా లాంటిదో వేసుకుని ఆ సెట్లో కూర్చుని జస్ట్ బిఫోర్ టేక్ టైమ్‌లో మాత్రం తీసేదాన్ని. డ్యాన్సులో కూడా అబ్జర్వ్ చేస్తే అందులో క్యారెక్టర్ కూడా ఇబ్బందిగానే ఫీలవుతూ ఉంటుంది. నాకు కూడా అదే ఫీలింగ్ .. మాటి మాటికి షర్ట్ లాక్కోవడం..

# నే నూ నా పా ట లు



ఇలా మూడు రకాల డ్రెస్సులు మార్చాము. సాంగ్స్‌లో అప్పర్ క్లాత్ లేకుండా యాక్ట్ చేయడం జరిగింది. 'పుట్టిల్లు'లో అప్పర్ క్లాత్ గురించి ఎంత గొడగ చేశామో తెలిసిందే కదా! ఒక్కోసారి ఇలాంటి కొన్ని క్యారెక్టర్స్‌కు తప్పనిసరి.

ఈ డాన్సులో కూడా మూడు రకాల వెస్టర్న్ స్టయిల్స్... ఒకటేమో వాల్ట్జ్, రెండోది చచచ, మూడోదేమో మెక్సికన్... అలా మూడు రకాల డ్యాన్సులు... ఇప్పటికి కూడా నాకు కాలక్షేపం కావాలంటే డాన్సులు ఉన్న ఆ సీన్లు, డ్యూయెట్ సాంగ్ వేసుకుని చూస్తూ ఉంటాను. జనం చూస్తున్నప్పుడు అసలు ఈవిడ ఒక బిడ్డ తల్లి అనే ఊహకు లోనుకారు. అంత బాగా, ఫర్ఫెక్ట్ హెల్త్ మెయిటెన్ చేశాను.

అప్పటికి ఫాస్ట్ కెమెరాలు వచ్చేశాయి.. ఫాస్ట్ కెమెరామెన్‌లు వచ్చేశారు. కాబట్టి మొత్తం మూడు రోజుల్లో అయిపోయింది. వెస్టర్న్ డ్యాన్స్ పాట ఒక రోజు పడితే.. క్లాసికల్ డ్యాన్స్ పాట రెండు రోజులు పట్టింది. మొత్తం మూడు రోజులు పట్టింది. నేర్చుకోవడానికే ఎక్కువ కష్టపడ్డాం. నాకు చాలా బాగా నచ్చిన డ్యాన్సుల్లో ఈ డాన్సు కూడా ఒకటి. అటు క్లాసిక్, ఇటు వెస్టర్న్ స్టయిల్ రెండూ డ్యాన్సు రాని నా చేత కూడా ఈ సినిమాలో అంత గొప్పగా చేయించారంటే... హీరాలాల్ గారికి హ్యాట్సాఫ్ చెప్పాలి.

నేను 'ఇల్లరికం' అప్పుడు చెప్పాను... ఆయన్ని చూస్తేనే నాకు హడల్ అని. అలాంటిది నా చేత ఎంత గొప్పగా చేయించారో చెప్పనలవి కాదు.

అలాగే డైరెక్టర్ రామినీడు గారు.. ఆయన కూడా బాగా కో ఆపరేట్ చేసి చాలా గొప్పగా తీశారు.

బంగారు సంకెళ్ళులో అన్ని పాత్రలూ చాలా చక్కగా మలిచారు. అందులో చెప్పుకోవల్సిన క్యారెక్టర్ జి.వరలక్ష్మి గారిది. ఆవిడ గురించి చెప్పాలంటే నా చిన్నతనం గుర్తుకొస్తుంది. చిన్నప్పుడు ఆవిడ యాక్ట్ చేసిన 'దీక్ష' చూశాను. ఆ తరువాత ఏదో పిక్చర్‌లో... వాంప్ క్యారెక్టర్ చాలా గొప్పగా యాక్ట్ చేశారు.. ఎంత కాంట్రాస్ట్ అంటే... 'ఆ వరలక్ష్మి, ఈ వరలక్ష్మి ఒక్కటేనా...' అని మురిసిపోయాను నేను. అలాగే 'మనసైన నా రాజు..' పాటలో... ఆవిడ క్లోజప్ ఉంటుంది... ఐ బ్రోస్ పైకి క్రిందకి చాలా చక్కగా తిప్పుతారు. ఎంత గ్లామరస్‌గా ఉన్నారావిడ. ఎంత చక్కటి ఫెర్మార్మెన్స్!? ఆవిడంటే నాకు చాలా ఇష్టం. అలాగే ఆవిడను తలుచుకున్నప్పుడు డి.ఎల్.నారాయణ గారి 'దొంగల్లో దొర' గుర్తొస్తుంది. అందులో పూర్తి వాంప్ క్యారెక్టర్ ఆవిడది. ఆ వాంప్ క్యారెక్టర్ ఎంత బాగా చేశారంటే... ఆ స్టయిల్ ... ఆ గ్రేస్‌ఫుల్ లుక్... అవే ఆవిడకున్న పెద్దఎస్సెట్.. కళ్లల్లోనే చూపిస్తుందామె.. శృంగారం కానీ, కోపంగానీ..! ఆవిడ వాయిస్ పట్ల నాకు కొన్ని అభిప్రాయాలు ఉన్నాయి. ఒక్కోసారి తేలి పోతున్నట్లు ఉంటుంది. కానీ ఆవిడ ఫెర్ఫార్మెన్స్ మాత్రం అద్భుతం. 'దొంగల్లో దొర'లో ఆమె వాంప్ క్యారెక్టర్‌గా చచ్చిపోయినప్పుడు కూడా యమా స్టయిల్‌గా చచ్చిపోతుంది. హీరో చేతిలో చేయివేసి.... అతని కళ్ళలోకి చూస్తూ.. మోస్ట్ రొమాంటిక్‌గా... చచ్చిపోతుంది. అప్పుడు ఆ కళ్లలో ఎంత భావం చూపించారంటే... చచ్చిపోవటంలో కూడా ఆ స్టయిల్ పోలా. ఆ వాంపిష్ స్టయిల్ పోకుండా ఏడుస్తూ... చచ్చిపోతూ... బాధలో కూడా... ఏ వాంప్ స్టయిల్ ఆవిడ మెయిటెన్ చేసిందో అది పోకుండా... చాలా బాగా చేశారు.

'బంగారు సంకెళ్లు'లో మొత్తం అంతా ఆవిడ అందంగా కనిపించారు. నాకో అలవాటు ఉంది.. మద్రాస్ వెళ్లినప్పుడు... పాతతరం వాళ్లనందరినీ చూసొస్తా. అప్పుడుగానీ నాకు తృప్తి ఉండదు. మొన్న నేను భానుమతిగారి ఇంటికి వెళ్లాను. ఆవిడ అసలు విడిచిపెట్టలేదు. రెండున్నర... మూడు గంటలు...!!

గీతాంజలి తన కారు తీసుకొచ్చింది... భానుమతి, ఎస్.వరలక్ష్మి, జి.వరలక్ష్మి ఇళ్లకు వెళ్లాలని మా ప్రోగ్రాం. భానుమతిగారు రెండు మూడు గంటలు కూర్చోపెట్టారు. మధ్యాహ్నాం నాలుగు గంటలకు ఎస్.వరలక్ష్మిని మీట్ అయ్యాను. ఆవిడ కూడా గ్రేట్ సింగర్. విచిత్రమేమిటంటే ఆవిడ కంఠం ఇప్పటికీ ఏమీ మారలేదు. ఎంత బాగా పాడిందో! మొన్న నేను కలిసినప్పుడు "అమ్మా మీరు ఇప్పటికీ పాడగలరా" అంటే "ఏం మారలేదురా బాగా పాడతాను" అంటూ ఊరికే కొన్ని పద్యాలు పాడి వినిపిస్తే అద్భుతం అనిపించింది. "అమ్మా ఒకసారి హైదరాబాద్ రాకూడదా, ముఖ్యమంత్రి గారితో మాట్లాడి మంచి సన్మానం చేయిస్తాను.. నేనే ఆర్గనైజ్ చేస్తాను" అన్నాను. అలా వాళ్లిద్దరినీ కలిశాను కానీ.... జి.వరలక్ష్మిగారి అడ్రస్ మాత్రం నాకు దొరకలేదు. టైం లేక వచ్చేశా.

శ్రీమతి జమునకు నచ్చిన మరికొన్ని పాటల గురించి వచ్చే సంచికలో...





# అన్నమయ్య పద భావ దర్శనమ్ 4



నిర్వహణ
జి.బాలకృష్ణప్రసాద్

## ఎంత మాత్రమున...

సంపుటం -2- సంకీర్తన: 159
సంగీత కూర్పు : శ్రీ కడయనల్లూర్ ఆర్.వేంకటరామన్.
గానం : శ్రీమతి ఎం.ఎస్. సుబ్బులక్ష్మి
(టి.టి.డి.) హెచ్ యమ్ వి వారి "బాలాజీ పంచరత్నమాల"లో Vol.2.

ఎంత మాత్రమున నెవ్వరు దలచిన అంతమాత్రమే నీవు
అంతరాంతరము లెంచి చూడ పిండంతే నిప్పటి యన్నట్లు ॥

కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుడని
పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మంబనుచు
తలతురు మిము శైవులు తగిన భక్తులను శివుడనుచు
అలరి పొగడుదురు కాపాలికులు ఆది భైరవుఁడనుచు॥

సరినెన్నుదురు శాక్తేయులు శక్తి రూపు నీవనుచు
దరిశనములు మిము నానావిధులను
తలుపుల కొలదుల భజింతురు
సిరుల మిమ్మునే యల్పబుద్ధిఁ దలచిన వారికి నల్పంబవుదువు
గరిమల మిము నే ఘనమని తలచిన
ఘనబుద్ధులకు ఘనుడవు॥

నీ వలన కొరతే లేదు మరి నీరు కొలది తామెరవు
ఆవల భాగీరథి దరి బావుల ఆ జలమే వూరిన యట్లు
శ్రీవేంకటపతి నీవైతే మము చేకొనివున్న దైవమని
యీవల నే నీ శరణనియెదను యిదియే పరతత్త్వము నాకు॥

తాత్పర్యము :

(అన్నమయ్య సంకీర్తనలలో తలమానికమైన వాటిలో ఇదొకటి. బ్రహ్మమొక్కటే" అని వేదములు, ఉపనిషత్తులు నొక్కి చెప్పిన మాటను ("ఏకమేవాద్వితీయం బ్రహ్మ") అన్నమయ్య తన సంకీర్తనలలో చాలా చోట్ల స్పష్టంగా పొందుపరచారు. భగవద్గీతలో శ్రీకృష్ణుడు కూడా - "ఎవరు ఏవిధంగా నన్ను భావించి ఆరాధిస్తే ఆ విధంగానే నేను వారిని అనుగ్రహిస్తున్నాను" (గీత -అ.4 -శ్లో.11) అని చెప్పినదీ ఇదే. "ఎంతమాత్రమున" అనే ఈ సంకీర్తనను పైవాటికి వ్యాఖ్యానంగా భావించవచ్చు. ఒక్క మాటలో చెప్పాలంటే దారులు వేరైనా గమ్యం ఒక్కటే!)

ఓ శ్రీ వేంకటపతీ ! ఎవరు నిన్ను ఎంత మాత్రం భావించి ఆరాధిస్తే నువ్వు అంతమాత్రంగా అర్థం అవుతావు, అనుగ్రహిస్తావు. అదెలాగంటే పిండికొద్దీ రొట్టె కదా !

వైష్ణవులు నిన్ను విష్ణువుగా ప్రేమతో భావించి పూజిస్తారు. వేదాంతులు నిన్ను "పరబ్రహ్మం" అంటారు. శైవులు వారి భక్తితో తగిన విధంగా శివుడని భావించి నిన్ను సేవిస్తారు, కాపాలికులు నిన్ను ఆదిభైరవుడుగా ఆరాధిస్తారు.

శాక్తేయులు "శక్తి" రూపుడుగా నిన్ను పూజిస్తారు. వారి వారికి కలిగిన దరిశనముల (దర్శనభాగ్యం) ననుసరించి ఆయా భావాలతో నమ్మకాలతో నిన్ను సేవిస్తారు. సకల సంపదలకు (సిరులకు) ఆలవాలమైన నిన్ను అల్పబుద్ధితో భావించినవారికి అల్పంగానే గోచరిస్తావు. అలాకాక - ఎన్నరాని గొప్పతనం కలిగినవాడుగా నిన్ను గుర్తించిన వారికి అలాగే సాక్షాత్కరిస్తావు.

(దయాసముద్రుడవైన) నీవలన లోపం ఏముంది? "నీరు కొలది తామెర" వు నీవు. (భావించ లేనివారిదే దౌర్భాగ్యము). వారి వారి భక్తికి తగినంత ఫలమిచ్చేవాడవు. గంగానది ఒడ్డున బావి త్రవ్విన వారికి గంగాజలమే

లభించేది (అలాగే అన్ని భావాలకూ ఆలవాలమైన నిన్ను ఏ భావంతో ఆరాధిస్తే ఆ భావరూపమై గోచరిస్తావు.

ఓ శ్రీవేంకటపతీ! మమ్ములను చేకొని (రక్షింపబూని) వున్న దేవుడవు నీవే అని తెలిసి నిన్ను శరణు వేడుతున్నాను. నాకు ప్రాప్తించిన పరతత్త్వము ఇదే.

(లోకో భిన్నరుచి: అన్న నానుడి ప్రకారం ఎవరెవరి ఆరాధనా పద్ధతులు వారివి. ఈ సమన్వయదృష్టి లోపించిన సమాజం అధోగతి పాలవక తప్పదు)

| | | |
|---|---|---|
| అంతరాంతరములు | = | లోతుగా గమనించినపుడు కనిపించే భేదములు |
| దరిశనములు | = | చూచుట, శాస్త్రములు. |
| కూరిమి | = | ప్రేమ |
| సిరుల | = | సిరికి నాథుడవైన నీ విషయములో. |
| గరిమల | = | గొప్పదనముల |
| భాగీరథి | = | గంగానది |

**గాయకులకు (పాఠకులకు) సూచనలు**

ఈ పదాలు పలికేటప్పుడు ఇలా పలకాలి.

ఎంత = ఎన్‌త ॥ అంత = అన్‌త   అంతరాంతరము = అన్‌తరాన్‌తరము

లెంచి = లెన్‌చి   పిండంతే = పిణ్‌డన్‌తే

వేదాంతులు = వేదాన్‌తులు   బ్రహ్మం = బ్రహ్మరూప్

భజింతురు = భజిన్‌తురు   అల్పం = అల్పమ్   శ్రీ వేంకట = శ్రీ వేఙ్‌కట

1996వ సంవత్సరంలో శ్రీ నిమ్మగడ్డ రమేష్‌కుమార్, ఐ.ఏ.యస్. గారు టి.టి.డి ఎక్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వున్న రోజుల్లో - శ్రీ త్యాగరాజ పంచరత్న కృతులవలె అందరూ కలిసికట్టుగా గానం చేస్తూ పండిత పామరులందరినీ అలరించేందుకు ప్రత్యేకించి 7 అన్నమాచార్య సంకీర్తనలను ఎన్నుకొని, "సప్తగిరి సంకీర్తనలు" పేరుతో ప్రకటించారు. అప్పటినుండీ అవిచ్ఛిన్నంగా సాగుతున్న ఈ పాటల గుచ్ఛంలోని " ఎంత మాత్రమున" సంకీర్తన గానం చేస్తున్నప్పుడల్లా ఈ భావానికి పరవశించి తలలూపుతూ ఆనందబాష్పాలు రాల్చే భక్తులను చూస్తే అనిపిస్తుంది. - " అసలు శ్రీ వేంకటేశ్వర దివ్యతత్త్వాన్ని చాటి చెప్పటానికి కాని, అన్నమాచార్యుల వారికి ఆ వేంకటేశ్వర స్వామిపైన గల స్థిరమైన భావాన్ని తెలిసికొనటానికి సాక్ష్యం ఇంతకన్నా గొప్ప పాట ఏముంటుంది!" అని. అన్నమయ్య సంకీర్తన రత్నాకరంలో ఇది కోహినూర్ వజ్రంలాంటిదని నా అభిప్రాయం.

**నా అనుభవం**



నేను రాజమండ్రిలో ఉన్న ఆంధ్రప్రదేశ్ పేపరు మిల్లులో పనిచేస్తున్నాను. నా వయస్సు 53 సంవత్సరాలు. నాకు 30వ సంవత్సరం "సైనసైటిస్" వ్యాధి వచ్చింది. చాలా బాధపడ్డాను. ఒక్కోసారి అసలు ఊపిరి పీల్చటమే చాలా కష్టమయ్యేది. నోటితోనే గాలి పీల్చేవాడిని.

ఒకసారి నేను మా అక్కయ్యను చూద్దామనుకొని 'గోదావరిఖని' వెళ్ళి సుమారు వారం రోజులు ఉన్నాను. అక్కడ చలి బాగా ఎక్కువ. ఒకరోజు నాకు రాత్రి భోజనం చేసిన తర్వాత, 'సైనసైటిస్' ప్రాబ్లం బాగా ఎక్కువై ఊపిరి ఆడక చాలా బాధపడుతున్నాను. యింతలో మా బావగారు బయటనుండి వస్తూ ఒక క్యాసెట్టు టేపురికార్డులో పెట్టి ఆన్ చేసారు. మొట్టమొదటిసారి "అలరులు కురియగ ఆడెనదె" అన్న పాట తర్వాత "వినరో భాగ్యము విష్ణుకథా" అనే పాటలు వచ్చాయి. నేను ఆ పాటలు వింటూ ఉన్నాను. నా మనస్సు ఎక్కడో విహరిస్తున్నది. ఎంతో ఆనందిస్తున్నాను. మధ్యలో ఒక విషయం నేను గమనించాను. అంతవరకు ఊపిరి ఆడక బాధపడుతున్న నాకు ఆ ప్రాబ్లం పోయి ఎంతో హాయిగా ఊపిరి పీల్చుకొంటున్నాను. ఆ పాటలన్నీ విన్న తర్వాత మా బావగార్ని 'ఎవరివండీ ఈ పాటలు, పాడిందెవరు' అని అడిగాను. "ఇవి 'అన్నమయ్య పాటలు' పాడిందెవరో నాకూ తెలియదు. ఈ క్యాసెట్టు బజార్లో విని బాగున్నాయని కొన్నాను. ఇది మాస్టర్ క్యాసెట్టు కాదు. రికార్డు చేసినది. అందుచేత దీని మీద పాడిన వారి పేరు లేదు" అని అన్నారు. తర్వాత నేను రాజమండ్రికి వచ్చేసాను.

రాజమండ్రిలో నేను ఒకసారి మా మిత్రుని యింట్లో మరల పై క్యాసెట్టులోని పాటలు విన్నాను. అతని ద్వారా ఈ పాటలు "అన్నమాచార్య ప్రాజెక్టు" గాయకులు శ్రీ గరిమెళ్ళ బాలకృష్ణప్రసాద్ గారు గానం చేసినవని తెలిసింది.

అప్పటి నుండి బాలకృష్ణ ప్రసాద్ గారి పాటల క్యాసెట్లు వినటం మొదలుపెట్టాను. అంతే... నా జీవన విధానంలో ఎన్నో మార్పులు జరిగాయి. రోజూ శ్రీ గరిమెళ్ళ బాలకృష్ణప్రసాద్ గారి గానం వింటూ పాడుతూ తరిస్తున్నాను. ఈ రోజు నాకు 'సైనసైటిస్' ప్రాబ్లం పూర్తిగా పోయిందీ అంటే అది శ్రీ బాలకృష్ణప్రసాద్ గారి గానం వినటం వల్లే జరిగింది. ఇది నాకు మందుల వల్ల నయం కాలేదు. ఇప్పటికి సుమారు 20 సం॥ల నుండి నాకు 'సైనసైటిస్' ప్రాబ్లం రాలేదు. ఇది ముమ్మాటికి నిజం. మీరు నమ్మొచ్చు, నమ్మలేకపోవచ్చు. మా ఇంట ఏ పని ప్రారంభించినా ఆయన గానంతోనే ప్రారంభిస్తాము. 'మ్యూజిక్ థెరఫీ'తో వ్యాధులు నయమౌతాయని విన్నాం. ఇది నా విషయంలో సత్యం.

**- ఉండవల్లి రాజమోహన్**, రాజమండ్రి

'అన్నమయ్య పదభావదర్శనమ్' శీర్షికకు పేరుని సూచించిన పాఠకులకు సంబంధించిన తియ్యటి కబురు 22వ పేజీలో...



"నేను వారానికి ఒకసారి గుడికి వెళ్తా! మరి నువ్వు!?"

"నేను 3నెలలకి ఒకసారి మాత్రమే వెళ్తా...."

"ఏం ప్రతివారం వెళ్ళొచ్చు కదా...?"

"పోరా... ఎంత చెత్త చెప్పులైనా వారంలో అరిగిపోతాయా ఏంటీ?"



"నా కురులతో నీ ముఖాన్ని నేను కప్పేస్తుంటే నీకు ఏమనిపిస్తుంది డియర్?"

"నీ తల్లో వున్న పేలు నాతల్లోకి ఎక్కుతాయేమో అని భయంగా ఉంది డార్లింగ్".

**ఈ జోకులను పంపించిన వారు: పి.శ్రీనివాసరాజుకుమార్, నాగార్జునసాగర్**



"జీవితంలో ఎన్నో సాధించాలను కున్నాను, కానీ ఏమీ సాధించలేక పోయాను".

"డోంట్ వర్రీ! తొందరగా పెళ్లి చేసుకో, జీవితాంతం మొగుడ్ని సాధిస్తూ హాయిగా గడిపెయ్యవచ్చు"



"కాలికి ముల్లు గుచ్చుకుందండీ" చెప్పింది భార్య.

"చిన్న ముల్లా ? పెద్దా ముల్లా?" ఠక్కున అడిగాడు భర్త (అన్నట్టు ఆయన వాచ్ మెకానిక్‌లెండి).



"ఏంటీ! నిన్ను డిబార్ చేశారా! ఎందుకురా?"

"మీ వల్లే నాన్నా"

"ఏంటీ నా వల్లా?"

"ఔను నాన్నా! మీరే కద చెప్పారు, ఏ పని చేసినా ముందూ, వెనకా చూసుకొని చెయ్యాలి అని, ఎగ్జామ్ హాల్లో పేపర్ రాస్తూ నేను అలాగే చేస్తే డిబార్ చేసి పంపేసారు".



"ఎలాంటి చీర చూపించాలి మేడం?"

"మా పక్కింటావిడకి కంటి మీద కునుకు రానివ్వని చీర చూపించు".



"కడుపులో తిప్పినట్లుగా ఉందండీ"

"చెంచాతో తిప్పినట్లుగా ఉందా? గరిటెతో తిప్పినట్లుగా ఉందా?" అంటూ అనుమానం వ్యక్తం చేసాడు వంట గదిలోంచి బయటకు వచ్చిన భర్త.



"భార్యా విధేయుడికి, భార్యా బాధితుడికి ఏమిటి తేడా?"

"చెప్పకముందే పనులన్నీ చేసి భార్య మెప్పు పొందేవాడు భార్యా విధేయుడు. చెప్పాకే పనులు చేస్తూ ఒకసారి చివాట్లు కూడా తినేవాడు భార్యా బాధితుడు."

**ఈ జోకులను పంపించిన వారు: యల్.శ్రీనివాస్ రెడ్డి, సికింద్రాబాద్.**

"మీరు దీర్ఘాయుష్షుతో ఉండాలంటే నేను ఏ వ్రతం చేయాలంటారు?"

"మౌన వ్రతం."





"దానవుడు అని ఎవరిని అంటారా?"

" దానం చేసేవాడిని సార్!"

**ఈ జోకులను పంపించిన వారు: ఎం.డి. ముస్తఖీమ్,కొల్లాపూర్.**



"అదేంటండీ... స్త్రీలు కూర్చున్న చోట నో స్మోకింగ్ అని వ్రాయించారు!?" అడిగింది ఓ అమ్మాయి బస్‌కండక్టర్‌ని .
"అందరూ చూసేది ఇటువైపే కదా మేడమ్.." చెప్పాడు కండక్టర్ ఠక్కున .



"ఏంటి వదినా ! అన్నయ్యగారికి ఏదైనా యాక్సిడెంట్ జరిగిందా... ఒళ్లంతా ఆ కట్లేమిటి?"
" అదేం లేదు వదినా! నాకూ, మా వారికీ అప్పుడప్పుడు ఏవో పట్టింపులొస్తూనే ఉంటాయి. నీకు తెలుసు కదా ఆయన ముందు నేను నోరు తెరిచి మాట్లాడేదాన్ని కాదని... అందుకనీ...."



బార్ నుండి తూలుకుంటూ బయటకి వస్తూ పడ బోయిన శేఖర్‌ని తెల్లటి యూనిఫామ్‌లో నున్న ఒకతను పట్టు కున్నాడు.
"ఏయ్ వాచ్‌మేన్ నాకో ఆటో పిలువ్" అన్నాడు శేఖర్.
"నేను వాచ్‌మెన్ ని కాదు.. నేవల్ ఆఫీసర్‌ని" అన్నాడా తెల్లటి యూనిఫాం ఆయన.
"సరే అయితే ! ఒక బోట్‌ని పిలువ్" అన్నాడు శేఖర్ నిర్మోహమాటంగా.



భర్త : నీకు నాకంటే ఆ పట్టు చీరలే ఎక్కువా!
భార్య: అవును! వాటిని ఎప్పుడు కావాలంటే అప్పుడు మార్చుకోవచ్చు.



"అదేంట్రా కవిసమ్మేళనం స్టేజ్ డెకరేషన్‌కి, ఇన్విటేషన్లకీ 5 వేలే ఖర్చయితే 15 వేలు అడుగుతున్నావెందుకు?"
"భలేవాడివే.. ఇల్లాంటి వాటికి ప్రేక్షకులు ఫ్రీగా వస్తారనుకున్నావా!?"

**ఈ జోకులను పంపించిన వారు: యం.డి. కైసర్ వజీద్,ఆదిలాబాద్.**



ఓ ఋషి పుంగవుడు దేవుడి కోసం తపస్సు చేశాడు. దేవుడు ప్రత్యక్షమయి వరం కోరుకోమన్నాడు.
"స్వామీ నాకు తలనిండా జుట్టు ఇవ్వండి"
"ఇంతకాలం తపస్సు చేసి ఇలాంటి కోరిక కోరావేంటి నాయనా" అని అడిగాడు దేవుడు అదిరిపోయి.
"జుట్టు లేకపోవడం నుంచే మీ కన్నా ముందు రావల్సిన రంభ, ఊర్వశి, మేనకలు రాలేదని అనుకుంటున్నాను స్వామీ" అన్నాడు ఋషిపుంగవుడు.
రెండోసారి అదిరిపడ్డాడు దేవుడు.



"చట్టాన్ని తన చేతుల్లోకి తీసుకున్న వాడ్ని విడిచి పెట్టకండి, పట్టుకోండి" అంటూ పరిగెడుతున్న ఓ కేడీగాడి కోసం ఇద్దరు కానిస్టేబుల్స్‌ని పంపించాడు ఇన్‌స్పెక్టర్.
పదినిమిషాల తర్వాత ఆయాస పడుతూ వచ్చి
"సార్ వాడ్ని పట్టుకొని చూసాం. పాపం వాడి చేతిలో చట్టం లేద్సార్... అందుకే విడిచిపెట్టేశాం"అన్నారా ఇద్దరు కానిస్టేబుల్స్.

**ఈ జోకులను పంపించిన వారు: బల్లా విజయకుమార్, విశాఖపట్నం.**

**ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన పి.శ్రీనివాస్‌రాజు కుమార్- నాగార్జునసాగర్, ఎం.డి.ముస్తఖీమ్- కొల్లాపూర్, యల్.శ్రీనివాస్‌రెడ్డి- సికింద్రాబాద్, బల్లా విజయకుమార్- విశాఖపట్నం, యం.డి. కైసర్ వజీద్-ఆదిలాబాద్ గార్లకు సోహన్ మ్యూజిక్ వారు "సామ్రాట్ రీమిక్స్" ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.**

SOHAN MUSIC



తెలుగు సినిమా నేపథ్య గాయనీమణుల జీవిత చిత్రాలు తెలిపే

# కొమ్మా కొమ్మా కోకిలమ్మా 16



- ఇంద్రగంటి జానకీబాల

సాధారణంగా దక్షిణాది సినిమాలలో నేపథ్య గాయనులుగా వెలుగొందిన వారందరూ తెలుగు, తమిళ, కన్నడ,మలయాళం భాషలలో విరివిగా పాడి పేరుప్రఖ్యాతులు గడించడం వుంది. అప్పుడప్పుడు ఒకరో, ఇద్దరో బొంబాయి పరిశ్రమలోకి వెళ్ళి ఒకటో అరో పాటలు పాడింది కూడా వుంది.

అవి కూడా తెలుగు, తమిళ చిత్రాలను దక్షిణాది నిర్మాతలు అక్కడ హిందీలో, పునర్నిర్మించినప్పుడు దక్షిణాది గాయకులను గాయనులను పాడించిన సందర్భాలున్నాయి. ఆ విధంగా అందరూ పాడారు. వారా పాటల వరకే పరిమితంగా వున్నారు గానీ విశేషించి హిందీ సినిమా ఫీల్డ్‌లో నేపథ్య గాయనులుగా పేరు సంపాదించినవారు లేరు.

దీనికి భిన్నంగా వాణీజయరాం మొదట బొంబాయిలో, హిందీ పరిశ్రమలో పాడి, గొప్ప ఖ్యాతి సంపాదించుకుని, దక్షిణాదికి వచ్చిన ఏకైక గాయని.

వాణీజయరాం మంచి సంగీతసంప్రదాయం గల కుటుంబంలో పుట్టారు. మద్రాసుకి ఎనభై కిలోమీటర్ల దూరంలో వున్న వెల్లూరులో పుట్టి బాల్యం అక్కడే గడిపారు. ఆమె తల్లిగారు పద్మావతి చాలా చక్కని గాయకురాలు. ఆమె రామానుజ అయ్యంగార్ అనే గొప్ప సంగీత విద్వాంసుల దగ్గర సంగీతం నేర్చుకున్నారు. వాణీజయరాం అక్కచెల్లెళ్ళు ఆరుగురూ పాడతారు. పద్మావతి తన పిల్లలనందర్నీ సంగీతపరంగా ఎంతో ప్రోత్సహించి వారు సంగీతం నేర్చుకునేందుకు దోహదం చేశారు. వాణీ జయరాం కడలూరు శ్రీనివాసయ్యంగార్ దగ్గర సంగీతం నేర్చుకున్నారు. అందులో ఎంతో కష్టపడి నేర్చుకోవాల్సిన ముత్తుస్వామి దీక్షితుల వారి కీర్తనలన్నీ అక్కడే నేర్చుకున్నారు.

## అరుదైన సొంత బాణీ



## వాణీజయరాం

"మా గురువుగారు నాకు సరళీ స్వరాలు, జంట వరసలు చెప్పలేదు. నాకు మొదలు పెట్టిందే దీక్షితర్ కృతులతో'' అంటారు వాణీజయరాం.

ఆరో క్లాసు వరకు వెల్లూరులో చదువుకున్నాక, పిల్లల సంగీతం కోసమే అని తల్లి పద్మావతి మద్రాసుకి మకాం మార్చాలని సంకల్పించారు. తండ్రిగారైన దొరస్వామి అయ్యంగార్ దానికి అనుగుణంగా మద్రాసు మకాం మర్చారు. అక్కడ స్కూల్లో చేరాక వాణీజయరాం ఇరవై రెండు రకాల యాక్టివిటీస్‌లో పాల్గొని అన్నిటా ముందు వుండి, అందరి మెప్పు పొందారు. అందులో సంగీతం, డ్రాయింగ్, సాహిత్యం కూడా వున్నాయి. ఎన్నో బహుమతులు సంపాదించుకున్నారు.

క్వీన్ మేరీస్ కాలేజ్ నుండి ఎకనామిక్స్ బి.ఏ. డిగ్రీ పొంది భారతీయ స్టేట్ బ్యాంక్‌లో ఉద్యోగం సంపాదించుకున్నారు. కొన్నాళ్ళు మద్రాసులో కొన్నాళ్ళు సికింద్రాబాద్‌లో పనిచేశారు.

"నేను హైద్రాబాద్ ఎస్.బి.ఐ. రీజనల్ ఆఫీసులో పని చేస్తున్నప్పుడు తెలుగు కాస్త నేర్చుకున్నాను. తెలుగు చాలా అందమైన భాష. నేనక్కడ నేర్చుకున్నదే నేను తెలుగు సినిమాల్లో పాడాల్సి వచ్చినప్పుడు ఎంతో ఉపయోగపడింది'' అంటారామె.

1968లో జయరాంతో వివాహం అయ్యాక ఆయనతో కలిసి బొంబాయి వెళ్ళారు. జయరాంగారు సంగీతాభిమాని కావడం చేత, ఆమెను హిందూస్తానీ కూడా నేర్చుకోమని ప్రోత్సహించారు. అంతేకాదు ఆయనే

హిందూస్తానీ లైట్ క్లాసికల్ నేర్చుకునేందుకు పాటియాలా ఘరానాకి చెందిన ఉస్తాద్ అబ్దుల్ రెహమాన్‌గారి దగ్గరికి తీసుకెళ్ళారు. ఆయన వాణీజయరాంకి రోజుకి పద్దెనిమిది గంటలు పాఠం చెప్తూ, పాడిస్తూ, సాధన చేయించేవారట. అప్పుడామె ఠుమ్రీలు, భజన్లు, గజల్స్ పాడటంలో నైపుణ్యం సంపాదించుకున్నారు.

"అమ్మా! నువ్వు కాస్సేపు సాధనచేసి, ఆఫీసుకెళ్ళి సాయంత్రం వచ్చి పాడటం కుదరదు. నువ్వు నీ సమయం పూర్తిగా సంగీతానికే అంకితం చెయ్యాలి. నీ ఉద్యోగానికి రిజైన్ చేసేయ్" అని ఉస్తాద్ అబ్దుల్ రెహమాన్ అన్నారుట. అప్పుడామె పూర్తిస్థాయిలో పాటకే అంకితమైపోవడానికి ఉద్యోగానికి రాజీనామా చేశారు.

"మా గురువుగారి ద్వారా నేను వసంత దేశాయ్‌గారి దగ్గర నా పాట పాడి వినిపించాను. అప్పుడు 'గుడ్డీ' సినిమా తీసేందుకు ప్లాన్ చేస్తున్నారు. కొత్త అమ్మాయి జయబాధురిని పరిచయం చేస్తున్నందువల్ల కొత్తగొంతుగా నన్ను హృషికేష్ ముఖర్జీగారు, గుల్జార్ కలిసి ఎంపిక చేశారు. నా మొదటి సినిమా పాట రికార్డింగ్ 22.12.1970న జరిగింది" అంటారు వాణీజయరాం.

'గుడ్డీ'లో మూడు పాటలు పాడి, దేశమంతా ఖ్యాతి సంపాదించారామె. ఆమె పాడిన 'బోల్‌రే పపీహరా' పాట తాన్‌సేన్ అవార్డుతో సహా అయిదు అవార్డులను సంపాదించి పెట్టిందామెకు.

ఆ తర్వాత ఆమె నౌషాద్, మదన్ మోహన్ ఓ.పి. నయ్యర్ , ఆర్.డి. బర్మన్, కళ్యాణ్‌జీ -ఆనంద్‌జీ, లక్ష్మీకాంత్ -ప్యారేలాల్ మొదలైన సంగీత దర్శకులకు పాటలు పాడారు.

తెలుగు సినిమా పాట పాడేందుకు ఆమెకు అవకాశం ఎస్.పి. కోదండపాణిగారు కల్పించారు. అది 1973లో విడుదలైన 'అభిమానవంతులు' అనే సినిమా. ఆ సినిమాలోని పాట బాగా పాప్యులర్ అయి, వాణీజయరాం పేరు తెలుగు తెరకు పరిచయమైంది.

ఆ తర్వాత 'పూజ, 'నోము', 'మరోచరిత్ర', 'ప్రేమ-పగ', 'అక్బర్ - సలీం - అనార్కలి', మొదలైన చిత్రాల ద్వారా చాలా పాటలు పాడారు.

'పూజలు సేయ పూలు తెచ్చాను'

'ఎన్నెన్నో జన్మల బంధం నీది నాది'

'విధిచేయు వింతలన్నీ'- లాంటి పాటలు జనంలో ఎంతో ఆదరణ పొందాయి.

1980లో 'శంకరాభరణం' సినిమా ద్వారా వాణీజయరాం తెలుగు వారికి మరీ చేరువయ్యారు.

'బ్రోచేవారెవరురా...'

'ఏ తీరుగ నను దయచూచెదవో'

'మానస సంచరరే'-లాంటి శాస్త్రీయ సంగీత బాణీల ద్వారా ఆమె జాతీయ బహుమతులను గెలుచుకున్నారు.

'శ్రుతిలయలు', 'స్వాతికిరణం'లాంటి సంగీతపరమైన సినిమాలుగా పేర్కొన్నవాటిలో ఆమెకు మరీ పేరొచ్చింది.

ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఆమెను సత్కరించింది. అలాగే గుజరాత్, ఒరిస్సా, తమిళనాడూ ఆమెకు ఉత్తమ నేపథ్యగాయనిగా సత్కారాలు చేశాయి.

వాణీజయరాం బాలీవుడ్ సినిమా నేపథ్యగానం నుండి త్వరగానే పక్కకెళ్ళిపోయారు. బొంబాయి లాంటి పరిశ్రమలో ఎన్నోరకాల రాజకీయాలు వెనుకగా పనిచేస్తూ వుంటాయి. వాటితో పోరాడి, గెలుచుకురావడం ఒక్కొక్కసారి కష్టసాధ్యమే అవుతుంది. కీర్తికి, డబ్బుకీ సంబంధించిన సినిమా పరిశ్రమలో ఎంతటి దుర్మార్గమైన స్వార్థపరులూ వుంటారన్నది అందరికి తెలుసున్నదే.

పధ్నాలుగు భాషల్లో సుమారు ఎనిమిదివేలు (8000) సినిమా పాటలు పాడిన వాణీజయరాం, సంగీత కార్యక్రమాలు చేస్తూ , యు.కె., యుఎస్ఏ, మలేషియా, సింగపూర్, శ్రీలంక, యు.ఏ.ఇ, జర్మనీ, ఫ్రాన్స్ లాంటి ఎన్నో దేశాలు తిరిగారు. అక్కడంతా ఎంతో పేరు సంపాదించుకున్నారు.

మరాఠీలో 'అభంగాలు' ఒరిస్సా పద్ధతిలో క్యాసెట్లు ఇచ్చారు. ఠుమ్రీలు, దాద్రా భజన్లు , హోలీ సాంగ్స్, క్యాసెట్లుగా విడుదల చేశారు.

పండిట్ రవిశంకర్ సంగీత దర్శకత్వంలో ఆమె పాడిన 'మీరా' లో మీరా భజన్లు ఎంతో ప్రచారం పొందాయి.

ఆమె భజన్ గాయకురాలుగా ప్రత్యేకమైన గుర్తింపు పొందారు. తులసీదాస్, కబీర్, సూర్‌దాస్, మీరా, జయదేవ్, తుకారం మొదలైన వారి భక్తిగీతాలు పాడుతూ, కచ్చేరీలు చేస్తున్నారు.

ఆమె చాలా చక్కగా చదువుకున్న యువతి. సంగీతం పట్లనే కాకుండా, సమాజం పట్ల, మనుషులు పట్ల, ఎంతో మంచి అవగాహన గల వ్యక్తి. తమిళంలో, హిందీలో కవితలు, పాటలు రాస్తారు. బొమ్మలు వేస్తారు. పాటలు తమిళంలో, హిందీలో స్వయంగా రాసుకుని కంపోజ్ చేసుకుని పాడతారు.

"రాజకీయాలలో సంగీతమంటూ వుండదు గానీ సంగీతం జీవితంగా భావించినప్పుడు ఎన్నో రాజకీయాలుంటాయి".

"నాకు వసంత దేశాయ్‌గారు ఎప్పుడూ చెప్పేవారు. పనిలో చిన్నపని, పెద్దపనీ అనేమీ వుండవు. పని పనే. భగవంతుని మీద భారం వేసి, మనపని మనం చిత్తశుద్ధితో చెయ్యాలి. ఎదుటి వారి పనిని లాక్కోవడం చాలా సిగ్గుపడవలసిన విషయం" అంటారామె ఎంతో గంభీరంగా.

"ప్రతిభ వున్న ప్రతిఒక్కరికీ అవకాశం రావాలి. వారికి అవకాశం యివ్వాలి. అదేవిధంగా, కొంచెం ప్రతిభ వున్న వారికి ఎక్కువ ప్రచారమివ్వడమూ తగదు" అంటారు వాణీజయరాం.

"నేను తమిళం, కన్నడం, మలయాళం ఎక్కువ పాడాను. తెలుగులో తక్కువే పాడాను. నేనుపాడిన ప్రతీపాటా ఎంతో పాప్యులర్ అయినప్పటికీ, మళ్ళీ నాకు అవకాశాలు వచ్చేవి కావు. కానీ ఏం పట్టించుకోను. నేను తరచూ కార్యక్రమాలకి వెళ్తూ ఎప్పుడూ బిజీగానే వుంటున్నాను".

"బానీ మ్యూజిక్ కంపెనీ అని మాకు స్టూడియో వుంది. మంచి భక్తి క్యాసెట్లు తీసుకొచ్చాము. ఇంకా తీసుకొస్తున్నాం. నేను భక్తి పరమైన పాటలు పాడటంలో ఎంతో ఆనందాన్ని పొందుతాను" అన్నారామె ఎంతో నిండుగా.

తెలుగు నేపథ్యగానంలో వాణీజయరాంకి మంచి స్థానం వుంది. ■

**రచన: వేటూరి సుందరరామమూర్తి** | **చిత్రం: శంకరాభరణం**

**సంగీతం: కె.వి.మహదేవన్** | **గానం: వాణీజయరాం, ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం**

దొరకునా ఇటువంటిసేవా!
నీపద రాజీవముల చేరు నిర్వాణ సోపాన
మధిరోహణము సేయు త్రోవ ॥దొరకునా॥
రాగాలనంతాలు నీ వేయి రూపాలు
భవరోగ తిమిరాల పోకార్చు దీపాలు
నాదాత్ముకుడవై నాలోన చెలగీ
నా ప్రాణ దీపమై నాలోన వెలిగే
నిను కొలుచువేళ- దేవాదిదేవా - దేవాదిదేవా ॥దొరకునా॥
ఉచ్ఛ్వాస నిశ్వాసములు వాయులీనాలు
సంధించు నవనాడులే వీణాగానాలు
నడలూ - యెదలోని సడులే మృదంగాలూ
నాలోని జీవమై -నాకున్న దైవమై
వెలుగొందు వేళ - మహానుభావా - మహానుభావా ॥దొరకునా॥

కాశీనాథుని విశ్వనాథ్‌గారి చిత్రమంటే అందులో సంగీతానికి ప్రాధాన్యత వుంటుందన్న విషయం జగమెరిగిన సత్యం. 'స్వరాభిషేకం' చిత్రంలో కూడా చక్కని సంగీతానికి అవకాశాన్నిచ్చారాయన.

ఈ చిత్రం యొక్క ఆడియో క్యాసెట్ 'ఎ' సైడ్ సామవేదం షణ్ముఖ శర్మ విరచితమైన సంస్కృత శ్లోకం 'శ్రీమన్మనోహర సురాగిణి దివ్యమూర్తే.. శ్రీరాగ సేవ్య చరణే తన సుప్రభాతమ్'తో ప్రారంభ మవుతుంది. శ్రీ వేంకటేశ్వర సుప్రభాతమ్‌ను తిరుమలలో అర్చకులు పఠించే విధంగా యీ సుప్రభాత శ్లోకాన్ని కూడా ఆ సంప్రదాయంలోనే (ఆరభిరాగ స్వరాలు ఆధారంగా)గాయనీ గాయకులు మధు బాలకృష్ణన్, శ్రీరాంపార్థసారథి, చిత్ర గానం చేశారు.

తరువాత 'కస్తూరీ తిలకం లలాట ఫలకే', అనే శ్లోకాన్ని శంకర్ మహదేవన్ ప్రారంభించి 'కరతలే వేణుం' అన్న పదాల వరకూ పాడగా ఆ తరువాత 'వేణుగాన సమ్మోహనం' అనే వేటూరి సుందరరామ్మూర్తిగారి గీతం ప్రారంభమవుతుంది. ఈ పాటలో శ్రీకృష్ణుని లీలలు గొల్లపల్లెల్లోని గొల్లవారి మనసుల్లోంచి వేదమంతా వెన్నలా కరిగి ప్రవహించినట్లు జాలువారాయి. శంకరాభరణ రాగంలోని స్వరాలతో పాటు, కైశికి నిషాదాన్ని కూడా వాడుకుని జానపద శైలిలో అందమైన బాణీని కూర్చారు స్వరకర్త విద్యాసాగర్. పాటలో 'కృష్ణా ముకుందా మురారి' అంటూ ప్రారంభమయ్యే చరణానికి ధర్మవతి రాగ స్వరాలను (హిందూస్తానీ లోని 'మధువంతి' రాగం వలె కూడా ధ్వనించేట్టు) వినియోగించారు. శంకర్ మహదేవన్, సుజాత బృందం చక్కని సంగతులతో మనోజ్ఞంగా పాడారు. 'ఒక్కక్షణం' అంటూ సాకీతో ఆరంభమై 'అమ్మ కడుపు చల్లగా.. అయ్య కలలు పండగా' అనే పాటను వేటూరి రాశారు. రామాయణ, భాగవతాలలోని ఘట్టాలను రసవత్తరంగా చిత్రించారు ఈ గేయంలో కవి. బాలు, శైలజ ఎంతో భావయుక్తంగా గానం చేశారు. కొంత జైజైవంతి వలె, కొంత కాపీ రాగచ్ఛాయతోను, స్వరం మోహన రాగంలోను సాగి, పాట చివరలో 'జో అచ్యుతానంద జోజో ముకుందా' అనే లాలిపాటతో (నీలాంబరి రాగం )ముగుస్తుంది.

ఆ తరువాత పాట 'ఇది నాదని -అది నీదని' అంటూ సాగే వేటూరి వారి మరొక రచన. 'వెన్నెలమ్మరాతిరిదా వేకువమ్మ పొద్దుటిదా కోకిలమ్మ ఆమనిదా' అంటూ సున్నితంగా సుకుమారంగా ఆవిష్కరించబడిన ప్రణయ భావన. బాలు, చిత్ర ల గళాలలో కమనీయంగా రవళించింది యీ గీతం. లలిత సంగీతంలో బాణీని కూర్చేటప్పుడు ఏదో ఒక రాగానికి కట్టుబడాలనే నియమం లేదు. భావప్రకటనే ముఖ్య పాత్రవహిస్తుంది. అందుకని




విడుదల : ఆదిత్యామ్యూజిక్
వెల : రూ॥ 38/-

భావరసాలను పోషించడానికి వివిధ స్వరాల సుమహారంగా బాణీ కూర్చడం ఒక పద్ధతి. ఆ కోవకు చెందినదే యీ గీతం.

'నీ చెంతే ఒక చెంచిత ఉంటే వెన్నెల్లో వేట అది. నీ వెంటే ఒక చంద్రిక ఉంటే పున్నమితో పాట అది' అంటూ పలకగలిగినది సిరివెన్నెల మాటే గదా. సున్నితమైన భావాలతో సాగే ఈ పాటకు శివరంజని రాగానికి కైశికి నిషాదం కలుపుకుని చక్కని ట్యూన్‌ని రూపొందించారు విద్యాసాగర్. సనిదపమగరిస- రిగమగపా అని స్వరాలు వాడడంలో 'కర్ణరంజని' రాగచ్ఛాయ కూడా ధ్వనించేటట్లు చేశారు స్వరకర్త విద్యాసాగర్. మనో, చిత్ర యీ గీతాన్ని మధురంగా గానం చేశారు.

'బి'సైడ్ 'కుడి కన్ను అదిరెనే' అనే సంప్రదాయ గీతంతో మొదలవుతుంది. భాగేశ్వరి రాగం ఆధారంగా యీ పాటకు కూర్చిన సురుచిరమైన బాణీ బాలు, సునీతల గళాలలో రసవత్తరంగా సాగింది. 'సమానమెవ్వరు నీకిల' అన్న వచనం బిలహరి రాగంలో మనో పాడారు. తరువాత 'రమా వినోది వల్లభా' అనే గీతం ప్రారంభమవుతుంది. ఈ గీతానికి గౌళ రాగంలో చక్కని చిక్కని శాస్త్రీయ సంగీత శైలిలో బాణీ కూర్చారు విద్యాసాగర్. శ్రీరాం పార్థసారథి, మధుబాలకృష్ణన్, చిత్ర అద్భుతంగా పాడారు. మధ్యలో ఇంటర్లూడ్‌లో 'దుడుకుగలనన్నే దొర కొడుకు బ్రోచురా' అనే త్యాగరాజస్వామి విరచిత గౌళరాగ పంచరత్న కీర్తనలోని పల్లవిని కూడా వాడుకున్నారు.ఈ గేయంలో సామవేదం వారి కలం భక్తి తరంగమై ఉవ్వెత్తున ఎగిసింది. త్యాగరాజు రచించిన దివ్యనామ సంకీర్తన - "శ్రీరామ జయరామ శృంగార రామయని.. కౌసల్య మును తపమేమి చేసేనో తెలియ" అంటూ సాగే ఈ కీర్తనను ప్రేరణగా తీసుకుని రామలక్ష్మణుల వంటి అన్నదమ్ముల మధ్య నెలకొన్న ఆత్మీయత, అనురాగాలను ఎంతో హృద్యంగా వేటూరి "అనుజుడై లక్ష్మణుడు" అనే గీతంలో వర్ణించారు. కళ్యాణి రాగంలో శాస్త్రీయ సంగీత పద్ధతిలో చక్కని స్వర కల్పనతో సాగిన యీ గీతాన్ని ఏసుదాస్, బాలు సమర్థవంతంగా గానం చేశారు. ఈ రెండు గీతాలు పండితులను సైతం ఆకట్టు కుంటాయి.

చివరగా 'మంగళం రాగ రాగిణ్యై' అంటూ సామవేదం షణ్ముఖ శర్మ వెలయించిన మంగళంతో క్యాసెట్ పరిసమాప్తమవుతుంది. మొత్తం మీద క్యాసెట్‌లో సాహితీ శిఖరాగ్రవర్తులైన ముగ్గురు మూర్తులు వేటూరి, సిరివెన్నెల, సామవేదం రచించిన రసగుళికలు శ్రోతృజన శ్రవణానందకరాలు. సముచితమైన సంగీత సుధారఝరులతో వీనుల విందొనరించిన స్వరకర్త విద్యాసాగర్ కడు అభినందనీయులు.

రస విహీనమైన రొటీన్ మ్యూజిక్ నుండి మంచి రిలీఫ్‌ను, మనసుకు అత్యంతానందాన్ని కలిగించే యీ చక్కని గీతాలన్నీ సరస్వతీదేవికి 'స్వరాభిషేకం' చేశాయని చెప్పక తప్పదు.

**- ఎం. చిత్తరంజన్**

**'అన్నమయ్య పదభావదర్శనమ్'**

శీర్షికకు పేరుని సూచించిన పాఠకులలో ఇద్దరికి ఆదిత్యా మ్యూజిక్ వారు రెండు అన్నమయ్య సీడీలనిస్తారని గతంలో ప్రకటించాం. ఈలోగా ఆ శీర్షికను నిర్వహిస్తున్న శ్రీ జి.బాలకృష్ణప్రసాద్ తన వంతుగా అన్నమయ్య సీడీలను మరో నాలుగిటిని పంపారు. శీర్షికకు వస్తున్న స్పందనను చూసి ఆదిత్యా మ్యూజిక్ వారు ఇంకో మూడు సీడీలను ప్రకటించారు. "ఆ పేరుని సూచించిన పాఠకులు 13 మంది ఉన్నారు కనుక మరొక నాలుగు సీడీలను కూడా ఇవ్వగలరా?" అని పాఠకుల తరఫున 'హాసం' అడిగింది. ఆ ప్రతిపాదనకు కూడా ఎంతో సంస్కారంతో ఆదిత్యా మ్యూజిక్ సంస్థ వారు అంగీకరించి తమ వంతు సీడీలు మొత్తం తొమ్మిదిటినీ ఇవ్వడం జరిగింది. ఈ సంచిక మార్కెట్లో వెలువడే నాటికి ఆ 13 మంది పాఠకులకూ బాలకృష్ణ ప్రసాద్ గానం చేసిన అన్నమయ్య సీడీలను పంపటం జరుగుతుంది.

**- ఎడిటర్**

# జధ్యా మారుత (11)

## 'నవ్వుకుందాం రా'
(అంటూ ప్రేక్షకుల్ని ఆహ్వానించిన)

# జయమ్ము నిశ్చయమ్మురా!






ప్రేమ పెళ్ళిళ్ళే గొప్పవనే అబ్బాయి, పెద్దలు కుదిర్చిన సంబంధమే అన్ని విధాలా బెటరనుకునే అమ్మాయికి మధ్య సాగిన ఓ స్వీట్ ఛాలెంజ్ ఈ 'జయమ్ము నిశ్చయమ్మురా' సినిమా.

జంధ్యాల దర్శకత్వంలో రాజేంద్రప్రసాద్‌కిది ఐదవ చిత్రం. బాబాయ్ అబ్బాయ్, రెండు రెళ్ళు ఆరు, అహనాపెళ్ళంట, వివాహభోజనంబు చిత్రాల్లో నటించిన రాజేంద్రప్రసాద్, జంధ్యాల సినిమా అంటే చాలు ఎంతో హుషారుపడిపోయే వారు.

ఈ సినిమాలో రాజేంద్రప్రసాద్‌ది ఎంతో హుషారైన పాత్ర. పేరు రాంబాబు. తన ప్రేమను పండించుకుని ప్రేయసిని దక్కించుకోవడం కోసం ఎంతో పట్టుదలతో, కార్యదీక్షతో, ఉపాయంతో, పెద్దల మన్ననలతో తాననుకున్నది సాధిస్తాడు.

ఒక రకంగా ఇది వన్‌సైడ్ లవ్‌స్టోరీ. ఇటు రాజేంద్రప్రసాద్ ప్రేమా... ప్రేమా... అని ఎగబడటమేగానీ, అటు సుమలత నుంచి ఎటువంటి ప్రతిస్పందనా వుండదు. సరికదా 'నేను ప్రేమను నమ్మను. అమ్మానాన్న కుదిర్చిన సంబంధమైతేనే అన్ని విధాలా మంచిది. అదే నాకు సమ్మతం' అని మొండికేస్తుంది.

సుమలత అభిప్రాయం తప్పని, తన వుద్దేశ్యమే ఒప్పు అని నిరూపించుకోవడానికి రాజేంద్రప్రసాద్ కంకణం కట్టుకుంటాడు. సుమలత తల్లితండ్రుల్ని బుట్టలో వేసుకోవడం కోసం నానా వేషాలు వేస్తాడు, నానా తిప్పలు పడతాడు. సుమలత తండ్రి నాస్తికుడు కాబట్టి తన పేరు రామ్ -బాబు (అంటే రాముడికి బాబు అన్నమాట) అని చెబుతాడు. సుమలత తల్లి మహాభక్తురాలు కావడంతో వెంటనే ప్లేటు ఫిరాయించి తన పేరుని 'రాంబాబు' (అంటే రాముడికి కొడుకు అన్నమాట)అని వినయంగా చెబుతాడు. అలాగే తన తండ్రి చేత కూడా నాటకం ఆడించి, తండ్రికి తగ్గ కొడుకనిపించుకుంటాడు. అమాయకుడిగా, గడుగ్గాయిగా, పట్టుదల గలవాడిగా, స్వచ్ఛమైన ప్రేమికుడిగా డిఫరెంట్ షేడ్స్‌లో తన నటనలో సహజత్వాన్ని కనబరిచారు రాజేంద్రప్రసాద్.

ఇక చంద్రమోహన్‌ది రాజేంద్రప్రసాద్ చేసే

ఫస్ట్ మీటింగ్ భలే చమత్కారంగా, జంధ్యాల టచ్ ఆఫ్ హ్యూమర్‌తో సాగుతుంది. అందుకే ఆ సీన్ గురించి కొంచెం డీటైల్డ్‌గా చెప్పుకుందాం.

రాజేంద్రప్రసాద్ తన మతిమరుపు వలన అన్నీ పోగొట్టుకుంటుంటాడు. ఓ రోజు సుమలత వీళ్ళింటికి వచ్చి తలుపు కొడుతుంది. ఆ గదిలో రాజేంద్రప్రసాద్, చంద్రమోహన్ వుంటారు. తలుపు చప్పుడు వినగానే రాజేంద్రప్రసాద్ తలుపు తీస్తాడు. ఇంకేముంది? ఎదురుగా పాలరాతి శిల్పంలాంటి సుమలత నిలుచుని వ ౦ ం ది . వెంటనే సుమలత, రాజేంద్రప్రసాద్‌ని వంద రూపాయలు వుంటే సాయం చేయమని అడుగుతుంది. ఇక అంతే -రాజేంద్రప్రసాద్ మతిపోతుంది. అంత అందమైన అమ్మాయి డబ్బులు అడగ్గానే ఒంటిమీద స్పృహ తప్పి పిచ్చి కూతలు మొదలు పెడతాడు. ఆ మైకంలో ఏం మాట్లాడుతున్నాడో తెలియని పరిస్థితిలో 'వందేమిటి? మీరొచ్చి అడిగితే యాభై అయినా ఇచ్చేస్తానంతే' అంటూ అర్థం పర్థంలేని సంభాషణ మొదలుపెట్టి, చంద్రమోహన్‌ని పిలిచి జేబులో వున్న పర్సులోంచి



వందరూపాయలు తెమ్మంటాడు. చంద్రమోహన్ లోపలి గదిలోకి వెళ్ళి జేబులో చెయ్యి పెట్టగానే అంతా ఖాళీయే. ఆ విషయం రాజేంద్రప్రసాద్‌కి చెప్పగానే తను నీరుకారిపోతాడు. సుమలత ముందు తన పరువు నిలబెట్టుకోవడానికి ఏం చేయాలి? వాచీ అమ్మి డబ్బు తెమ్మని చంద్రమోహన్‌కి ఇస్తాడు. చంద్రమోహన్ వాచీ పెట్టుకుని బయల్దేరేసరికి 'ఎక్కడికీ వాచీ పట్టుకెళుతున్నారు' అని సుమలత అడిగితే, 'కీ ఇప్పించడానికి తీసుకెళ్తున్నాను' అని సమాధానమిస్తాడు చంద్రమోహన్. 'కీయేగా నేనిస్తాను, ఇటుతెండి' అంటుంది సుమలత. దాంతో కంగారుపడి 'లేదండీ, దీన్ని ఇస్త్రీ చేసి, కళాయి పెట్టించి తీసుకురావాలి' అని ఏదేదో చెబుతాడు చంద్రమోహన్. పరిస్థితినంతా అర్థం చేసుకున్న సుమలత 'చూడండి, ఇప్పుడేమీ సెకెండ్ హ్యాండ్ షాపులుండవు గాని, వాచీ తీసుకుని లోనికి వెళ్ళండి' అంటుంది.

అప్పుడు అసలు నిజం చెబుతుందామె. రాజేంద్రప్రసాద్ పారేసుకున్న పర్సు సుమలతకు దొరికింది. పర్సులో వున్న అడ్రసు ప్రకారం ఆ ఇంటికి వచ్చింది. ఈ విషయాన్ని రాజేంద్రప్రసాద్‌కి చెప్పి వెళ్లిపోతుంది. ఆ పర్సు పోగొట్టుకోవడం వల్ల కలిసిన సుమలతను చూడగానే ఈ రాజేంద్రప్రసాద్ మనసు పోగొట్టుకుంటాడు. అక్కణ్ణించే అసలు కథ మొదలవుతుంది. ప్రేమ పందెం బిగినవుతుంది.

ఇక ఇతర పాత్రల విషయానికొద్దాం. రాజేంద్రప్రసాద్, చంద్రమోహన్‌లు వుండే గదికి యజమాని బ్రహ్మానందం. ఆయన దుస్తులు కూడా పాత్రోచితంగా వుంటాయి. మోకాళ్ళవరకు వంచె ఎగగట్టి ఖద్దరు బనియన్, మధ్య పాపిడితో చమత్కారంగా కనిపిస్తాడు. అతని చిన్న తనంలో ఓ కోయదొర కనిపించి ఓ వాయిద్యంలో మంచి నైపుణ్యం సంపాదించి పేరు తెచ్చుకుంటావని చెప్పాడట. ఇక అప్పట్నుంచి కనబడిన ప్రతి వాయిద్యంతోనూ ప్రయోగం చేసి అందర్ని హింసిస్తుంటాడు.

ఈ పాత్ర గురించి బ్రహ్మానందంను కదిపితే - "జంధ్యాల గారి సినిమాల్లో నా పాత్రలన్నీ విభిన్నమైనవే. నా కెరీర్ తొలినాళ్లలోనే ఎన్నెన్నో గొప్ప పాత్రల్ని సృష్టించి నన్ను అంతెత్తుకు ఎదిగేట్టు చేసిన మహానుభావుడాయన. ఇక ఈ సినిమా విషయానికొస్తే - ఇందులో నాది విచిత్రమైన పాత్ర. ప్రేక్షకుల్ని బాగా గిలిగింతలు పెట్టే పాత్ర. ఇందులో నేను, శ్రీలక్ష్మి భార్యాభర్తలం.

ప్రతి పనిలో చేదోడు వాదోడుగా వుంటూ సాయపడే సూరిబాబు పాత్ర. ఇతగాడికి వేరే ప్రేమ వ్యవహారం వుంటుంది. ఆ ప్రేమ పుణ్యమా అని వాళ్ళ ఇంట్లోని సమస్యలను తన భుజాలపై వేసుకుని ఆ సమస్యలను సానుకూల పరుస్తుంటాడు.

రాజేంద్రప్రసాద్, చంద్రమోహన్, సుమలతల

"ఇద్దరికీ చెరో మేనరిజమ్ పెట్టారు" అని తెలిపారు.

బ్రహ్మానందం సతీమణిగా నటించిన శ్రీలక్ష్మి విషయానికొద్దాం. వీళ్ల కొడుకు పసివాడిగా వున్నప్పుడే చనిపోతాడు. ఆ కొడుకు గుర్తొచ్చినప్పుడల్లా ఎవరు ఎదురుగా వుంటే వారిని వెంటనే కొడుకులా ఆప్యాయంగా కౌగిలించేసుకుని "బాబూ.... చిట్టీ' అంటూ భోరున విలపించేస్తుందామె. చివరికి కూరల వాడైనా, పాలవాడైనా, పోస్ట్ మ్యాన్ అయినా... ఎవరైనా సరే అంతే. ఈ కౌగిలింతలకి బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్‌గా డోలు-సన్నాయి వాయిద్యం పెట్టడం జంధ్యాల



చిలిపితనాన్ని సూచిస్తుంది.

'అమరజీవి' మొదలుకుని జంధ్యాల సినిమాలకి ఆస్థాన నటుడిగా మారిన కోట శ్రీనివాసరావు ఓ చమత్కారమైన పాత్రలో కనిపిస్తారు. ఇందులో కోటశ్రీనివాసరావు పాత్ర పేరు 'పటేల్'. చంద్రమోహన్‌కి నాన్న. నైజాంకు చెందిన ఈ పటేల్‌గారు ఇల్లరికం వల్ల ఆంధ్రాప్రాంతానికి చెందిన తిమ్మాయపాలెం అనే గ్రామానికి రావాల్సి వస్తుంది. సినిమాలంటే మహాపిచ్చి. ఎక్కువ సినిమా పరిభాషనే తన మాటల్లో ఉపయోగిస్తుంటాడు. సినిమా తారలను కలిసినట్టుగా, సినిమా తీసినట్టుగా



కూడా కలలు కనేస్తుంటాడు. సుమన్, గౌతమి కాంబినేషన్‌లో సత్యమూర్తి దర్శకత్వంలో సినిమా తీస్తానని ఊహల్లో వాళ్ళతోనే మాట్లాడినట్టుగా భ్రమిస్తాడు. అలా ఈ సినిమాలో ఓ సీన్‌లో సుమన్,గౌతమి సత్యమూర్తులు కనిపిస్తారు. అలాగే హీరోలు కృష్ణ రమేష్‌బాబు కూడా ఈ సినిమాలో తళుక్కుమనే తారలు. వీళ్ళని కలిసి కోట మీతో సినిమా తీస్తానని అడుగుతాడన్నమాట.

కోటకు ఎంత సినిమా పిచ్చి వుందో, డబ్బు విషయంలో అంత పర్‌ఫెక్ట్. దాంతో తన ఇంటికి ఎవరొచ్చి కాఫీ, టీలు తాగినా, భోజనం చేసినా బిల్లు ఇచ్చి మరీ డబ్బులు వసూలు చేస్తుంటాడు.

ఈ సినిమాలో తన పాత్ర గురించి కోట అనుభవాలు తెలుసుకుందాం. "జంధ్యాలగారు మంచి స్నేహజీవి. అందరితోనూ కలిసిపోయి చక్కగా కాలక్షేపం చేసేవారు. ఈ ముచ్చట్లలో ఎవరైనా కొత్త జోక్ వేస్తే దాన్ని బాగా జ్ఞాపకం పెట్టుకుని ఏదో ఒక సినిమాలో ఎప్పుడో ఒక సందర్భంలో వాడుకుంటుంటారాయన. తెలంగాణా భాషలో రామాయణం చెబితే ఎలా వుంటుందోనన్న కాన్సెప్ట్‌తో నేనొక ఎపిసోడ్ తయారు చేసుకున్నాను. అది జంధ్యాలగారికి వినిపిస్తే ఇలా 'జయమ్ము నిశ్చయమ్మురా' లో నా పాత్రని సృష్టించారు." అని పాత జ్ఞాపకాలను కొత్తగా గుర్తుచేసుకున్నారు కోట శ్రీనివాసరావు.

క్లైమాక్స్‌లో కైకాల సత్యనారాయణకు కోట నైజాం భాషలో 'పాండవ వనవాసం' చెప్పే సీన్ బాగా పండింది. ఆ తర్వాత కోట 'పాండవ వనవాసం' సినిమా స్టోరీకి కౌంటర్‌లా బ్రహ్మానందం క్రికెట్ కామెంటరీ, హిందీ తెలుగు సినిమాలు మిక్స్ చేసి చెప్పిన 'డైలాగ్స్' బాగా నవ్వు పుట్టిస్తాయి.

ఈ సినిమాలో కథానాయిక తండ్రిగా, తీసివేయబడ్డ మేజర్‌గా నటించారు వేలు. తన పాత్ర గురించి వేలు ఏమన్నారంటే "ఇందులో నాది నాస్తికుని పాత్ర. హాస్యాన్ని కురిపించే మంచి సన్నివేశాలున్నాయి. నా కెరీర్‌లో దిబెస్ట్‌గా చెప్పుకునే సినిమాల్లో దీన్నికూడా చెప్పుకోవచ్చు. ఈ సినిమాని ఎప్పుడు చూసినా ప్రేక్షకులు మంచి రిలీఫ్

## పాత్రలు - పాత్రధారులు

| | |
|---|---|
| రాంబాబు | : రాజేంద్రప్రసాద్ |
| శాంతి | : సుమలత |
| సూరిబాబు | : చంద్రమోహన్ |
| నారాయణ | : కైకాల సత్యనారాయణ (అతిథిపాత్ర) |
| జగన్నాథం | : సుత్తివేలు |
| సీత | : అవంతి (నూతన పరిచయం) |
| పటేల్ | : కోట శ్రీనివాసరావు |
| చక్రపాణి | : అశోక్‌కుమార్ |
| మూర్తి | : టెలిఫోన్ సత్యనారాయణ |
| గోపాలం | : బ్రహ్మానందం |
| కాంతం | : శ్రీలక్ష్మి |
| రంగనాథం | : ధర్మవరపు సుబ్రహ్మణ్యం |
| సుబ్బలక్ష్మి | : రాధాకుమారి |
| సీతతల్లి | : లక్ష్మీప్రియ |
| బృహస్పతి | : థమ్ |
| తాయారు | : హేమ |

మరియు

సత్తిబాబు, కోటసత్యరంగయ్య శాస్త్రి కవి, చర్చిల్, ఆర్.వి. అప్పారావు, విజయదుర్గ, కె.వి.లక్ష్మి, షర్మిలా, దివ్య, రమ.



ఫీలవుతుంటారు. జంధ్యాలగారివన్నీ రెపిటీషన్ వాల్యూ వున్న సినిమాలే" అని చెప్పారు.

ఇందులో చంద్రమోహన్ సరసన అవంతి అనే కొత్తమ్మాయి నాయికగా పరిచయమైంది. ఆమె ఈ చిత్ర నిర్మాత జివిహెచ్ ప్రసాద్ చెల్లెలు. "చంద్రమోహన్ ప్రక్కన హీరోయిన్ కోసం ఎవరితో చేయించాలా అని ఆలోచిస్తున్న సమయంలో నటన పట్ల ఆసక్తి ఉన్న మా చెల్లెలు గుర్తుకొచ్చింది. అలా మా చెల్లి ఇందులో నటించింది. ఆ తరువాత 'భలే ఖైదీలు', 'రౌడీ టీచర్', 'మహాయజ్ఞం' తదితర చిత్రాల్లో నటించింద"ని జివిహెచ్ ప్రసాద్ తెలిపారు.

ఈ చిత్రం ద్వారా ఓ టీవీ నటుడు తెలుగు తెరకు పరిచయమయ్యారు. ఆయన పేరు చెబితే ఈ తరం ప్రేక్షకులు ఇట్టే గుర్తుపట్టేస్తారు. ఇప్పటి టాప్ కమెడియన్లలో ఒకరుగా ఎదిగిన ఆయన పేరు 'ధర్మవరపు సుబ్రహ్మణ్యం'.

ధర్మవరపు సుబ్రహ్మణ్యం ఈ సినిమాలోకి ఎలా ఎంటరయ్యారో ఆయన మాటల్లోనే చూద్దాం.

"నా 'ఆనందోబ్రహ్మ' సీరియల్ ఆంధ్రదేశంలో ఎంతలా సంచలనం సృష్టించిందో అందరికీ విదితమే. జంధ్యాల గారు ఆ సీరియల్ చూసి మద్రాసునుంచి నాకు ఫోన్ చేసి 'సినిమాల్లో చేస్తారా' అనడిగారు. ఇది 1985 నాటి మాట. అప్పుడు నేను టీవీల్లో ఫుల్ బిజీ. సినిమా



ఫీల్డ్ అంతా మద్రాసులోనే వుంది. హైదరాబాద్‌నుంచి అక్కడికి వెళ్తే టీవీ మీడియాలో బ్రేక్ వస్తుంది. అందుకే జంధ్యాలగారు ఇచ్చిన అవకాశాన్ని ఉపయోగించుకోవడానికి వెనుకంజ వేశాను. నాలుగేళ్ల తర్వాత మళ్లీ ఆయన దగ్గర్నుంచి



పిలుపొచ్చింది. ఇక ఆ అవకాశం వదులుకోకూడదని బలంగా నిశ్చయించుకున్నాను. అలా 'జయమ్ము నిశ్చయమ్మురా' సినిమా ద్వారా నాతో వెండితెర అరంగేట్రం చేయించారు జంధ్యాల. ఈ సినిమాలో నాది హీరో తండ్రి వేషం. ఈ పాత్రని నన్ను దృష్టిలో పెట్టుకునే రాశానని రచయిత ఆదివిష్ణు మా ఇంటికి వచ్చినప్పుడు చెప్పడం జరిగింది. మద్రాసులో పదిరోజులు షూటింగ్‌లో పాల్గొన్నాను. పామ్‌గ్రోవ్ హోటల్‌లో నా బస ఏర్పాటుచేశారు. జంధ్యాల గారు రోజూ నా రూమ్‌కి వచ్చేవారు. తక్కువ సమయంలోనే మేమిద్దరం మంచి స్నేహితులం అయిపోయాం. ఆయనకి నేనన్నా, నా కామెడీ అన్నా, నేను డైలాగ్ చెప్పే విధానమన్నా చాలా ఇష్టం. మా ఇద్దరి డిస్కషన్స్‌లోంచి కైకాల సత్యనారాయణ గారి పాత్ర పుట్టింది. ఇందులో ఆయనది అప్పుల మీద బ్రతికే పాత్ర. కొత్త అప్పులు తీసుకుని పాత అప్పులు తీర్చేస్తుండటం ఆ పాత్ర హాబీ. సరదాగా మేం అనుకున్న ఫార్ములాతో జంధ్యాల గారు ఈ పాత్రని సృష్టించటం జరిగింది.

'జయమ్ము నిశ్చయమ్మురా' చేసే నాటికి 10-12 టీవీ సీరియల్స్ చేసి వున్నాను. అలాగే ఈ సినిమాలో నటించిన చాలామంది ఆర్టిస్టులతో బాగా పరిచయాలున్నాయి. అందుకేనేమో తొలి సినిమా అయినాగానీ ఎలాంటి ఇబ్బంది ఎదుర్కోలేదు. ఈ సినిమాకి నాకు 7,500 రూపాయలు పారితోషికం ఇచ్చారు. జంధ్యాల గారు పిలిచి అవకాశం ఇవ్వడమే గొప్పగా భావించి అసలు పారితోషికమే తీసుకోకూడదనుకున్నాను. చివరకు జంధ్యాల గారు బలవంతం మేరకు తొలి పారితోషికం అందుకున్నాను. అటుపై జంధ్యాల గారి కాంబినేషన్‌లో 10 సినిమాలు చేసాను. ఈ సినిమా విడుదల కాకముందే నటునిగా బిజీ అయిపోయాను. ప్రతాప్ ఆర్ట్స్ కె. రాఘవ గారు 'అంకితం' సినిమాలో పిలిచి వేషం ఇచ్చారు.

ఇలా 'జయమ్ము నిశ్చయమ్మురా'తో మొదలైన నా సినీ జీవనయానం ఇప్పటివరకూ విజయవంతంగా సాగుతూనే ఉంది" అని చెప్పారు ధర్మవరపు సుబ్రహ్మణ్యం.

ఇక్కడో విషయం చెప్పుకోవాలి. అవకాశాన్ని అస్సలు వృథా చేయరు జంధ్యాల. చీమలాంటి

## కథాంశం

రాంబాబు, సూరిబాబు క్లాస్‌మేట్స్, రూమ్మేట్స్. ఇద్దరూ కలిసి ఒక ఉద్యమంలా ప్రేమ పెళ్ళిళ్ళు చేస్తుంటారు. తను బస్‌లో పాగొట్టుకున్న పర్స్‌ను తీసుకొచ్చిన శాంతిని గాఢాతిగాఢంగా ప్రేమించేస్తాడు రాంబాబు. తన కాలేజ్‌ని, తన అడ్రస్‌ని తెలుసుకోమని రాంబాబుకి పజిల్ పెడుతుంది శాంతి. ఈలోగా కాలేజ్ సెలవులు ఇవ్వడంతో తన ఊరికి వెళ్ళిపోతుందామె. సూరిబాబు, సీతని ప్రేమించిన పాపానికి వాళ్ళ ఫ్యామిలీకి అండగా నిలవాల్సి వస్తుంది. సెలవులకి తన ఊరు వెళ్ళిన సూరిబాబుకి, అక్కడ శాంతి కనిపిస్తుంది. ఈ విషయం వెంటనే రాంబాబుకి తెలియజేస్తాడు. ఏప్రిల్ 14 నుంచి అక్టోబర్ 14లోగా తన ప్రేమను పండించుకుంటే రాంబాబుకి ఆ అమ్మాయితో పెళ్ళి జరిపిస్తానని తండ్రి రంగనాథం నిబంధన విధిస్తాడు.

తీరా ఆ ఊరికెళ్ళాక శాంతికి ప్రేమ వివాహం కన్నా, పెద్దలు కుదిర్చిన వివాహం మీదనే గురి వుందని తెలుస్తుంది రాంబాబుకి. దాంతో శాంతి తల్లితండ్రుల్ని మెప్పించి తన పెళ్ళికి గ్రీన్ సిగ్నల్ తెప్పించుకునే ప్రయత్నంలో పడతాడు. అలాగే రాంబాబు, శాంతిల మధ్య స్వీట్ ఛాలెంజ్ మొదలవుతుంది.

శాంతి తండ్రి జగన్నాథం పెట్టిన పరీక్షలో విజేతగా నిలుస్తాడు రాంబాబు. అసలు విషయమేమిటంటే శాంతి తండ్రి జగన్నాథం, రాంబాబు తండ్రి రంగనాథంలు బాల్యస్నేహితులు. శాంతి,రాంబాబుల పెళ్ళి చేయాలని జగన్నాథం ,రంగనాథం లు తలపోసి గొడవపడతారు. మొత్తానికి శాంతి,రాంబాబు ఒక్కటవుతారు.

అలాగే గొడవపడిన స్నేహితులు ఒక్కటవుతారు.

**రిలీజ్ : 1989**

**నిర్మాణవ్యయం :**

సుమారు 55 లక్షలు

**నిర్మాణప్రాంతాలు**

మద్రాసు,గరగం బాకం, ఆళ్వార్‌పేట

**వర్కింగ్‌డేస్**

28 రోజులు

చిన్న సన్నివేశంలో కూడా ఏనుగులాంటి హాస్యాన్ని నింపడం ఆయనకే చెల్లింది. ఈ తరహా కామెడీ సీన్‌ని తన తొలి సినిమాలోనే చేసే అవకాశం దక్కించుకున్నారు ధర్మవరపు. ఉదాహరణకు - ధర్మవరపు సుబ్రహ్మణ్యం చేసిన ఓ సీన్ తీసుకుందాం. ఆయనొక స్కూల్ టీచర్. ఇంట్లో పరీక్ష పేపర్లు దిద్దుతుంటాడు. ఈ లోగా ప్రాణస్నేహితుడు వేలు రాసిన ఉత్తరం వచ్చిందని చెప్పి, చదువుతుంటుంది ధర్మవరపు భార్య. మొదట పరుష వాక్యాలు వినబడటంతో బాగా ఉన్న పేపర్‌ని కూడా ఫెయిల్ చేస్తాడు. తర్వాత మంచి వాక్యాలు వినబడటంతో బాగాలేని పేపర్‌ని కూడా పాస్ చేసేస్తాడు. ఈ సీన్ చూసి చాలా మంది తమ చిన్ననాటి స్కూల్ మాస్టర్లని గుర్తుకు తెచ్చుకున్నారు.

మళ్లీ తారాగణం విషయంలోకి వద్దాం. 'త్రివేణి', 'మహిళామేలుకో', చిత్రాల్లో హీరోయిన్‌గా నటించిన లక్ష్మీప్రియ ఇందులో చెవిటి తల్లి (చంద్రమోహన్ అత్తగారు) గా నటించి మంచిపేరు తెచ్చుకున్నారు. సుమలత తల్లిగా పరమ ఆస్తికురాలైన పాత్రను రాధాకుమారి పోషించారు.


పుల్లారావు

రాజేంద్రప్రసాద్ సుమలతల పెళ్ళి పందిట్లో ఒకతన్ని చూసి 'నాన్నా చిట్టీ', అని శ్రీలక్ష్మి కౌగిలించుకోబోతే, అతను కాస్త భయపడి పారిపోతాడు. ఆ వ్యక్తి ఎవరో కాదు - ఈ సినిమాకి అసోసియేట్ డైరెక్టర్‌గా పనిచేసిన జె.పుల్లారావు. ఈ పుల్లారావే అటుపై బాలాజీ ఆర్ట్స్ సంస్థ నిర్మించిన సీమసింహం, ఒక రాధ ఇద్దరు కృష్ణులపెళ్లి, మా విడాకులు, సముద్రం తదితర సినిమాలకు సమర్పకుడిగా వ్యవహరించటమే కాక దర్శకునిగా 'జూనియర్స్' (వీళ్లు పెద్ద ముదుర్లు) చిత్రాన్ని నిర్మించారు.

నటి సత్యప్రియ తమ్ముడు బాబ్జీ ఈ చిత్రం ద్వారా కెమెరామెన్‌గా పరిచయమ్యారు.

ఈ చిత్రం పాటల రికార్డింగ్ 1989 మార్చి 9న మద్రాసు విజయాడీలక్స్ రికార్డింగ్ థియేటర్‌లో జరిగింది. 'అభిమతమో అభినయమో ఈ ప్రేమ చతురాతి చతురం' అనే ముళ్ళపూడి శాస్త్రి గీతాన్ని రాజ్-కోటి స్వరకల్పనలో బాలు, సుశీల పాడగా తొలి పాటగా రికార్డ్ చేశారు. ఆ తర్వాతి రోజే మద్రాసులోని ఆళ్వార్ పేటలో షూటింగ్ కూడా ప్రారంభమైంది. 'మాకు మంచి మనసులున్న మీ ఆశీస్సులు కావాలి' అని రాజేంద్రప్రసాద్ పలికే డైలాగ్‌ని ముహూర్తపు షాట్‌గా చిత్రీకరించారు. ఈ షాట్‌కి హీరో కృష్ణంరాజు క్లాప్‌నివ్వగా, హీరో కృష్ణ కెమెరా స్విచ్ ఆన్ చేశారు. వైజాగ్‌లో తన చిత్రాల షూటింగ్స్ ఎక్కువగా చేసే జంధ్యాల ఈ సినిమా టాకీ పార్ట్ మొత్తం సింగిల్ షెడ్యూల్‌లో మద్రాసు చుట్టు పక్కల ప్రాంతాల్లో చిత్రీకరించారు.

ఎన్‌టిఆర్ సినిమా 'శభాష్ రాము' లో ఓ సూపర్‌హిట్ పాట పల్లవినాధారంగా ఈ చిత్రానికి టైటిల్ పెట్టారు. "హాస్యప్రధానంగా రూపొందిన ఈ చిత్రానికి ఈ టైటిల్ సరిపోవడమే కాకుండా, పాత చిత్రాల్లోని పాటలు బాగా పాపులర్ అయిన దృష్ట్యా వినడానికి సొంపుగా ఉంటుంది. అందుకే నా చిత్రాలకు ఇటువంటి టైటిల్స్ పెడుతున్నా" అని అప్పట్లోనే ఈ విషయమై స్పష్టంగా ప్రకటన ఇచ్చారు జంధ్యాల.

ఈ చిత్రంతోనే జంధ్యాలతో మొదటిసారిగా రాజ్ -కోటి పనిచేసారు. జంధ్యాల ప్రాణస్నేహితుడైన ఆదివిష్ణు కథనందించారు. "ఇది డైరెక్ట్ కథే. సినిమా కోసం తయారు చేశాను. తమిళ్‌లో కూడా ఈ సినిమా చేయాలని జంధ్యాల ముచ్చటపడ్డాడు కానీ, కుదర్లేదు. 'జయమ్ము నిశ్చయమ్మురా' తర్వాత నిర్మాత 'జ్యోతి'ప్రసాద్‌కి మళ్ళీ సినిమా చేయాలనుకుని త్రివేండ్రం వెళ్ళి అక్కడ 'చిత్రం' అనే సినిమా చూసొచ్చాం. అదీ వర్కవుట్ కాలేదు" అని ఈ సినిమా తాలూకు జ్ఞాపకాలను విశదీకరించారు ఆదివిష్ణు.

ఈ చిత్ర నిర్మాత 'జ్యోతి' (జి.వి.హెచ్.) ప్రసాద్ కిదే తొలి చిత్రం. అంతకుముందు కృష్ణంరాజు, కృష్ణ దగ్గర బొబ్బిలి బ్రహ్మన్న, తాండ్ర పాపారాయుడు, ముగ్గురు కొడుకులు, బజారురౌడీ, ప్రాణస్నేహితులు తదితర చిత్రాలెన్నింటికో ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్‌గా పనిచేసారీయన.

అలనాటి ప్రముఖ నటి కన్నాంబకు మనవడి వరసైన ఈ నిర్మాత ఇప్పుడు రాజేంద్రప్రసాద్‌తో 'ఇద్దరు అత్తల ముద్దుల అల్లుడు' చిత్రాన్ని నిర్మిస్తున్నారు.

మరి 'జయమ్ము నిశ్చయమ్మురా' గురించి నిర్మాత ఏం చెబుతారంటే...

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| బ్యానర్ | : | సుదర్శన్ పిక్చర్స్ |
| సమర్పణ | : | కైకాలసత్యనారాయణ, కోట శ్రీనివాసరావు |
| కథ | : | ఆదివిష్ణు |
| స్క్రీన్‌ప్లే - సంభాషణలు | : | జంధ్యాల |
| సంగీతం | : | రాజ్-కోటి |
| ఎడిటింగ్ | : | గౌతంరాజు |
| ఆర్ట్ | : | విజయకుమార్ |
| పాటలు | : | జొన్నవిత్తుల, ముళ్లపూడిశాస్త్రి, సిరివెన్నెల |
| నేపథ్యగానం | : | బాలు, సుశీల, శైలజ, చిత్ర |
| డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : | బాబ్జీ |
| ఫైట్స్ | : | స్పైడర్ విక్కీ |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : | బత్తుల రామకృష్ణ, జె.పుల్లారావు |
| ఛీఫ్ అసోసియేట్ | : | యస్.బి. శాస్త్రి |
| నృత్యాలు | : | తార - రఘు |
| నిర్మాత | : | జి.వి.హెచ్. ప్రసాద్ |
| రచన - దర్శకత్వం | : | జంధ్యాల |


రాజేంద్రప్రసాద్, జంధ్యాల, సుమలత

# 'జయమ్ము నిశ్చయమ్మురా'లో ప్రజాదరణ పొందిన కొన్ని డైలాగ్స్

☆ భక్తి సినిమాకెళ్లొస్తున్నారా..? మిమ్మల్నే భక్తి సినిమాకెళ్లొస్తున్నారా?... అని అడుగుతున్నాను

అవును ...

నాన్నా చిట్టీ

ఏమండీ పొరపాటైపోయిందండీ...ఏమండీ.. ఏమండీ.. నా మాట వినండి..

నా చిట్టికి కూడా ఇలాగే భక్తి సినిమాలంటే ప్రాణం బాబూ..

ఏమండీ.. వదలండీ..

నాన్నా.. చిట్టీ..

వదలండీ..

బాబూ... ఇలా ఎప్పుడు వడితే అప్పుడు ఎవర్ని వడితే వాళ్లని.. కౌగిలించుకుంటుందని మా ఆవిడ్ని అపార్థం చేసుకోకండి బాబూ.. నిజంగా దాని మనసులో ఏ దుర్బుద్ధి లేదు. మీకు తెలుసుగా... మా ఒక్కగానొక్క సంతానం చిట్టికి 20 ఏళ్లు దాటకుండానే నూరేళ్లు నిండిపోయాయి. అందుకే మా చిట్టి ని గుర్తు చేసిన వాళ్లందరినీ కౌగిలించుకుని బావురుమంటుంది మా కాంతం. బాబూ.. నువ్వు కూడా దాన్ని తప్పుగా అర్థం చేసుకోకు నాయనా.. పాపం... మీరేం చేస్తార్లెండి.. ఆవిడకు... వద్దులెండి..

ఆపావేం బాబూ..

ఏ మాట మాట్లాడితే ఆవిడకు మళ్లీ మీ చిట్టి గుర్తుకొచ్చి ఎగిరి నా మీద దూకుతారేమోనని భయం వేసి...

ఏమిటో మా జీవితంలో కళ్యాణి రాగాలు లేవు... అన్నీ శివరంజనిలే.

☆ ఆ సౌండ్ ఏమిటి అక్కయ్యగారూ... క్రింద ఏమైనా ఇనుప బీరువాలు జరుపుతున్నారా ?

కాదురా.. పాతికేళ్లనుండి తెరవని పాత కిటికీలు తెరుస్తున్నట్టున్నారు పాపం..

కాదు బాబూ... ఆయన స్నేహితుడి దగ్గర నుండి ఫ్లూటు లాక్కున్నారు. అది ప్రాక్టీసు చేస్తున్నారు.

అలాగా.. వాయులీన హింస అయిపోయింది ఇంక వేణుగాన ధ్వంసం అన్నమాట

☆ వాయిస్తున్నాడురా..

మరే ఫ్లూటు వాయిస్తున్నాడు

నోటితో ఫ్లూటుని, ఆ శబ్దంతో మనల్ని వాయిస్తున్నాడురా

పిల్లి దగ్గినట్టు.. నల్లి తుమ్మినట్టు ఫ్లూటు వాయించటం వాడి ఒక్కడికే సాధ్యంరా.. కళ్లకు రెప్పలు పెట్టినట్లు... చెవులకి మూతలు కూడా పెడితే బాగుండేదిరా ఆ దేవుడు.

☆ మొత్తం ఎంతయిందిరా బృహస్పతీ..

36 పచార్లు 23 చిన్న నిట్టూర్పులు, 16 పెద్ద నిట్టూర్పులూనండయ్యా

ఆ... ఓరి నీ మొఖం ఈడ్చ, ఇందాకటి నుండి నువ్వు రాస్తున్నది నా పచార్ల లెక్కా.. ఒరే నువ్వు బృహస్పతివి కాదురా.. వాసన కొట్టే వనస్పతివి. అక్షరజ్ఞానం లేని వాజస్పతివి.

☆ రారా రాముడు.. ఇదేనా రావడం

కాదు.. ఓ వారం రోజులు క్రితమే వచ్చి బస్టాండ్‌లో అడుక్కుతింటున్నాను.

☆ నిన్ననే మా ఆవిడ నా సలహా వింది... పాటించి బాగుపడింది.

ఏంటా సలహా...

మీనాక్షీ.. ఎలాగూ నేనే వంట చేస్తున్నాను. ఈ నాలుగు గిన్నెలు తోమడానికి పనిమనిషెందుకు దండగ. గిన్నెలు నేనే తోమేస్తాను. పనిమనిషిని మానిపించేయ్ అని సలహా ఇచ్చాను. వెంటనే నా సలహా మెచ్చేసుకుని టక్కున మానిపించేసింది.

నువ్వు అంట్ల వెధవ్విరా... తోముకో.. అంట్లు తోముకో..

☆ అదేమిటండీ, మతుండే మాట్లాడుతున్నారా.. మధ్యాహ్నం మాగాయి పచ్చడిలో గోంగూర పులుసు కలుపుకోవద్దంటే విన్నారు కాదు..

☆ రిక్షావోడికి డబ్బులివ్వాలి ఓ పది రూపాయిలు చిల్లర ఉంటే ఇవ్వండి. (ఇచ్చిన డబ్బులు జేబులో పెట్టుకుంటుంటే చూసి) రిక్షా వాడికి ఇవ్వాలన్నారు.. వెళ్లేటప్పుడు ఇవ్వటానికి.

☆ అప్పులకోసం ఆరు నెలలు ఉత్తర భారతదేశంలోనూ, ఆరు నెలలు దక్షిణభారత దేశంలోనూ తిరుగుతూంటాడాయన. మొన్ననే 500 రూపాయలు ఖర్చుపెట్టి ఢిల్లీ వెళ్లి 50 రూపాయల అప్పు సంపాదించుకొచ్చాడు.

☆ బావగారి ఫేస్ మహబాగా నచ్చుతుంది నాకు. ఏ పని చేసినా విడ్డూరమే. మామూలుగా పెళ్లికి బస్సు వేసుకొస్తారు. బావగారు బస్సు తోసుకొచ్చారు. అదొక వెరైటీ

☆ ఇప్పుడే అసెంబ్లీ నుండి బయటికొచ్చినట్టు బట్టలు చిరిగి, జుట్టు రేగి ఎంత అందంగా ఉన్నారో పెళ్లివారు.

☆ సైన్మా చూద్దామని పోయినా.... ఏం సైన్మా అనుకున్నావ్... అదేందివయ్యా... పాండవులందరూ కలిసి జంగల్ పోతారు చూడూ... పాండవవనవాసం. గది చూసినా... జబర్దస్త్ పిక్చర్ అనుకోరాదు. జరంత స్టోరీ చెబుతా రా,...

☆ విడాకులు కాకపోతే విస్తరాకులిప్పించుకో

☆ ఓసి నీ మొగుడు మినిస్టరవ్వా

☆ మీకు రిజర్వ్‌బ్యాంక్ పుట్టా.. నూరేళ్లు పిల్లా పాపలతో హాయిగా వర్థిల్లండి.

☆ సేటూ నువ్వు సేటువు కాదు కేటువి..

☆ వద్దులెండి దీపాల గొడవ పెట్టకండి ఇప్పుడు.. ఇప్పటికే వెలుగెక్కువై నా బుర్రంతా చీకటై చస్తున్నాను.

☆ ఇది బీదవాడి కారు, మాది కుర్రకారు, మేం చేస్తున్నది షికారు, తను తాయారు, మేం పెళ్లికి తయారు, ఇది ఖరారు.

☆ కమ్మని కథ చెప్తానంటే గిట్లనే గాడు కూడా పారిపోయిండు. ఏం చేయాలి.. పూర్తిగా చెప్తేనే గానీ మనకు నిద్ర పట్టదు.

నే పోతా.. నే పోతా....

ఇప్పుడు నువ్ దొరికినవ్ కదా మిగిలిన కథ నీకు చెప్తా ఫో..

ఏ కథ

గదేరా.... పాండవులందరూ కలిసి జంగల్ పోతారు చూడూ..

నే పోతా..

పాండవవనవాసం భయ్

అందులా ఎన్వీవోడు తొడ గొడుతున్నడు భయ్.. సావిత్రమ్మ ఏడుస్తోంది....ఎన్వీవోడు తొడ గొడుతున్నడు.. సావిత్రమ్మ ఏడుస్తోంది.... ఎన్వీవోడు తొడ గొడుతున్నడు.. సావిత్రమ్మ ఏడుస్తోంది... ఎన్వీవోడు తొడ గొడుతున్నడు..... సావిత్రమ్మ ఏడుస్తోంది.... ఇందతా ఎవరు చూస్తున్నరనుకున్నవ్ ఎన్టీవోడు చూసిండు బిడ్డా.. ఎన్టీవోడంటే ఏమనుకున్నవ్ ..హిందుస్తాన్‌లో గసుమంటి యాక్టర్ లేనే లేడు... గాడి లెక్క ఎవడూ యాక్షన్ చేయలేడు భయ్... జబర్దస్తే చేస్తడు... కానీ ఏం చేస్తడాడు.. ఫాల్తుగానిలెక్క భీముడేషం వేశాడు కదా... గద పట్టుకుని పిసుకుతాఉన్నడు ... గంతే భయ్.. పాత పెట్టెల పిక్చర్లన్నీ గట్లనే ఉంటయ్... కానీ ఏంచెస్తన్నాడు గద పట్టుకుని పిసుకుతా వున్నడు.. గప్పుడూ....

వాలీ... చప్పుడు చేయకు మిగతా కథ నేను చెప్తావినుండ్రి... ఇలా ఎన్టీవోడు గద పట్టుకుని పిసుకుతాండా.. ఇది ఎవడు చూసిండనుకున్నవ్... గవాస్కర్ చూసిండు.. గవాస్కర్ బ్యాట్ పట్టుకుని పిసుకుతావున్నడు.. ఇది కపిల్‌దేవ్‌కు నచ్చలా... కపిల్‌దేవ్ పోయి రవిశాస్త్రికి చెప్పిండు... రవిశాస్త్రి బడా గుస్సామీద చర్రున కారువేసుకుని వెళ్లి కన్నాంబను పిల్చుకొచ్చిండు... కన్నాంబ అంటే ఎవరనుకున్నవ్ ... గిందుస్తాన్‌లో గసువంటి ఆర్టిస్ట్‌లేదు మల్లా... జయప్రద సిస్టర్.. మీనాక్షీ శేషాద్రి డాటర్... శ్రీదేవి, భానుప్రియల కజిన్ సిస్టర్.. అహహా... హేమమాలిని మనవరాల్.. ఆ విషయం టిప్పు సుల్తాన్‌కు నచ్చలేదు... రుద్రమదేవి, టిప్పుసుల్తాన్ ఓ కప్పు కాఫీ తాగి ఛత్రపతి శివాజీతో యుద్ధం చేసి శ్రీ కృష్ణుని చేతిలో ఓడిపోయార్. కన్నాంబ డ్యాన్స్ చేస్తది.. కన్నాంబకు పోటీగా హేమమాలిని డ్యాన్స్ చేయమన్నాడు... ఎవరూ..? రాజబాబు. రాజబాబు చెబితే హేమామాలిని వినలా.. రాజబాబు నర్రున పోయిండు రేలంగిని పిల్చుకొచ్చిండు.... రేలంగి నెత్తి మీద ఒకటి వేసి హేమామాలిని డ్యాన్స్ చేయమన్నడు.. అప్పుడు హేమామాలిని, రమణారెడ్డి ఇద్దరు డ్యాన్స్ మొదలు పెట్టిండ్రు. ఇదంతా ఎవడు చూస్తుండనుకున్నవ్... మహమ్మద్ జీన్ తుగ్లక్ చూస్తుండు. తుగ్లక్ అంటే ఎవడూ...

తమ్మీ.. ఇంక నన్ను వొదిలేయరాదే.. ఒడ్డున పడ్డ చేప తీరునయిపోయింది నా బ్రతుకు.

ఏంటి బాబూ ఏం అన్నావ్... ఒడ్డున పడ్డ చేపనన్నావా..

అవ్..

బాబూ చిట్టీ..



శ్రీలక్ష్మి, చంద్రమోహన్, రాజేంద్రప్రసాద్, బ్రహ్మానందం

"నన్ను నిర్మాతని చేసిన జంధ్యాల గారికి జీవితాంతం ఋణపడి వుంటాను. అలాగే నేను నిర్మాత కావడానికి కోట శ్రీనివాసరావు ప్రోత్సాహం కూడా ఎంతో ఉంది. మద్రాసులోని మహాలింగపురంలో జంధ్యాల గారు వేరే సినిమా షూటింగ్ చేస్తుంటే కోట నన్ను తీసుకెళ్లి సినిమా ఓకే చేయించారు. జంధ్యాల, రాజేంద్రప్రసాద్ కాంబినేషన్‌లో సినిమాకోసం అప్పటికే చాలామంది నిర్మాతలు ప్రయత్నాలు చేస్తున్నారు. ఈ విషయంలో రాజేంద్రప్రసాద్ నా వెన్నుతట్టి ప్రోత్సహించడంతో ఆ కాంబినేషన్‌లో సినిమా చేసే అదృష్టం నాకు దక్కింది. నేను కృష్ణ, కృష్ణంరాజుల నిర్మాణ సంస్థలకి ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్‌గా చాలా సినిమాలకు పనిచేశాను. అందుకే నా తొలి సినిమాకు వాళ్లతోనే క్లాప్, స్విచ్చాన్ చేయించాను. ఈ సినిమా విషయంలో వాళ్లు నాకు చాలా మోరల్ సపోర్ట్‌నిచ్చారు. మద్రాసు చుట్టు పక్కల ప్రాంతాల్లో సింగిల్ షెడ్యూల్‌లో షూటింగ్ పూర్తిచేయడం జరిగింది. అప్పట్లో రాజేంద్రప్రసాద్‌కి బ్రేక్ డ్యాన్స్ సాంగ్ పెట్టింది మేమే. తార దానికి డాన్స్ మాస్టర్. ఆరు రాత్రిళ్లు ఆ పాట తీయడం జరిగింది.

**తొలి పరిచయాలు**

1. నిర్మాత జివిహెచ్ ప్రసాద్
2. కెమెరామెన్ బాబ్జీ
3. సెకండ్ హీరోయిన్ అవంతి
4. నటుడు ధర్మవరపు సుబ్రహ్మణ్యం
5. నటుడు అశోక్‌కుమార్

టీవీ నటుడు అశోక్‌కుమార్‌కిదే తొలి చిత్రం. అలాగే ధర్మవరపు సుబ్రహ్మణ్యంక్కూడానూ. ఆ పాత్రని ఆయనతోనే చేయించాలని జంధ్యాల గారు అనుకున్నారు. అయితే మేం తొలుత ఆ పాత్రకి గొల్లపూడి మారుతీరావుని అనుకోవడం జరిగింది.

సినిమా షూటింగ్ చాలా ఫాస్ట్‌గా జరిగింది. అప్పట్లో కైకాల సత్యనారాయణ, కోట శ్రీనివాసరావు, బాబూమోహన్‌ల డేట్స్ నేనే చూసేవాణ్ణి. అందుకే అందరూ నాకు సహకరించారు. చిత్ర సమర్పకులుగా కైకాల సత్యనారాయణ, కోట శ్రీనివాసరావుల పేర్లు నా కృతజ్ఞతను చాటుకునే నిమిత్తం వేశాను.

'తాండ్రపాపారాయుడు' సినిమాకు నేను ప్రొడక్షన్‌లో పనిచేశాను. ఆ సినిమాకు గిటార్ ప్లేయర్ కోటి, కండక్టర్ రాజు. అప్పట్నుంచీ వాళ్లతో మంచి పరిచయం వుంది. అందుకే రాజ్ - కోటి ప్రత్యేక శ్రద్ధ తీసుకుని మ్యూజిక్ పెద్ద హిట్ కావడానికి సహకరించారు. ఇందులో అన్ని పాటలకీ ఎ. ఆర్. రెహమాన్ (అప్పట్లో దిలీప్) కీ బోర్డ్ ప్లే చేశాడు.

రిలీజ్ డేట్ అనుకున్నాక ఒక రోజు ముందే మా డ్రైవర్‌తో ఫ్లయిట్‌లో అన్ని ప్రింట్లు హైదరాబాద్ పంపించడం జరిగింది. తొలి సినిమా కాబట్టి ఎలాంటి ఆలస్యం, అవాంతరం జరగకూడదనే అలా చేశాను.

ఈ సినిమా నాకు ఊహించని లాభాల్ని తెచ్చి పెట్టింది. నైజాంలో ఫస్ట్‌వీక్ షేర్ 7 లక్షలు వచ్చింది. అప్పటికి రాజేంద్రప్రసాద్ సినిమాల్లో హయ్యెస్ట్ షేర్ ఇదే. 15 కేంద్రాల్లో అర్థశతదినోత్సవం జరుపుకుంది.

ఇదే సినిమాని 1993లో పాండ్యరాజన్ హీరోగా జార్జిప్రసాద్ దర్శకత్వంలో 'కిలాడీ మాపిళ్లై'(కిలాడీ అల్లుడు అని అర్థం) పేరుతో తమిళంలో రీమేక్ చేశాను" అని చెప్పుకొచ్చారు నిర్మాత ప్రసాద్.

ఇదండీ 'జయమ్ము నిశ్చయమ్మురా' సినిమాకు సంబంధించిన విశేషాల సమాహారం. ఈ సినిమాతో మరోసారి ప్రేక్షకుడిని 'నవ్వు కుందాం రా' అని ఆహ్వానించి మాట నిలుపుకున్నారు జంధ్యాల.

**- పులగం చిన్నారాయణ**

## 'సరిగపదమని-28

**జవాబులు**

అడ్డం: 1.బాలు 2.కీరవాణి 6. వసంత 7.రఘు 8 .రాజా10.మనో 11.రాణి 13.వేణు 14.సత్యం 15.సుశీల

నిలువు:1.బాలమురళీకృష్ణ 3.రవివర్మ 4.చక్రి 5.స్మిత 9.జానకి 10.మహాలక్ష్మి 11.రాధిక 12.లీల

**కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:**

పాణ్యం రుక్మిణీదేవి- కర్నూలు, మేడా మస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, డి.ఎస్.ఎల్.గాయత్రి- హైదరాబాద్, సి.సాయిప్రసాద్- నాయుడుపేట (నెల్లూరు), బంకురు శ్రీను- మల్లంపేట (విజయనగరం), నందూరి రామానుజాచార్యులు- జగ్గయ్యపేట, సామంచి సుధాకర్- విశాఖపట్నం, అమంచి వెంకటలక్ష్మి కామేశ్వరి- రాజోలు (తూ॥గో॥జిల్లా), జి.సాంబశివరావు- నందివెలుగు (గుంటూరు), పద్మావతి శ్రీనివాసరావు సాంసాళె- ఎమ్మిగనూరు (కర్నూలు), సపార ఈరణ్ణ- ఆదోని, పి.విజయలక్ష్మి- కాకినాడ, పి.సత్యనారాయణ- నెల్లూరు, చివుకుల సుబ్రహ్మణ్యశాస్త్రి- అన్నవరప్పాడు (ప్రకాశం), మహమ్మద్ లతీఫ్- నాచారం (రంగారెడ్డి), పి.నాగరాజు- జానకంపేట (నిజామాబాద్), ఉదయభాస్కర్ &విజయ- రాజమండ్రి, వి.లక్ష్మీప్రసన్న- హైదరాబాద్, జె.విజయలక్ష్మి- విశాఖపట్నం, నెల్లూట్ల రమాదేవి- హన్మకొండ (వరంగల్), నేమాన సుభాష్‌చంద్రబోస్- శ్రీకాకుళంటౌన్, పి.వి.శ్రీలక్ష్మి- మదనపల్లి (చిత్తూరు), కె.సీతారామగిరి- కాకినాడ, కె.సోమేశ్వరరావు- విజయవాడ, ఎమ్.ఎన్.వి.శాస్త్రి- కాకినాడ, ఏ.బి.వి.ఎన్.రమేశ్- వెల్లూరు (తమిళనాడు), పి.పద్మ- భీమడోలు, జి.సాయికార్తీక్- వి.యవాడ, పూసరపు రోహిణి- నర్సాపురం, ఎ.టి.శ్రీనివాసన్- అనంతపూర్, ఎన్.లీలాప్రసూనాదేవి- హైదరాబాద్, బిహారా శేషశాయి- సత్తెనపల్లి (గుంటూరు), వి.విజయలక్ష్మి- కాకినాడ, కొండుపర్తి వేంకట జగన్నాథదాసు- సికింద్రాబాద్, కె.సుధాదేవి- చీరాల, మేడా పద్మావతి- విశాఖపట్నం, ఈ.ప్రమిలారాణి- ఘట్‌కేసర్ (రంగారెడ్డి), బి.వి.ఫణికుమార్- గుంటూరు, పేర్రూరి వెంకటసోమశేఖర్- కాకినాడ, కె.వి.రమణ- జయపూర్(ఒరిస్సా), ఈ.రాధిక- హైదరాబాద్, పి.నరేంద్రవర్మ- విశాఖపట్నం, జి.పి.రెడ్డి- హైదరాబాద్, అరవ పద్మావతి- రాజమండ్రి, వి.వి.రమణి- బచేలి (చత్తీస్‌గడ్), ఆర్.ఎస్.సత్యవాణి- సికింద్రాబాద్, ఎస్.శేషకుమారి- దేవాపూర్ (ఆదిలాబాద్), ఆర్.సత్యవాణి- కరీంనగర్, పాండురంగశర్మ- హైదరాబాద్, రాయచోటి కృష్ణమూర్తి- డోంబివిలి (మహారాష్ట్ర), మురళీధర్.కె- పకాల (చిత్తూరు), కె.వి.సరస్వతి- హైదరాబాద్, ఎన్.కవిత- విజయవాడ, ఆత్కూరి అన్నపూర్ణ- మువ్వలవానిపాలెం, కె.వి.యల్.నరసింహశాస్త్రి- హైదరాబాద్, మయూరి రఘు- హైదరాబాద్, జోశ్యుల భానుమూర్తి- భీమవరం (ప॥గో॥జిల్లా), పి.మధు- విజయనగరం, పింగళి అశ్వత్థనారాయణ- ఒంగోలు, యు.గున్నేశ్వరరావు- పాగిరి (శ్రీకాకుళం), సి.హెచ్.రవళి- హైదరాబాద్, యం.రమణమ్మ- విజయనగరం, ఎమ్.అంజిరెడ్డి- ఒంగోలు, డా॥ వి.రాధిక- అమలాపురం (తూ॥గో॥జిల్లా), ఎన్.జగన్మోహనరావు- కరీంనగర్, ఆరిగ నరశింహారావు- మార్కాపురం (ప్రకాశం), టి.మస్తాన్‌రెడ్డి- నెల్లూరు, పి.పాపారావు- విశాఖపట్నం, అవసరాల మహతి- విశాఖపట్నం, పుణ్యాల శ్రీలక్ష్మి- సత్తెనపల్లి, పుణ్యాల రాజ్యాలక్ష్మి- సత్తెనపల్లి, అడపా విఘ్నేశ్వరరావు- పర్లాకిమిడి (ఒరిస్సా), వి.అపర్ణ- ఒంగోలు, టి.కె.అన్నపూర్ణ- అత్తిలి (ప॥గో॥జిల్లా), వి.సాహితి- ద్రోణాచలం (కర్నూలు), పి.లక్ష్మీదేవి- దొర్నిపాడు (కర్నూలు), శైలజ నందన్- మహబూబ్‌నగర్, వి.సి.వేణుమాధవ్- భోధన్, మందా సుధాకర్- విశాఖపట్నం, పి.అపర్ణాభారతి- హైదరాబాద్, వెలుటూరి ప్రశాంతి- హైదరాబాద్, ఎమ్.వి.ఎస్.ఎన్.శాస్త్రి- విజయవాడ, అద్దంకి సీతాదేవి- హైదరాబాద్.

**ఒక తప్పుతో వ్రాసిన వారు:**

కేతవరపు అలివేణమ్మ- సికింద్రాబాద్, ఎల్.వి.వి.ఎస్.భగవాన్ శాస్త్రి- గండిపాలెం (నెల్లూరు), జి.శ్రీనివాస్- హైదరాబాద్, యు.దయాశీలి- మచిలీపట్నం, మరవాడ కామేశ్వరరావు- మంచిర్యాల (ఆదిలాబాద్), కె.ఎస్.ప్రభ- హైదరాబాద్, ఆలా క్రిష్ణమూర్తి- వలేటివారి పాలెం (ప్రకాశం), మాధవీ నారాయణన్- విశాఖపట్నం, సి.హెచ్.దేవి- జోగిపేట (మెదక్), నిష్టల వి.సూర్య- హైదరాబాద్, సి.హెచ్.రామ్మోహన్‌రావు- విశాఖపట్నం, ఎన్.భారతిరాజు- వైజాగ్, ఆర్.వి.వి.కృష్ణ- హైదరాబాద్, లుంబూరు లక్ష్మీదేవి- హైదరాబాద్, పేరాల శ్రీవాణి- వైజాగ్, ఎమ్.సత్యవాణి- హైదరాబాద్, కె.వాణి సుజాత- గుంటూరు, వి.శశిశేఖర్- నెల్లూరు.

**రెండు తప్పులతో వ్రాసిన వారు:**

ఎన్.అరవిందవల్లి- గుంటూరు, ఎం.వి.యస్.లక్ష్మి- కాకినాడ, కె.వి.ఎస్.ఎన్. మూర్తి- న్యూఢీల్లి, ఎమ్.జగజ్జననీ- హైదరాబాద్, బాజరాజు ప్రభాకరరావు- హైదరాబాద్, జి.జానకెనడి- హైదరాబాద్, బి.సూర్యనారాయణరాజు- కురపల్లి (విశాఖజిల్లా), ఎస్.సుశీలాదేవి- కాకినాడ, బి.మంజుళ- నెల్లూరు, వి.వి.శ్రీధర్- ఆత్రేయపురం, పార్వంది వెంకట సూర్య సుబ్రహ్మణ్యమూర్తి- విశాఖపట్నం, కొమల్లాజు రామోహనరావు- నల్గొండ, రాజ్‌కుమార్ ముగ్గళ్ళ- హైదరాబాద్, డి.నారాయణ- మహబూబ్‌నగర్, బి.శ్రీనివాస ప్రభాకర్- హైదరాబాద్, బి.కవిత- తిరుపతి, శ్రీనివాస్ పవార్- ఆర్మూర్ (నిజామాబాద్),

**మూడు తప్పులతో వ్రాసిన వారు:**

వై.రాజానాయుడు- పెద్దచెన్నయ్యగారిపల్లె (చిత్తూరు), కె.సుధాకర్ రెడ్డి- కొంకుదుర్, ఎస్.వెంకటేశ్వరరావు- ఒంగోలు, ఆర్.వి.సీతామహాలక్ష్మి- రాజమద్రి, ఉడాలి జ్ఞానప్రసూన- చెన్నై.

## 'సరిగపదమని-29

**జవాబులు**

అడ్డం: 2.సావిరహే 3.జయము 6.మురి 7.జాబిల్లి 9.కోతి10.నల్లని 11.నీవు 13.నాతి 14.పగ 15.నా 16.నిన్న 18.శ్రీ 20.వర 21.పగలే 22.మేలు

నిలువు:1.ఊయల 2.సాలూరి 3.జగమే 4.చెల్లి 7.జాతి 8.చల్లగ 9.కోరితిని 11.నీవు12.నా పడవ 17.ముత్యాలు 19.గంగ

**కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:**

వై.రాజానాయుడు- పెద్దచెన్నయ్యగారి పల్లె (చిత్తూరు), నారోజు శంకరాచార్యులు- చిలుకానగర్, బిహారా శేషశాయి- సత్తెనపల్లి (గుంటూరు), మయూరి రఘు- హైదరాబాద్, టి.చంచలరావు- హైదరాబాద్, డా॥టి.కె.వి.అయ్యంగార్- హన్మకొండ, సి.ఛాయాదేవి- విజయవాడ, జి.బి.వి.వి.ఎస్.వి.ప్రసాద్- కాకినాడ, పి.సాయిరాం- పాలకొల్లు (ప॥గో॥జిల్లా), తనికెళ్ళ రామకృష్ణ- విజయవాడ, రాజ్‌కుమార్ ముగ్గళ్ళ- హైదరాబాద్, నందూరి రామానుజాచార్యులు- జగ్గయ్యపేట, కె.రఘునాథచార్లు- కడప, జి.పి.రెడ్డి- హైదరాబాద్, మహమ్మద్ లతీఫ్- నాచారం, కతేవరపు వీణ- ఏలూరు, మామిళ్లపల్లి విశాలాక్షి- రాయిచూర్ (కర్నాటక), సురభి సూర్యకాంతం- కాకినాడ, జి.పాండురంగశర్మ- హైద్రాబాద్, డి.వెంకట్రావ్- పాచిపెంట (విజయనగరం), పి.ఉమాదేవి- విశాఖపట్నం, జి.శ్రీకీర్తన- విశాఖపట్నం, యం.శైలజా- చెన్నై, ఎ.టి.శ్రీనివాసన్- అనంతపురం, కె.నిరిహో- మనుగూరు, కె.వి.యస్.రావు- హైద్రాబాద్, జి.వి.రమణమూర్తి- హైద్రాబాద్, ఉండవల్లి రాజమోహన్- రాజమండ్రి, డా॥ఉప్పల వెంకటరమణయ్య- కడప, నిష్టల,వి.సూర్య- హైద్రాబాద్, ఒ.యల్.కామేశ్వరి- విశాఖపట్నం, టి.ప్రమోద్‌కుమార్- వేములవాడ (కరీంనగర్), ఎస్.శేషకుమారి- ఆదిలాబాద్, పేరూరి భ్రమరాంబ- కాకినాడ, కె. సత్యసాయి కుమారి- హైద్రాబాద్, జి.అమరేశ్వరరావు- తెనాలి, పి.యస్.నాగేంద్రకుమార్- కడప, తెలికిచెర్ల రాజేశ్వరరావు- నరసన్నపేట, సామంచి సుధాకర్- విశాఖపట్నం, కె.యస్.జి.రాజ్‌కుమార్- హైద్రాబాద్, వెమువ్వజగదీశ్వరరావు- విశాఖవట్నం, దిట్టకవి జయప్రసూన- హైద్రాబాద్, యం.మాధూరిరంగారావు- నల్గొండ, ఎ.విక్రమసేనరావు- గోదావరిఖని, యస్.వెంకటేశ్వరరావు- ఓంగోలు, ధవళ దుర్గ- హైద్రాబాద్, ఏలూరు అశోక్‌కుమార్- నల్గొండ, యస్.యస్.నాగేశ్వరరావు- సికింద్రాబాద్, ఎ.చంద్రకుమార్- హైద్రాబాద్, నూకల ఫణీశేకుమార్- తిరుపతి, కె.కె.చారి- నల్గొండ, పార్వంది వెంకటసూర్యసుబ్రహ్మణ్యం- విశాఖపట్నం, కొమల్లాజు దుర్గామోహనరావు- నల్గొండ, కె.వి.సరస్వతి- హిమయత్‌నగర్, కె.కె. విశ్వనాథం- హైద్రాబాద్, మంత్రి ప్రగడం శేషాబాయి- సికింద్రాబాద్, గుండాల బాలక్రిష్ణ- సికింద్రాబాద్, జన్ను బాబురావు- గుడివాడ(కృష్ణా), కేతవరపు చంద్రహర్ష- సత్తెనపల్లి, కె.సోమేశ్వరరావు- విజయవాడ, పి.వి.వి.సత్యనారాయణమూర్తి- ఆలమూరు(ప.గో.జిల్లా), రాచర్ల రోహిణి- హైద్రాబాద్, సీమనాగ్- జంషెడ్‌పూర్, జె.శర్వాణి- తిరుపతి, సి.సాయిప్రసాద్- నాయుడుపేట, జి.బి.ఆర్.లక్ష్మి- రాజమండ్రి, యు.యు.యు.- ఎమ్మిగనూరు, జి.సునీతమంజరీ- పూణే(మహారాష్ట్ర), నాగిశెట్టి ధీరజ- విజయవాడ, పింగళి అశ్వత్థనారాయణ- ఓంగోలు, షేక్.బీబి- గుంటూరు, యం. సంతోష్ కుమార్- అనకాపల్లి, సపార ఈరణ్ణ- ఆదోని, ఆత్కూరి అన్నపూర్ణ- విశాఖపట్నం, యం.కోటేశ్వరరావు- కాశీపూర్ (ఉత్తరాంచల్), అద్దంకి శ్రీరామచంద్రమూర్తి- హైద్రాబాద్, ఎ.సరోజినీదేవి- రాజమండ్రి, పి.వి.యస్.యన్.శర్మ- హైద్రాబాద్, ఎం.రమణమ్మ- విజయనగరం, యస్.సోమశేఖరయ్య- కర్నూలు, ఉపాధ్యాయులశ్రీతేజ- తిరుపతి, ఆర్.తేజస్వి- గణపవరం(గుంటూరు), యం.రామమోహనాచార్యులు- చాట్రయి (కృష్ణా), వెల్లంకి అపర్ణ- ఓంగోలు, యడ్లపల్లి చంద్రశేఖర్ - తెనాలి, పక్కి చక్రవర్తి- గరివిడి(విజయనగరం), పి.వి.శివప్రసాద్- నెల్లూరు, పుణ్యాల శాంతి-సత్తెనపల్లి, కె.పద్మిని- తిరుపతి, మన్నవ మాధవి- సత్తెనపల్లి, సిహెచ్. చిరంజీవి- ఓంగోలు, యజ్జల జగన్నాధం- పాతపట్నం (శ్రీకాకుళం), కె.వి.యన్.యస్.భగవాన్- రాజమండ్రి, సిహెచ్.సూర్యారావు- చీపురుపల్లి, అనంతుల అనురాధా- గుంటూరు, భువనగిరి ప్రభాకర్- హైద్రాబాద్, పి.ఉమారాణి- హైద్రాబాద్, బి.హర్షవర్ధన్- కర్నూలు, గుదిమెళ్ళ ఆలివేలుమంగ- హైద్రాబాద్, బి.కవిత- తిరుపతి, సి.రంగనాయకులు- మార్కాపురం (ప్రకాశం జిల్లా), అడపా విఘ్నేశ్వరరావు- పర్లాకిమిడి (ఒరిస్సా), పప్పుఅప్పారావు- విజయనగరం, నంధ్యాల శారదాదేవి- ప్రొద్దుటూరు, యం.అంజిరెడ్డి- ఓంగోలు, ఓలేటి కామేశ్వరప్రసాద్- చింతలూరు (తూ.గో.జిల్లా), శ్రీనివాస్‌పవార్- ఆర్మూర్, జె.భాగ్యలక్ష్మి- కర్నూలు, వెలుటూరి భాస్కర్- హైద్రాబాద్, ఉప్పాల మోహనబాబు- అవనిగడ్డ, రాయచోటి కృష్ణమూర్తి- డోంబివిలి, కె.రామారావు- హైద్రాబాద్.

**ఒక తప్పుతో వ్రాసిన వారు:**

కొండుపర్తి వేంకట జగన్నాథదాసు- సికింద్రాబాద్, సి.వి.శ్రీలక్ష్మి- మదనపల్లి, బి.సూర్యనారాయణ- విశాఖపట్నం, కె.బాలసుబ్రహ్మణ్యం- కడప, కె.సీతారామగిరి- కాకినాడ, ఎ.మహాలక్ష్మి- శ్రీకాకుళం, పసుపులేటి సాయిలక్ష్మి- నెల్లూరు, ఎం.వి.యస్.లక్ష్మి- కాకినాడ, కె.కమల- హైద్రాబాద్, రమేష్ సాంసాళె- ఎమ్మిగనూరు, ఆదిత్యనారాయణన్- విశాఖపట్నం, వి.పద్మాకర్-గూటి , కె.కె.ఆచార్యులు- ఏలేశ్వరం (తూ.గో.జిల్లా), ఏ.బి.వి.ఎన్. రమేశ్- వెల్లూరు (తమిళనాడు), ఆర్.జయలక్ష్మి- తిరుపతి, యం.మాధవరావు- బెంగుళూరు, సిహెచ్.గౌరీపతిరావు- జోగిపేట (మెదక్), జి.వి.రఘుశేషు- అరసికెర (కర్నాటక), ఎ.యస్.యన్. మురళీ- హైద్రాబాద్, ఉదయభాస్కర్ & విజయ- రాజమండ్రి, ఆలా కృష్ణమూర్తి- ఓంగోలు, నుదురుపాటి ఉష- మల్యాల (కరీంనగర్), టి.కె.లక్ష్మి- అనంతపూర్, చండూరు రమ- హైద్రాబాద్, బద్దిపూడి శ్రీనివాసులు- చెన్నై (తమిళనాడు), స్వర్ణ భవాని- గోపాళంవారిపాలెం (గుంటూరు), పి.వాణిప్రభు- వైజాగ్, ఆర్.వి.వి. క్రిష్ణా- హైద్రాబాద్, అవసరాలమణి- విశాఖపట్నం, మరువాడ కామేశ్వరావు- మంచిర్యాల, పి.పాపారావు- విశాఖపట్నం, జి.సాయికుమార్- కోమటిగుంట(మహబూబ్‌నగర్), ఎ. మంగప్రణవి- హైద్రాబాద్, వి.వాణిశ్రీ- గుంటూరు, వి.శాంత- విశాఖపట్నం, జవంగుల శ్రీనివాస్- సత్తెనపల్లి, యల్లాపంతుల చందు- శ్రీకాకుళం, యం.శ్యామల- విశాఖపట్నం, మేడా పద్మావతి- విశాఖపట్నం, హెచ్.ఎస్.ఎల్.ఎమ్. దీప్తి- హైద్రాబాద్, వేలివెంటి స్వర్ణ- నిడదబోలు, వేలివెంటి కృష్ణవేణి- నిడదబోలు, వుండమాటి ఆదిలక్ష్మి- కాకినాడ(తూ.గో.జిల్లా).

**రెండు తప్పులతో వ్రాసిన వారు:**

వింజామూరి విజయలక్ష్మి- కాకినాడ, కోండా గోపిచంద్- హుజూర్‌నగర్ (నల్గొండ), సి.సూర్యప్రకాష్‌రావ్- విశాఖపట్నం, బి. మురళీధర్‌రావు- రంగారెడ్డి, యస్.నాగరాజు- రామవరప్పాడు (కృష్ణా), జి.జాన్‌కెనడి- హైద్రాబాద్, తాడిరంగారావు- రాజమండ్రి, పాణ్యం ప్రత్యూష- తిరుపతి, బాసరాజు యాదగిరి- రామన్నపేట (నల్గొండ), నందిపాటి వెంకటేశ్వరరావు- లేమల్లెపాడు (గుంటూరు), యం.వి.యస్.యన్. శాస్త్రి- విజయవాడ, యం.ఫణికిరణ్ -నిడదబోలు (తూ.గో.జిల్లా),పి.వి. దుర్గ- రాజమండ్రి, కె. ప్రత్యూష తేజస్వీ- చిత్తూరు, వి.ఝాన్సీ లక్ష్మి- హైద్రాబాద్, తాతారాజు జగం-బెర్హంపూర్ (ఒరిస్సా), రఘునాథరావు- గుంటూరు, ఎన్.జగన్మోహనరావు- కరీంనగర్, యన్. శర్వాణి- పాండురంగాపురం (వైజాగ్).

**మూడు తప్పులతో వ్రాసిన వారు:**

బాచారాజు ప్రభాకరరావు- హైద్రాబాద్, మధుసూధనరావు- హైద్రాబాద్, రాజా వైష్ణవి- నంధ్యాల, జక్కా పవిత్ర- భీమవరం(ప.గో.జిల్లా), సిహెచ్. రామోహ్మనరావు- విశాఖపట్నం, కంచి కృష్ణకుమారి- హైద్రాబాద్, లుంబూరు లక్ష్మీదేవి- హైద్రాబాద్, వరయోగి రామ్‌మోహన్‌రావు- సికింద్రాబాద్, మంధా సుధాకర్- విశాఖపట్నం, పర్చా వాసుదేవరావు- దేవరకొండ.

# యుగళ గీతాలలో రఫీ...



ప్యార్ కా మౌసమ్ సినిమాలో ఒక దృశ్యం ఉంది. అన్ని నాజిర్ హుస్సేన్ సినిమాల్లోలానే ఇందులో కూడా నాయికా నాయకులు చిలిపి తగాదాలతో పరిచయాన్ని ప్రారంభిస్తారు. ఈ అల్లరిలో భాగంగా, ఇద్దరూ తాము పాడగలమని చెప్పుకుంటారు. వెంటనే ఆశా పరేఖ్, శశికపూర్‌ను కవ్విస్తూ 'నువ్వు మహమ్మద్ రఫీ లా పాడగలవా' అంటుంది. శశికపూర్ నవ్వి 'నువ్వు మాత్రం లతా మంగేష్కర్ లా పాడగలవా'అంటాడు.

గానం అన్నదానికి ఆ ఇద్దరూ ప్రమాణమని ఈదృశ్యంలో చెప్పకనే చెప్పారు. (ఆ తర్వాతి అతి సుందరమైన పాట ' ఓ.ని సుల్తానారే...ప్యార్ కా మౌసమ్ ఆయా' ప్రారంభమవుతుంది). ఈ దృశ్యంలోనే కాదు. హిందీ సినిమా పాటల అభిమానులు, ముఖ్యంగా 1940 దశకాల నుంచి వచ్చిన హిందీ పాటల పరిజ్ఞానం ఉన్నవారు చాలా మంది అభిప్రాయం అదే. గాయకుల్లో రఫీ, గాయనుల్లో లతా ఒక ప్రమాణాన్ని సృష్టించారనీ, వారి స్థాయిని ఇతరులు అందుకోవడం కష్టమనీ! వేర్వేరుగానే సంచలనం రేకెత్తించే అలాంటి రెండు కంఠస్వరాలు కలిస్తే, ఆ యుగళం ఎంత గొప్పగా ఉంటుందో విన్నవారందరికీ అనుభవమే.

రఫీ,లతా యుగళ గీతాలు అసాధారణ సంఖ్యలో ఏమి లేవు. కేవలం 400పై చిలుకు. కానీ అవి అందించిన నున్వర సామ్రాజ్యానికి ఎల్లలు లేవు. 1947లో షాదీ సే పెహలే చిత్రం నుంచి, 1980లో రఫీ తన ఆఖరి పాట పాడిన 'ఆస్ పాస్' చిత్రం వరకు, వీరిద్దరి గళం నుంచి వెలువడిన పాటల్లో చాలా వరకు ఆణిముత్యాలే. 1949లో బాజార్ చిత్రం కోసం పాడిన 'ఐ మొహబ్బత్ ఉన్ సే మిల్ నే సౌ బహానా బన్ గయా', దులారీ చిత్రంలో పాడిన 'రాత్ రంగీలీ మస్త్ నజారే', 'మిల్ మిల్ కే గాయేంగే హా దో దిల్ యహా- ఎక్ తేరా ఎక్ మేరా ఊహు..ఆహా' వీళ్ళిద్దరి తొలి సూపర్ హిట్ పాటలు. ఆ తర్వాత వీళ్ళు 'మిల్,మిల్ కే' పాడితే చాలు. మాధుర్యానికి వేరే కొలమానాలు లేవన్న రీతిలో వీరిని అటు సంగీత దర్శకులు, ఇటు శ్రోతలు స్వాగతించారు. తొలి రోజుల్లో నౌషాద్,శ్యామ్ సుందర్, హుస్నలాల్ భగత్‌రామ్, గులాం మొహమ్మద్, హన్స్ రాజ్ బెహల్ వీరి చేత అద్భుతంగా పాడించారు. 1950 దశకం నుంచి మరో ముగ్గురు సంగీత దర్శకులు, సి.రామచంద్ర, ఎస్.డి.బర్మన్, శంకర్ జైకిషన్ తోడయ్యారు. వీరిద్దరి యుగళగాన ప్రస్థానాన్ని చెప్పుకుంటూ పోతే, స్థలమూ చాలదు. సమయమూ చాలదు. ఉన్నంతలో ఒక్కసారి

చిత్రం : తాజ్‌మహల్
రచన : సాహిర్ లుధియాన్వి
సంగీతం : రోషన్
గానం : మహమ్మద్ రఫీ, లతా
అభినయం :ప్రదీప్‌కుమార్, బీనారాయ్

అ: జో వాదా కియా వో నిభానా పడేగా
రోకే జమానా చాహే రోకే ఖుదాయా తుమ్‌కో ఆనా పడేగా
॥జో వాదా॥

తరస్‌తీ నిగాహోఁ నే ఆవాజ్ దీ హై
ముహబ్బత్ కీ రాహోఁనే ఆవాజ్ దీ హై
జాన్-ఎ-హయా, జాన్-ఎ-అదా ఛోడో తర్‌సానా, తుమ్‌కో ఆనా పడేగా
॥జో వాదా॥

ఆ: యే మానా హమే జాఁసే జానా పడేగా
పర్ యే సమఝ్‌లో తుమ్‌నే జబ్ భీ పుకారా హమ్‌కో ఆనా పడేగా
॥జో వాదా॥

హమ్ అప్‌నీ వఫా పే నా ఇల్‌జామ్ లేంగే
తుమ్హే దిల్ దియా హై తుమ్హే జాఁ భీ దేంగే
జబ్ ఇష్క్ కా సౌదా కియా ఫిర్ క్యా ఘబ్‌రానా, తుమ్‌కో ఆనా పడేగా
॥జో వాదా॥

ఇ: చమక్‌తే హైఁ జబ్ తక్ యే చాంద్ ఔర్ తారే
న టూటేంగే అబ్ ఎహదో పైమాఁ హమారే
ఇక్ దూస్‌రా జబ్ దే సదా హోకే దీవానా హమ్‌కో ఆనా పడేగా
॥జో వాదా॥






గొప్ప పాటల్ని స్మరించుకుంటే. ...

బహుశా రఫీ, లతా స్వరాల మేళవింపులోని సొగసుల్ని అందరికంటే ముందు గుర్తించిన సంగీత దర్శకులు, (నౌషాద్ కాక), వారి సామర్థ్యాన్ని పూర్తిగా వినియోగించుకున్న వారు, హుస్నలాల్ భగత్‌రామ్. వీరి సంగీత నిర్వహణలో రఫీ, లతా అమాయక ప్రేమికులుగా చాలా సార్లు కనిపిస్తారు.

**'జరా తుమ్నే దేఖా -జరా తుమ్నే దేఖాతో ప్యార్ ఆగయా**
**నిగాహే మిలీ ఔర్ కరార్ ఆగయా' (జల్ తరంగ్)**
(నువ్వు ఒక్కసారి చూస్తే -నీ పై ప్రేమ పుట్టింది
మన చూపులు కలిస్తే -మనసు శాంతితో నిండింది)
మరోసారి విషాద నాయకులుగా...
**హమే దునియా కో దిల్ కే జఖ్మ్ దిఖలానా నహీ ఆతా**
**తడప్ లేతీ హై లేకిన్ ఉన్‌కో తడపానా నహీ ఆతా (ఆధీరాత్)**
(నాకు నా మనసు గాయాన్ని లోకానికి చూపడం రాదు
నేను వ్యధ చెందుతాను గానీ, తనను నొప్పించడం రాదు)
ఇంకోసారి అమాయకత్వం, విషాదం కలగలసిన మధుర మూర్తులుగా..

చిత్రం : కోహినూర్ — రచన : షకీల్ బదయూనీ
సంగీతం : నౌషాద్ — గానం : మహమ్మద్ రఫీ, లతా
అభినయం : దిలీప్‌కుమార్, మీనాకుమారి

అ: ఆ...ఆ...ఆ...దో సితారోం కా జమీఁ పర్ హై మిలన్ ఆజ్ కీ రాత్...
దో సితారోం కా జమీఁ పర్ హై మిలన్ ఆజ్ కీ రాత్
ముస్కరాతా హై ఉమ్మీదోం కా చమన్ ఆజ్ కీ రాత్
ఆ: ఆ... రంగ్ లాయీ హై మేరే దిల్ కీ లగన్ ఆజ్ కీ రాత్
సారీ దునియా నజర్ ఆతీ హై దుల్హన్ ఆజ్ కీ రాత్
ఇ: ఆ...ఆ...దో సితారోం కా జమీఁ పర్ హై మిలన్ ఆజ్ కీ రాత్..
ఆజ్ కీ రాత్
అ: హుస్న్ వాలే తేరి దునియా మేఁ కోయీ ఆయా హై
తేరే దీదార్ కి హస్రత్ భీ కోయీ లాయా హై
తోడ్ దే తోడ్ దే పరదే కా చలన్ ఆజ్ కీ రాత్
ముస్కరాతా హై ఉమ్మీదోం కా చమన్ ఆజ్ కీ రాత్
ఇ: ఆ...ఆ...దో సితారోం కా జమీఁ పర్ హై మిలన్
ఆజ్ కీ రాత్.. ఆజ్ కీ రాత్
ఆ: జిన్‌సే మిలనే కీ తమన్నా థీ వహి ఆతే హై
చాంద్ తారే మేరే రాహోం మేఁ బిఛే జాతే హై
చూమ్‌తా హై మేరే కదమోఁ కో గగన్ ఆజ్ కీ రాత్
సారీ దునియా నజర్ ఆతీ హై దుల్హన్ ఆజ్ కీ రాత్
ఇ: ఆ...దో సితారోం కా జమీఁ పర్ హై మిలన్
ఆజ్ కీ రాత్.... ఆజ్ కీ రాత్
అ: ఆ...ఆ....ఆ... ఆ...ఆ.....ఆ...



**సున్ మేరీ సాజనా రే- సున్ మేరీ సాజ్ నా**
**దేఖోజీ ముఝ్ కో భూల్ నాజానా**
(ప్రియా నా విన్నపం విను. నన్ను మరిచిపోకు సుమా) అని ఆమె అంటే
**సున్ మేరే సావరే - సున్ మేరే సావరే**
**అప్ నా బనాకే ఛోడ్ నా జానా**
(ప్రేయసీ. నువ్వూ విను. నీ వాణ్ణిగా చేసుకుని నన్ను వదలివెళ్ళకు)అని అతనంటాడు.

రఫీ,లతా కాంబినేషన్‌లో చిరకాలంగా అన్ని తరాల వారికీ గుర్తుండిపోయిన పాట ఏదైనా ఉంటే బహుశా అది హుస్నలాల్ భగత్‌రామ్, కమర్ జలాలాబాదీ ల స్వర, గీత రచనల్లో **'ఆంసూ'** సినిమాలో వినిపించిన ఈ పాటే అని చెప్పవచ్చు. అంటే ఇది ఆల్ టైమ్ హిట్ పాట.

సి.రామచంద్ర సంగీత దర్శకత్వంలో అల్‌బేలా, ఖజానా, సగాయి చిత్రాల్లో పాటలు ప్రసిద్ధి చెందాయి. ఇప్పటికీ రేడియో సిలోన్‌లో వినిపిస్తూ అలరించే పాట సగాయి చిత్రంలోని **'ఉదర్ సే తుమ్, చలే ఔర్ హమ్- ఇధర్ సే- మొహబ్బత్ హోగయి-2 బస్ ఎక్ నజర్ సే -బస్-ఏక్ నజర్‌సే'** అంటు తొలి చూపు ప్రేమను ముగ్ధంగా చెప్పిన వైనం మనకు తెలుసు. ఇతని సంగీత దర్శకత్వంలోని వీరిద్దరి సూపర్ హిట్లు మాత్రం **'నౌషేర్వానీ ఆ దిల్'** లోని **'భూల్ జాయే సారే గమ్ - డూబ్ జాయే ప్యార్ మే'** (అన్ని బాధలూ మరచి ప్రేమలో మునిగిపోదాం), **తారోంకి జుబాన్ పర్ హై మొహబ్బత్ కీ కహానీ** (తారల పెదవులపై కూడా మా ప్రేమ కథే) అన్న రెండూ. తర్వాత్తర్వాత రామచంద్ర, ఆశా, మన్నాడే, మహేంద్ర కపూర్ లకు ఆశ్రయం ఇవ్వడంలో రఫీ,లతా యుగళాలు తగ్గాయి.

రఫీకి, లతాకు విడివిడిగానూ, కలిసీ సినీ జీవితాన్ని సంపన్నం చేసిన సంగీత దర్శకుడు నౌషాద్. నౌషాద్ లా వీరిద్దరి పైనే ఆధారపడకపోయినా, వారి సామర్థ్యాన్ని ఆద్యంతం వినియోగించుకున్న సంగీత స్వరకర్త ఎస్.డి.బర్మన్, అందాజ్, దులారీ, ఆన్,దీదార్‌లలో వీరితో ప్రారంభమైన నౌషాద్ అనుబంధం, 'బైజూ బావ్‌రా' తో తారాస్థాయి చేరుకుంది. దీదార్ లో **'దేఖ్ లియా మైనే - కిస్మత్ కా తమాషా దేఖ్ లియా'** (చూస్తూనే ఉన్నాను; విధి మనతో ఎలా ఆడకుంటోందో)హిట్ పాటే అయినా, 'బైజూ బావ్‌రా' సినిమా అన్ని రకాలుగానూ అత్యధిక ప్రజాదరణ పొందడంతో, అందులోని **'ఝూలేమే పవన్ కీ ఆయి బహార్ '**, **'తూ గంగా కి మౌజ్ మై జమునా కా ధారా'** ఈ యుగళ స్వరాన్ని తిరుగులేని ఎత్తులపై నిలబెట్టాయి. శబాబ్ లోని **'మన్ కీ బీన్ మత్ వాలీ బాజే'** ప్రౌఢమైన బాణీని వీరిద్దరు ఎంత సమర్థంగా పాడగలరో చూపితే, బారాదరీ లోని **'భులా నహి దేనా జీ భులా నహీ దేనా- జమానా ఖరాబ్ హై దగా నహి దేనా జీ-దగా నహీ దేనా'** సరళమైన బాణీని, అమాయకమైన అభివ్యక్తి తో అంత అందంగానూ పాడగలరని నిరూపించింది. యుగళ గీతాల్లో ఎంత వైవిధ్యం ఉండడానికి అవకాశం ఉందో, అంతా చూపించిన సినిమా (అది కూడా ఒక్క విషాద గీతం లేకుండా) కోహినూర్.

ఇందులోని రఫీ, లతా యుగళాలు నాలుగూ ఆణిముత్యాలే.
బృందగానం **'తన్ రంగ్ లోజీ ఆజ్ మన్ రంగ్ లో'**
ఖవాలీ బాణీలో సాగే **'చలేంగే తీర్ జబ్ దిల్ పర్'**
ఆర్ద్రమైన రొమాంటిక్ గీతం -
**'దో సితారోం కా జమీ పర్ హై మిలన్'**
పాటంతా కలిసే పాడినా ప్రయోగం **'కోయి ప్యార్ కి దేఖే జాదుగరీ'**
సన్ ఆఫ్ ఇండియా లోని
**'దిల్ తోడ్‌నే వాలే - తుఝే దిల్ ఢూండ్ రహా హై'**

మేరే మెహబూబ్‌లోని **'యాద్ మే తేరీ జాగ్ కే హమ్'** విషాద గీతాల్లోనూ ఈ సంగీతత్రయం ( నౌషాద్, లత, రఫీ )చూపిన నవ్యతకు, వైవిధ్యానికి తార్కాణాలు. 'దులారీ' నుంచి 'లవ్ అండ్ గాడ్' వరకు నౌషాద్ అందించిన

చిత్రం : సన్ ఆఫ్ ఇండియా — రచన : షకీల్ బదయూనీ
సంగీతం : నౌషాద్ — గానం : మహమ్మద్ రఫీ, లతా
అభినయం : కమల్‌జిత్, కుమ్‌కుమ్

ఆ: దిల్ తోడ్‌నే వాలే, తుఝే దిల్ ఢూంఢ్ రహా హై
తుఝే దిల్ ఢూంఢ్ రహా హై
ఆవాజ్ దే తూ కౌన్ సీ నగరి మేఁ ఛుపా హై
దిల్ తోడ్‌నే వాలే.....
తూ హమ్ కో జో మిల్ జాయే తో హాల్ అపనా సునాయేఁ
ఖుద్ రోయే కభీ ఔర్ కభీ తుఝ్‌కో రులాయే కభీ తుఝ్‌కో రులాయే
వో దాగ్ దిఖాయే జో హమేఁ తూనే దియా హై
అ: యే దిల్ కే సహారే తుఝే దిల్ ఢూంఢ్ రహా హై
తుఝే దిల్ ఢూంఢ్ రహా హై
సీనే మేఁ తేరి యాద్ కా తుఫాన్ ఉఠా హై
యే దిల్ కే సహారే
దిల్ మేఁ తో యే హస్‌రత్ హై తేరే పాస్ మై ఆవూఁ
నజరోం సే గిరా హూఁ తో నజర్ కైసే మిలావూఁ
నజర్ కైసే మిలావూఁ
బదనామ్ హూఁ, నా కామ్ హూఁ, క్యా ముఝే మేఁ రహా హై
యే దిల్ కే సహారే, తుఝే దిల్ ఢూంఢ్ రహా హై
తుఝే దిల్ ఢూంఢ్ రహా హై
ఆ: దిఖ్‌లా కే కనారా ముఝే మల్లాహ్ నే లూటా
కశ్తీ భీ గయా, హాథ్ సే, పత్‌వార్ భీ ఛూటా
పత్‌వార్ భీ ఛూటా
అబ్ ఔర్ న జానే మేరీ తక్‌దీర్ మే క్యా హై
దిల్ తోడ్‌నే వాలే, తుఝే దిల్ ఢూంఢ్ రహా హై
తుఝే దిల్ ఢూంఢ్ రహా హై
అ: బేచైన్ ఉధర్ తూ హై, తో మజ్‌బూర్ ఇధర్ హమ్
బైఠే హై ఛుపాయే హుయే, అష్కోం మే తేరా గమ్
అష్కోం మే తేరా గమ్
హర్ చోట్ ఉభర్ ఆయీ హై, హర్ జఖ్మ్ హరా హై
ఆ: దిల్ తోడ్‌నే వాలే, తుఝే ఢూంఢ్ రహా హై
తుఝే దిల్ ఢూంఢ్ రహా హై



మధురమైన బాణీలను అలవోకగా పాడారు వీళ్ళిద్దరు. శాస్త్రీయ సంగీత బాణీలో పాడిన లీడర్ లోని 'ఏక్ షహన్‌షాహనే బనవాకే హసీ తాజ్‌మహల్ - సారీ దునియాకో మొహబ్బత్ కి నిషానీ దీ హై' పక్వం చెందిన లతా, రఫీ యుగళానికి గొప్ప గురుతు. సినీ సంగీత ప్రపంచంలో రఫీ,లతా వంటి గాయకులు మళ్ళీ పుట్టరని త్రికరణ శుద్ధిగా నమ్మి ప్రకటించిన నౌషాద్ స్వరరచనలో అన్నీ మంచి పాటలు, చాలా వరకు గొప్ప పాటలు ఉండడంలో ఆశ్చర్యం లేదు.

వీరిద్దరి స్వరాల్లోని మాధుర్య పారమ్యాన్ని మనకు అందించిన మరో సంగీత దర్శకుడు ఎస్.డి.బర్మన్. వీరి కాంబినేషన్ వినగానే గుర్తొచ్చే పాట **తేరే బిన్ సూనీ- నైన్ హమారీ తేరే బిన్ సూనీ (మేరీ సూరత్ తేరి ఆంఖే)**.అతి తక్కువ వాయిద్యాలతో, గాయకుల స్వరవిన్యాసానికి, గాన సామర్థ్యానికి అత్యధికంగా అవకాశం ఇచ్చే సంగీత దర్శకుల్లో అగ్రతాంబూలం దక్కేది బర్మన్ కే. ఈ పాటలో 'నిందియా న ఆయే' అని ఆలపిస్తున్న రఫీ స్వరం, 'ఓ- 'అని రంగప్రవేశం చేస్తూ లతా చేసే ఆలాపన విన్న శ్రోతల శరీరాలు పులకలతో పునీతం అవుతాయంటే ఆశ్చర్యంలేదు.

1951లో ఏక్ నజర్ నుంచి( **ముఝే ప్యార్ కీ నగ్‌రి జానా హై- కోయి హైజో రస్తా బతలాదే**) 1973లో '**అభిమాన్**' (**తేరీ బిందియారే**) వరకు, బర్మన్ సంగీత దర్శకత్వంలో వీరు పాడిన యుగళాల సంఖ్య తక్కువే అయినా, వాటిప్రభావం మాత్రం గొప్పది. **తేరే ఘర్ కే సామ్ నే** లో టైటిల్ సాంగ్‌తో పాటు **దేఖో రూఠానా కరో**, **జువెల్ థీఫ్** లో **దిల్ పుకారే**, **అనురాగ్** లో **తేరే నైనోంకీ మై దీప్ జలావుంగా** వంటివన్నీ సుప్రసిద్ధమైనవే.

ఆ తరం వారిలో రఫీ, లతా కాంబినేషన్‌లో సుమధుర గీతాలందించిన ఇతరులు వసంత్ దేశాయ్, రోషన్, చిత్రగుప్త. తక్కువ పాటలే మనకిచ్చినా, అరుదైన అద్భుతగీతాలు అందించిన సంగీత దర్శకుడు వసంత్ దేశాయ్. అతని సంగీతంలో రఫీ, లతా పాడిన '**గూంజ్ ఉఠీ షహనాయ్**' లోని ఒక్కొక్క పాట దేనికదే ఓ కళాఖండం. '**హోలే హోలే ఘూంఘట్ జరా ఖోలే, బలమ్ వా బేదర్దీ**' ఒక జలపాతంలా మనల్ని ముంచెత్తితే, '**జీవన్ మే పియా తేరా సాథ్ రహే**', ఒక వాగులా మనల్ని అలరిస్తే, '**తేరీ షనాయి బోలే సున్ కే దిల్ మేరా డోలే - జుల్మీ కాహే కో సునాయి ఐసీ తాన్ రే**' గంభీరమైన నదీ ప్రవాహంలా మనల్ని విషాదమాధుర్యంతో నింపేస్తుంది.

యస్.ఎన్. త్రిపాఠి, ఎన్.దత్తా, రామ్‌లాల్ వంటి అనేక మంది బాణీల్లో, రఫీ, లతా పాడిన యుగళగీతాలు సూపర్ హిట్లయి, వాళ్ళ కీర్తి చిరస్థాయిగా నిలిచేలా చేశాయి.

ఒక దశలో హిందీ సంగీత దర్శకులకూ, నిర్మాతలకు, శ్రోతలకూ కూడా అన్ని పాటల్లోనూ రఫీ, లతాలే కావాలనిపించేది. దానికి తగ్గట్టుగానే ఆ సంగీత దర్శకుల పేరు ప్రతిష్టల్తో నిమిత్తం లేకుండ, అందరికీ పాడి, అందరికీ సూపర్ హిట్టులను అందించిన సౌజన్యం రఫీ, లతాలది.

ఆ తరం వారిలో బహుశా అన్ని తరాల వారికీ, అన్ని రకాల అభిరుచులవారికీ నచ్చే అపురూపమైన యుగళగీతాలను వీరిద్దరి చేతా పాడించి, మనకొక నిధిని వదిలి వెళ్ళిన సంగీత దర్శకుడు రోషన్.

హిందీ సినిమాల నుంచి మరేపాటా తెలీక పోయినా, తెలుగు వారందరికీ తెలిసిన ఏకైక యుగళగీతం '**జో వాదా కియా వో నిభానా పడేగా**' (తాజ్‌మహల్). రఫీ, లతా యుగళ గీతాల్లో మీ అభిమాన గీతం ఏదని ఓ వంద మందిని అడిగితే , 75 మంది ఈ పాటనే చెప్తారు. నిజానికి రఫీ, లతాలకు కూడ ఇదిఫేవరెట్ పాటే. ఇంకా రోశన్ సంగీతంలో '**జిందగీ భర్ నహీ భూలేగే వో బర్సాత్ కీ రాత్**' (బర్‌సాత్ కీ రాత్), '**ఆప్ నే యాద్ దిలాయా తో ముఝే యాద్ ఆయా**', **బార్ బార్ తోహే క్యా సమ్‌ఝావూ పాయల్ కీ ఝున్‌కార్** (రెండూ '**ఆర్ తీ**'లోనివే!) ఇలాంటి అజరామర గీతాలే.

లక్ష్మీకాంత్ ఒక రేడియో ఇంటర్వ్యూలో అన్నట్టు రఫీ, లతా తమ పాట పాడ్డానికి ఒప్పుకుంటే చాలు, తన బాధ్యత 50 శాతం అయిపోయినట్లే అనుకునేవారట సంగీత దర్శకులు. తాము ఎంత సామాన్యమైన బాణీని వేసినా, దాని స్థాయిని పెంచి, శ్రోతలను మంత్రముగ్ధులను చేసే శక్తి వీరిద్దరికీ ఉంది. వీరి కంఠస్వరం నుంచి ఆ బాణీ వెలువడితే చాలు; దానికి లేని అందం వస్తుంది; ఉన్నది రెట్టింపవుతుంది.

రఫీ,లతా ల యుగళాలలో తమ స్వర రచనకు పరిపుష్టిని సమకూర్చుకున్న ముఖ్యులైన సంగీత దర్శకులు మరెందరో ఉన్నారు. శంకర్ జైకిషన్, చిత్రగుప్త్, లక్ష్మీకాంత్ ప్యారేలాల్ ...వారి గురించి వచ్చే సంచికలో...

**- మృణాళిని**



# అత్తగారి పేరు చెడగొట్టకుండా ఉంటే చాలు...

**- గాయని సంధ్య**

**చ**రిత్ర సృష్టించిన పాటలు కొన్ని ఉంటాయి. అటువంటి పాటలను రాసినవారు, స్వరపరిచిన వారితో పాటు పాడినవారు కూడా శ్రోతలకు గుర్తుండిపోతారు. ఆ పాటను తిరిగి ఎవరు పాడినా - మొట్టమొదట పాడిన గాయనీ గాయకులతోనే పోల్చుకుని ఒక్కోసారి సరిగ్గా పాడలేదని మనవాళ్లు ముద్ర వేసేస్తారు కూడా. కనుక ఆల్రెడీ హిట్ అయిన సినిమా పాటను మరో సినిమా కోసం మళ్లీ పాడి మెప్పించటం అంటే కత్తిమీద సామే! మరి ఆ సామును విజయవంతంగా పూర్తి చేస్తే నిజంగా అదో అద్భుతమే!! ఈ అద్భుతాన్ని అందంగా మనముందు ఆవిష్కరించిన గాయని సంధ్య.

ఎన్టీఆర్ నటించిన 'అడవిరాముడు' చిత్రం కోసం కె.వి.మహదేవన్ స్వరకల్పనలో సుశీల, బాలుతో పాడిన 'ఆరేసుకోబోయి పారేసుకున్నాను...' పాటను ఇటీవల ప్రభాస్ నటించిన 'అడవిరాముడు' చిత్రం కోసం పాడి అందర్నీ మెప్పించిన గాయని సంధ్య. ఈ సంధ్య ఎవరో కాదు..! ప్రముఖ గాయని పి.సుశీలకు స్వయాన మేనకోడలు... కోడలు కూడా!

మేనకోడలికి మేనత్త పోలిక రావడమన్నది సహజమే కదా! అలా మేనత్తలోని గాన లక్షణాలను పుణికి పుచ్చుకుంది సంధ్య. 'భైరవద్వీపం' చిత్రంలో 'చందమామ వచ్చినా చల్లగాలి వీచినా' పాట ద్వారా తెలుగు సినీ సంగీత రంగాన గళం మోపింది సంధ్య. భర్త, మేనత్త కమ్ అత్తగారైన పి.సుశీల ప్రోత్సాహంతో గాయనిగా తన కెరీర్‌ని నిర్మించుకోవడానికి సీరియస్‌గా ప్రయత్నాలు చేస్తోంది. ఇళయరాజా, ఏ. ఆర్. రెహమాన్ వంటి ఉద్దండుల వద్ద పాడి తన పాటవాన్ని నిరూపించుకున్న సంధ్య ప్రస్తుతం తెలుగు, తమిళ, కన్నడ మలయాళ భాషలలో ప్రముఖ సంగీత దర్శకుల వద్ద పాడుతూ క్రమక్రమంగా బిజీ అవుతోంది.

అన్నప్రాసన నాడే ఆవకాయ తిన్నట్టు - గాయనిగా కెరియర్ ప్రారంభించిన ఈ తొలి రోజులలోనే ఆమె ద్వారా మరో ప్రయోగం జరిగింది.

అది వర్ధమాన హీరో సాయికిరణ్‌తో పాటు ఓ చిత్రంలో ఆమె పాడటం...!

ఇటీవల సాయికిరణ్ హీరోగా రూపొందుతోన్న 'మానస (డేంజరస్)' చిత్రంకోసం సాయికిరణ్‌తో పాట పాడేందుకు హైదరాబాద్ వచ్చిన సంధ్యతో ముచ్చటించిన 'హాసం'..



✔ **మీ సంగీత నేపథ్యం గురించి చెబుతారా?**

జ మా నాన్నగారు ప్రముఖ గాయని పి.సుశీల గారి తమ్ముడు. ఆయన కూడా బాగా పాడతారు. తెలుగు, తమిళం, కన్నడంలో పాడారు. ఇంట్లో అందరూ పాడతారు. సంగీత కుటుంబం మాది. అలా - పాడటం అలవాటైంది.

✔ **ఎవరి దగ్గరైనా సంగీతం నేర్చుకున్నారా?**

జ. నేను పుట్టింది హైదారాబాద్‌లోనే - అయితే మానాన్నగారికి మా స్వస్థలం విజయనగరం ట్రాన్స్‌ఫర్ ఐనపుడు అక్కడ కొద్ది కాలం తిరుపతి గోపాలకృష్ణమూర్తిగారి వద్ద సంగీతం నేర్చుకున్నాను. ఆ తర్వాత స్టడీస్‌లో బిజీ కావడం - మా ఫామిలీ బెంగుళూరుకి షిఫ్ట్ కావడంతో కంటిన్యూ చేయలేకపోయాను.

✔ **మొదటిపాట ఏ సినిమాకి, ఎవరి సంగీత దర్శకత్వంలో పాడారు?**

జ మాధవపెద్ది సురేష్ గారి సంగీత దర్శకత్వంలో వచ్చిన 'భైరవద్వీపం' చిత్రంలోని 'చందమామా వచ్చినా.... చల్లగాలి వీచినా...' పాటలో నాలుగులైన్లు మొట్టమొదటిసారిగా పాడాను.

✔ **తర్వాత మీ కెరీర్ ఎలా సాగింది?**

జ ఆ తర్వాత తమిళంలో నా మొదటిపాట ఎ.ఆర్.రెహమాన్ గారి మ్యూజిక్‌లో 'ఇరువర్' చిత్రానికి 'పూ నగవే పూలది... లే నగవే వాగుది..' అని తెలుగు డబ్బింగ్ వెర్షన్‌లో వచ్చిన పాట - ఒరిజినల్ వెర్షన్ తమిళంలో నేను పాడాను. ఆ తర్వాత ఇళయరాజా గారి మ్యూజిక్‌లో పదిపాటల వరకు పాడాను. 'దేవదై' అనే తమిళ్ పిక్చర్ కోసం "దీబంగళ్ పేసుం.. ఇదు కార్తీగ మానం..'' అనే పాట పాడాను. అది పెద్దహిట్ అయింది. ఎస్.పి.చరణ్‌గారు కూడా ఫస్ట్ టైమ్ ఇళయరాజా గారి మ్యూజిక్‌లో పాడిన పాట అది - అలాగే సింగర్స్‌గా మా ఫస్ట్ కాంబినేషన్ కూడా ఆ పాటే. ఇళయరాజాగారి మ్యూజిక్‌లో మలయాళంలో కూడా పాడాను. ఆ తర్వాత దేవా, విద్యాసాగర్, హారిస్ జైరాజ్ తదితర మ్యూజిక్ డైరెక్టర్స్ దగ్గర పాడాను.

✔ **తెలుగులో మీ ప్రోగ్రెస్ ఎలా ఉంది?**

జ ఆ మధ్య 'మురారి' చిత్రం కోసం మణిశర్మగారు 'అలనాటి రామచంద్రుని కన్నింట సాటి' అంటూ సాగే పాట పాడించారు. మళ్ళీ ఈ మధ్య పిలిపించి 'అడవిరాముడు' సినిమాలో పాడించారు. ఆ పాట కోసం వచ్చినపుడు 'మీ అత్తగారు పాడిన పాటే ఇప్పుడు మీరు పాడాల'ని అన్నారు. ఏ పాట అన్నది ముందు చెప్పలేదు. స్టూడియోకి వెళ్ళాక అత్తయ్య సుశీలగారు పాడిన ఆనాటి 'అడవిరాముడు'లోని 'ఆరేసుకోబోయి... పారేసుకున్నాను..'' పాట ప్లే చేసి వినిపించారు. వినగానే నాకు కొంచెం భయంవేసింది. అత్తయ్యగారు పాడిన ఆపాట సూపర్ డూపర్ హిట్ అయింది. నేను ఆ రేంజ్‌లో పాడగలనా అనిపించి మణిశర్మ గారితో 'మళ్ళీ అత్తయ్య గారే ఆ పాట పాడితే బెటరేమో..!?' అన్నాను. మణిశర్మగారు -"అప్పుడు అత్తయ్యగారు తన తడాఖా చూపించారు. ఇప్పుడు నీ టర్న్ వచ్చింది...నువ్ పాడగలవ్" అని ధైర్యం చెప్పడంతో కష్టపడి పాడాను. ఆల్రెడీ సూపర్ హిట్ సాంగ్ కావడంతో ఈతరం ఆడియన్స్‌కి కూడా బాగా రీచ్ అయింది. 'అడవి రాముడు' లో ఆ పాట పాడటం నాకొక థ్రిల్లింగ్ ఎక్స్‌పీరియన్స్. అయితే నేను ఆ పాట పాడానని చాలామందికి తెలీదు. సుశీలగారే పాడారనుకుంటున్నారు.

✔ **ప్రస్తుతం ఏయే చిత్రాలకి పాడుతున్నారు?**

జ సాయికిరణ్ హీరోగా విజయానంద్ పిక్చర్స్ వారు తీస్తున్న 'మానస' (డేంజరస్) చిత్రం కోసం శివప్రసాద్ గారి సంగీత దర్శకత్వంలో ఒక డ్యూయెట్ పాడాను. విజయానంద్‌గారు ఈ సినిమాకి దర్శక నిర్మాత. తమిళంలో జయచంద్రన్ గారి మ్యూజిక్‌లో 'గోమది నాయగం' చిత్రానికి పాడాను. మాధవపెద్ది సురేష్‌గారి మ్యూజిక్‌లో 'అంజలి...ఐ లవ్ యూ' చిత్రం కోసం ఒక పాట పాడాను.

✔ **మీరు పర్సనల్‌గా ఎలాంటి పాటలు ఇష్టపడతారు?**

జ నాకు అన్ని రకాల పాటలూ ఇష్టం. ఇంట్లో ఉంటే ఎప్పుడూ ఏదో ఒక పాట హమ్ చేసుకుంటూనే ఉంటాను. తెలుగు, తమిళం, హిందీ, కన్నడం, మలయాళం.. అన్ని భాషల పాటలు పాడుకుంటూనే ఉంటాను.

✔ **తెలుగులో మీరు ఇష్టపడే సంగీత దర్శకులెవరు?**

జ మణిశర్మగారు, కీరవాణిగారు, దేవిశ్రీప్రసాద్ గారు, ఆర్.పి.పట్నాయక్ గారు, చక్రిగారు, వందేమాతరం గారు.. ఇలా అందరూ నాకు ఇష్టమైనవారే. అందరిపాటలూ నేను ఎంతో ఇష్టంగా పాడుకుంటూ ఉంటాను. అలాగే అందరి సంగీత దర్శకుల దగ్గరా పాడాలని ఆశపడుతున్నాను.

✔ **ఎలాంటి పాటలు పాడాలని అనుకుంటున్నారు?**

జ ప్రత్యేకంగా ఈ తరహా పాటలే పాడాలనే నియమం ఏదీలేదు. పాడేప్పుడు మ్యూజిక్ డైరెక్టర్‌తో తిట్లు తినకుండా ఉండాలనీ, పాడడం పూర్తయ్యాక 'బాగా పాడావమ్మా' అనిపించుకోవాలన్నదే నా కోరిక.

✔ **మీ భర్త నుండి మీకు ఎలాంటి ప్రోత్సాహం లభిస్తోంది?**

జ ఆయన ప్రోత్సాహంతోనే కదా హైదరాబాద్‌కి, చెన్నైకి తిరుగుతూ పాటలు పాడగలుగుతున్నాను...! ఇక అత్తయ్య సుశీలగారు ఎంతగానో ప్రోత్సహిస్తారు. టాలెంట్ ఉన్నప్పుడు ఉపయోగించుకోవాలి అంటారామె. ఆమెకు మేనకోడలిగా పుట్టడం ఆమె ఇంటికే కోడలిని కావడం నిజంగా నా అదృష్టంగా భావిస్తున్నాను.

✔ **హైదరాబాద్‌కి షిఫ్ట్ అయ్యే ఆలోచన ఉందా!?**

జ ఇక్కడ మ్యూజిక్ డైరెక్టర్స్‌ని కలుస్తున్నాను. అవకాశాలు ఇస్తామంటున్నారు. తెలుగులో బిజీ అయితే హైదరాబాదుకు షిఫ్ట్ అవడం ఎంత పని..? ప్రస్తుతం తమిళంలో



అవకాశాలు వస్తున్నాయి. తెలుగులో బిజీ అయ్యేవరకూ చెన్నైకి, హైదరాబాద్‌కి తిరుగుతూ ఉంటాను.

✔ **సింగర్‌గా మీ లక్ష్యం ఏమిటి?**

జ పెద్ద లక్ష్యాలేమీ లేవు. నా పాట విని అందరూ ఆనందించాలన్నది నా కోరిక. 'సుశీలగారి కోడలేమిటి.. మరీ ఇలా పాడింది?' అని కాక 'సుశీల గారి కోడలు బాగా పాడింది' అనిపించుకోవాలన్నదే నా లక్ష్యం. మరొకటేమిటంటే అత్తగారికి కొత్తగా నేను పేరు ప్రఖ్యాతులు తీసుకురాలేకపోయినా ఉన్నపేరు చెడగొట్టకుండా ఉంటే చాలనుకుంటున్నాను.

✔ **మీతో పాడించాలనుకునే వారు మిమ్మల్ని కాంటాక్ట్ చేయాలంటే ఎలా?**

జ 044-3266 0600 నెంబర్‌కి డయల్ చేస్తే చాలు.

**- ఆర్.డి.ఎస్.ప్రకాష్**

# సంగీతం సాధించేది కాదు నిరంతరం శోధించేది

- కోటి



**ప్రముఖ సంగీత దర్శకుడు కోటి ఇటీవల విలేకరుల సమావేశాన్ని ఏర్పాటు చేశారు. ఆ ప్రెస్‌మీట్‌లో దొర్లిన కొన్ని ముఖ్యమైన ముచ్చట్లివి...**

'నువ్వేకావాలి' నాకు సెకండ్ ఇన్నింగ్స్ అయితే 'విజయేంద్ర వర్మ' థర్డ్ ఇన్నింగ్స్ క్రింద లెక్క. కమర్షియల్ హీరోలకు తగ్గ సక్సెస్‌ఫుల్ మ్యూజిక్‌ని అందించగల నమ్మకాన్ని ఈచిత్రం నాకు మరోసారి కలిగించింది.

**1975** గిటారిస్ట్‌గా కెరీర్ ప్రారంభించాను. 1983 రాజ్‌తో కలిసి 'ప్రళయగర్జన' సినిమా ద్వారా సంగీత దర్శకుడిగా పరిచయం అయ్యాను. 400లకు పైనే ఉంటాయి నేను మ్యూజిక్ చేసిన సినిమాలు.

బైట ప్రోగామ్స్‌కి వాయించటం వేరు. సినిమాలకు వాయించడం వేరు. సినిమాకు పనికొచ్చే విధంగా సంగీత శిక్షణ నిప్పించే శిక్షణాలయాన్ని నాన్న పేరిట నెలకొల్పాలని ఉంది, దీనికి ప్రభుత్వం నుంచి సహకారం ఎంతగానో కావలసి ఉంటుంది. ఎంత కష్టపడైనాసరే నా కోరికను నెరవేర్చుకుంటానన్న నమ్మకం నాకుంది.

రవికిశోర్ సినిమాలో సంగీతం బావుంటుందని అంటారు. అలాగే మురారి గారి సినిమాలలో సంగీతం గురించి చెప్పుకుంటారు. అందుక్కారణం ఆయా నిర్మాతల అభిరుచే.. అలాగే దర్శకుడి అభిరుచి కూడా... ఏ చిత్రానికైనా అమరే సంగీతపు స్థాయి ఆయా చిత్రాల నిర్మాతలు, దర్శకులు సంగీత దర్శకుడి నుంచి రాబట్టుకునే ట్యూన్స్ బట్టే ఉంటుంది.

రీరికార్డింగ్ కు కూడా ప్రభుత్వం అవార్డు లిచ్చి ప్రోత్సహించాలి. అప్పుడే సంగీత దర్శకుడి నిజమైన సత్తా అందరికీ తెలుస్తుంది.

సంగీతం అనేది సాధించేదికాదు నిరంతరం శోధించేది. అందుకే ఎన్ని జన్మలెత్తినా సంగీత కళాకారుడిగానే పుట్టాలని కోరుకుంటున్నాను.

హీరో అనే లేబుల్‌ని బట్టి ఆడియోసేల్స్ జరుగుతున్నాయి. ఆ లేబుల్ మారిపోతే సేల్ ఫిగర్ లో మార్పులొచ్చేస్తున్నాయి. దురదృష్టవశాత్తు ఆడియో సేల్స్ బట్టి సంగీత దర్శకుడి ప్రతిభను అంచనాకట్టడం జరుగుతోంది.

విజయేంద్ర వర్మ చిత్రనిర్మాత కొండాకృష్ణంరాజు కూడా ఈ ప్రెస్‌మీట్‌లో పాల్గొన్నారు. "కోటిగారు ఈ సినిమాకు పాటలకు అందించిన మ్యూజిక్ పట్ల నేను, హీరోగారు(బాలకృష్ణ) ఆయన అభిమానులు, ఆడియో కంపెనీవాళ్ళు అంతా హ్యాపీగా ఉన్నాం. ఆ విషయంలో ఇక ఏ టెన్షను లేదు మాకు. ఈ సినిమా ఆడియోకి ఎంత పేరొచ్చిందో రిలీజ్ అయ్యాక రీరికార్డింగ్‌కి అంత మంచిపేరొస్తుంది కోటీకి" అని అన్నారు.

హైదరాబాద్‌కు పూర్తిగా షిఫ్ట్ అయిపోయాను. ఇల్లు కొనుక్కున్నాను. ఇటీవల అమెరికా నుంచి తెచ్చుకున్న లేటెస్ట్ ఎక్విప్‌మెంట్‌తో ఓ చిన్న స్టూడియో కూడా ఏర్పాటు చేసుకున్నాను. ఈ స్టూడియోకి శ్రీపాదమ్ ఆడియో ల్యాబ్ అని పేరు పెట్టుకున్నాను. మద్రాసులోని నా స్టుడియోపేరు కూడా శ్రీపాదమ్ ఆడియో ల్యాబే.

ఇపుడొస్తున్న ఈ సౌండింగ్ అంతా ఆరోజుల్లో నేను రాజ్ కలిసి ఎలక్ట్రానిక్ వాద్యాలతో చాలా చేశాం. అవన్నీ ప్రయోగాలు గానే మిగిలిపోయాయి. ఇప్పుడున్న మల్టీట్రాక్ సిస్టమ్ అప్పుడు ఉండి ఉంటే అవన్నీ అందరికీ అర్థం అయి ఉండేది.

రచన: సీతారామశాస్త్రి **1** గానం: జాస్సీగిఫ్ట్

Watch on watch on watch on
Watch this dup dup dup style
I'am gonna dip dip dip it
in to your smile
Hold me baby just hold my hand
forever and ever
Every time I wanna see you my girl

ప: మల్లీశ్వరివే మధురాశల మంజరివే
మంత్రాక్షరివే, మగశ్వాసల అంజలివే
తేనెవి నువ్వో, తేనెటీగవో, తేలేదెలా లలనా
వెన్నెల నువ్వో వెండి మంటవో, తాకే తెలుసుకోనా
చక్కనైన మల్లికవో
చిక్కులు పెట్టే అల్లికవో
పోలికలో పసిబాలికవే
చురకత్తుల చూపులున్నా ॥మల్లీ॥

చ: నీ కళ్ళ నింగిలో పున్నాల పొంగులో
వేవేల తారకలే జలకమాడుతున్నవో
నాలోని కోరికలే, మునిగి తేలకున్నవో
సింగారి చెంపలో, కెంజాయ సొంపులో
వెచ్చనైన వేడుకలే మేలుకొలుపు విన్నవో
నిదరలో ఉదయం, ఎదురయే సమయం
ఎదకు ఇంద్రజాలమేదో, చూపుతోందె సోయగమా!॥మల్లీ॥

Baby don't you ever leave
I'm your don raja
Come on avy time U're my dilruba
I can never stop this feelin' I'm U're don raja
Yeah.. Hey ...Hey... ॥మల్లీ॥

Baby run your body with this
freaky thin and I won't let u go
and I won't let u down
through the fire the limit,
to the wall ? Just to be with U I'm
gladly risk it all,
ha, let me do it one more time,
do it one more time
ha baby, come on and
lets get it into the party

చ: కొల్లేటి సరస్సులో తుళ్ళేటి చేపలై
రంగేళి కులుకులెన్నో తళుకులీనుతున్నవే
నా కొంగ జపము చూసి ఉలికి పడుతు ఉన్నవే
ఎన్నేసి మెలికలో, ఎరవేసి నన్నిలా
ఏ వైపు చూపు తిప్పనీక చంపుతున్నవే
వదలదే హృదయం కదలదే నిమిషం
చిగురు పెదవి చిలిపి స్వరము తెలపవె సౌందర్యమా.. ॥మల్లీ॥



రచన: సీతారామశాస్త్రి **2** గానం: సందీప్

As a token of love here we goes out to all the people
With different colours of truth
Minds of crreeping darkness and heart shattered promises
We are on the look out to find an another race and
Turn out the world from groove danger
Its an open passage - for the people
hey its a message - for the people
Yo, full of passion - for the people
Need for the salvation to come...
Greed for the notion to change
Making the grave for the blind
And bring a newer kingdom
Oh ya...Go...Go...Go..

ప: స్వప్నాలను పిలిచే చేతులివి
సత్యాలుగ మలిచే చేతలివి
నిట్టూరుపు తెలియని ఆశలివి
Oh chaogs every where baby
We wanna getting back ot the
good times ever, lady
కన్నీళ్ళను తుడిచే చెలిమవుతాం
కష్టాలను గెలిచే బలమౌతాం..
కలకాలం నిలిచే కథలవుతాం
మన రేపటి కోసం...... ॥స్వప్నాలను॥

Ohh ...Go...Go...Go..
Yeah we wanna shake
The world witnin the thom of pity baby
cheak out the new light sun, you my baby
Open your eyes and close your dreams
Hold the faith and fight for the land now
Yeah we wanna shake the world
Shake, shake, shake, the world now
shake it now
shake it now......shake it now.....
Leavin the shaken hope behind
Showing the courage to win
One love for each and every one
One need for love and peace and joy
shake it ....shake it ....shake it ...
మా వాదం గీతకి అనువాదం
మాక్రోధం శాంతికి అభివాదం
మా స్వేదం స్వేచ్ఛకి అభిషేకం
Go...Go...Go..
మా నాదం నవతకి చైత్రస్వరం
మా పాదం భవితకి భానురధం
మా పయనం ప్రగతికి ధర్మపథం
తొలి అడుగెయ్ నేస్తం
Its an open passage - for the people
hey it's a message - for the people
yo, full of passion - for the people
Its an open passage - for the people
hey it's a message - for the people

రచన: రామజోగయ్య శాస్త్రి (3) గానం: జాస్సీ గిఫ్ట్, 'హేయ్‌రబ్బా' స్మిత

అ: ఓణీ వేసుకున్న పూలతీగ ఊగుతుంటే బల్లే బల్లే
బోణీ చేసుకున్న తేనెటీగ తూగుతుంటే బల్లే బల్లే
రాణీకాసులన్నీ కళ్ళనిండా రాలుతుంటే బల్లే బల్లే
కాణీ ఖర్చులేని అల్లరిట్టా తుళ్ళుతుంటే బల్లే బల్లే
ఆ: యే హై చాంద్ కా టుక్‌డా
ఏదో చెయ్యవేంది పోరడా
నీకు ఆశ ఉంటే చెయ్యివెయ్యి చెప్పకుండా
ఇట్టే అందుతుంది చంద్రవంక తప్పకుండా ॥ఓణీ॥
అ: మణులున్న గనిలాంటి నిగనిగల సిరివగల
కలవారి కామాక్షి నువ్వే కదా..
కలలంటి కళలన్ని మా కళ్ళకిచ్చేసి
నిరుపేద లోలాక్షి వయ్యావుగా...
ఆ: బట్టల్లో పొదుపంటే నాకిష్టం
అందాలపై అదుపు అంతే కష్టం
అ: బొత్తాలు మానేసి లోకానికి
చిన్నిముత్తాల పొదుపంటే చూపావులే.. ॥ఓణీ॥
అ: తల్వారు తళుకుల్తో నిలువెల్లా కోస్తుంటే
ఆ తీపిగాయాలు మానేదెలా
జలతారు సొంపుల్తో జాదూలు చేస్తుంటే
ఆ చిలిపి జాతర్ని ఆపేదెలా...!
ఆ: ఇన్నిన్ని అందాలు నా నేరమా
జాలేసి చూపిస్తే నిష్టూరమా
అ: నీకున్న జనశక్తి సామాన్యమా
నిన్ను చూశాక మతి చెడితే విడ్డూరమా...! ॥ఓణీ॥

రచన : రామజోగయ్య శాస్త్రి (5) గానం: జాస్సీ గిఫ్ట్

సాకీ: ఏ దిక్కున నువ్వున్నా ఎగిరొస్తా పావురమా
నా రెక్కల కల నాపే బలమేది లేదు సుమా..!
ప : పొంగే అలవొస్తే తలవంచాలి
వయసూ అలలాంటిదేగా
ప్రాయం వెనకాలే పయనించాలి
ప్రణయం వెన్నాడిరాగా ॥ ఏ దిక్కున॥
చ : గిరులే వొణికే జలపాతంలో జోరు
నీలో చూశా బంగారూ
ఎదిగే సొగసై ఎదురొస్తే పదహారు
అలలై ఎగిసే ఎదహోరు
వర్ణాల విల్లులో ఒక్కోరంగు తీసి
వయ్యారి వంటికి పూసిందెవరు?
మనసే చెడక నిలిచే నరవరులెవరు....?
చ : మధువే తొణికే అధరం మధుకలశం
మౌనం కూడా ప్రియమంత్రం
అపుడూ అపుడూ తెగిపడనీ ఒక ముత్యం
వెనకే తిరిగా ప్రతినిత్యం
ఆ చిలక పలుకులే అలా అలా ఏరి
నాలోని తలపులే స్వరాలు చేసి
నీకే ఇస్తా సఖియా కవితలు కూర్చి.... ॥ఏ దిక్కున॥



రచన: సీతారామశాస్త్రి (4) గానం:సందీప్

Hey, here we go man
Now every body comes and listen to this little thing of reality
And we gonna fight against the devils of humanity and yo,
Now its time to go and it the flames for the future
But don't fear the things that feared before,
Are yor ready
Now its time to kick some dirt off the ground, yeah
ప: లోకాస్సమాస్తా స్సుఖినోభవంతు
ఆ వేదం మా ఎదనాదం
ఆ మాటకర్థం ఇదిగో ఇదంటూ
చూపాలి మన జీవితం
అందర్లా నిద్దర్లో ఉండిపోక
చీకట్నే వేటాడుతాం..
పాపాన్నే పసికట్టే చూపులతో
పారా కాస్తూనే ఉంటాం... ॥లోకా॥
Hey it's a hot shot
its so hot hot....
చ: ఎప్పటికప్పుడు తప్పుని తప్పని చెప్పక తప్పదుగా
పచ్చని పైరుకు పట్టిన చీడను తుంచక తప్పదుగా
నీతికి చితిబెట్టే చేతికి నిప్పంటే చెబుతాం
నెత్తురు చితిబెట్టే
కత్తికి నొప్పిని చూపెడతాం
చేస్తున్నాం ధర్మమని తోచిందేదో
ఫలితం ఏదైనా మేం సిద్ధం
చ: అందరికీ అమృతమందేలా గరళం సేవిస్తాం
అందరి భారం శిలువై మోసిన కరుణై గర్విస్తాం
రాత్రిని కరిగించే, వేకువ కోసం మా పయనం
ధాత్రిని రక్షించే క్షాత్రవ సైన్యం మా ధైర్యం
Hey it's a hot shot
its so hot hot.... ॥లోకా॥



పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.






రవికిశోర్



జయరాజ్



జాస్సీ గిఫ్ట్



సీతారామశాస్త్రి



రామజోగయ్యశాస్త్రి

**తారాగణం**

భరత్, శర్వానంద్, కిషోర్, పద్మాకుమార్, సునీల్ మీనన్, అమిత్, పిళ్ళ ప్రసాద్, నర్రా, జీవా, శ్రీకుమార్, హేమసుందర్, జైభరత్, రాజు,శ్యామ్, వేమూరి సత్యనారాయణ (గెస్టు), గోపిక, రేవతి, మాధురీ సేన్

**సాంకేతిక నిపుణులు**

| | |
|---|---|
| మాటలు | : మరుధూరి రాజా |
| పాటలు | : సీతారామశాస్త్రి, రామజోగయ్య శాస్త్రి |
| సంగీతం | : జాస్సీగిఫ్ట్ |
| కళ | : పేకేటి రంగా |
| కెమెరా | : గుణశేఖరన్ |
| ఫైట్స్ | : హార్స్‌మన్ బాబు |
| ఎడిటింగ్ | : మనోహర్ |
| డాన్స్ | : శంకర్ |
| కో-డైరెక్టర్ | : బి.సుబ్బారావు |
| అసోసియేట్స్ | : సతీష్ |
| అసిస్టెంట్స్ | : గోగినేని శ్రీనివాస్, వేమూరిశ్రీధర్ |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : ఎ.పి.స్వామి |
| స్టిల్స్ | : మనీషా ప్రసాద్ |
| నిర్మాత | : 'స్రవంతి' రవికిషోర్ |
| కథ,స్క్రీన్ ప్లే-దర్శకత్వం | : జయరాజ్ |

# వీనులకు, కనులకు విందు నిస్తున్న

# జనెట్ జాక్సన్






మఱ్ఱిచెట్టు నీడలో మరే మొక్క పెరగదని చెబుతుంటారు. కానీ పాప్‌కింగ్ మైఖేల్ జాక్సన్, అతని సోదరుల ధాటికి నిలబడి తనకంటూ సొంత వ్యక్తిత్వముందని నిరూపించుకుంది వారి సోదరి జనెట్ జాక్సన్. గాయని, గీతరచయిత్రి, నటి అయిన జనెట్ ఇవాళ పాప్ ప్రపంచంలో జనాదరణ పొందిన అతి కొద్ది మందిలో ఒకరు. కేవలం తన గాత్రంతోనే కాకుండా అందచందాలతోనూ (రంగు నలుపే అయినా) యువతకు వీనుల, కన్నుల విందు చేస్తోంది.

1966 మే 16వ తేది ఇండియానాలోని గారీలో పుట్టింది జనెట్. తండ్రి జోసఫ్, తల్లి కాథరీన్‌లకు మొత్తం తొమ్మిదిమంది సంతానం. ఇందులో ఓ పిల్లాడు పుట్టిన కొద్ది గంటలకే చనిపోయాడు. ఇద్దరు అమ్మాయిలు. అందరిలోకీ చిన్నది జనెట్. అన్నయ్య జాకీ జాక్సన్‌కు, జనెట్‌కి 15 సంవత్సరాలు తేడా. జనెట్ పుట్టేసరికే ఆ కుటుంబం సంగీత రంగంలో ఓ స్థానాన్ని సంపాదించుకుంది. జోసఫ్ కొడుకులు జాకీ, టిటో, మార్లొన్, జెర్మైన్, మైఖేల్ ఐదుగురు-మెటౌన్ రికార్డ్స్‌తో 1968లోనే ఒప్పందం కుదుర్చుకుని పాటలు పాడటం మొదలు పెట్టారు. 'ద జాక్సన్ ఫైల్' పేరుతో ఆలపించిన 'ఐ వాంట్ యు బ్యాక్', 'స్టాప్,ద లవ్ యు సేవ్', 'ఎబిసి','డాన్సింగ్ మెషిన్' ప్రజాదరణ పొందాయి. మ్యూజిక్ చార్ట్స్‌లో స్థానం సంపాదించుకున్నాయి. ఈ నేపథ్యంలో జనెట్ బాల్యం వడ్డించిన విస్తరి లానే సాగింది. ఆర్థికపరంగానూ, సంగీతపరంగానూ ఏ లోటు లేదు. అయితే కుటుంబంలో మతపరమైన విభేదాలు, తండ్రీ, పెద్దకుమార్తె లా టూమా మధ్య ఏర్పడిన అభిప్రాయభేదాలు కొంత ఒడిదుడుకులకు కారణం అయ్యింది. ఈ గొడవలకు దూరం కావాలనే మైఖేల్ జాక్సన్ కుటుంబం నుండి దూరమై సోలో ఆర్టిస్ట్‌గా నిలబడటానికి 1970 ప్రాంతంలో కృషి చేశాడు. విజయం సాధించాడు.

జాక్సన్ సోదరి జనెట్ 1974 ఏప్రిల్‌లో మొదటిసారి స్టేజ్ ఎక్కింది. తన అన్నయ్య రాండీతో కల్సి వేదిక మీద పాటలు పాడింది. 1976లో 'ద జాక్సన్స్' పేరుతో జరిగిన టీవీ షోలోనూ పాల్గొంది. ఆ కార్యక్రమం పలువురు టీవీ నిర్మాతల్ని ఆకట్టుకుంది. దాంతో టీవీ కామెడీ సీరిస్ 'గుడ్ టైమ్స్'లోనూ, 'ఎ న్యూ కైండ్ ఆఫ్ ఫ్యామిలీ' లోనూ, 'డిఫరెంట్ స్ట్రోక్స్'లోనూ, 'ఫేమ్' లోనూ జనెట్ నటించింది.

తన తోబుట్టువులకు భిన్నంగా జనెట్ కాలిఫోర్నియా, ఎన్సికోలోని పబ్లిక్ స్కూల్‌లో చదువుకుంది. 1984లో వాలీ ప్రొఫెషనల్ స్కూల్ నుండి డిగ్రీ పట్టా పొందింది. 1984-85 లో యూత్ డ్రామా 'ఫేమ్'లో నటిస్తున్న సమయంలోనే జనెట్ కుటుంబ సభ్యులనుండి దూరమైంది. డె బార్గ్ గ్రూప్‌లోని మ్యుజీషియన్ జేమ్స్ డెబార్గ్‌తో ప్రేమాయణం సాగించింది. 1984 ఆగస్ట్ లో డెబార్గ్‌తో వివాహం జరిగినా, ఆ వివాహాన్ని కుటుంబ సభ్యులు ఆమోదించలేదు. చివరికి తప్పని పరిస్థితుల్లో జాక్సన్ డిబార్గ్ నుండి వేరు పడింది.

వైవాహిక జీవితం ఒడిదుడుకులకు గురైనా

| | | |
|---|---|---|
| ❖ | పేరు | : జనెట్ జాక్సన్ |
| ❖ | జన్మనామం | : జనెట్ డి. జో జాక్సన్ |
| ❖ | ఎత్తు | : 5 అడుగుల 4 అంగుళాలు |
| ❖ | జాతీయత | : అమెరికన్ |
| ❖ | పుట్టినతేది | : మే 16, 1966 |
| ❖ | పుట్టిన స్థలం | : గారీ, ఇండియానా, యు.ఎస్.ఏ. |
| ❖ | వృత్తి | : నటి, గాయని |
| ❖ | భర్త | : రెనె ఎలిజోండో (కొరియోగ్రాఫర్, మార్చి 1991లో వివాహంచేసుకుని 2000 సం॥రంలో విడాకులిచ్చింది) జేమ్స్ డెబార్గ్ (ఆగస్ట్ 1984 వివాహం చేసుకుంది. మార్చి 1985లో వేరుపడింది) |
| ❖ | తండ్రి | : జోసఫ్ వాల్టర్ జాక్సన్ |
| ❖ | తల్లి | : కాథరిన్ ఈస్టర్ జాక్సన్ |
| ❖ | సోదరి | : లాటోయా జాక్సన్(1956) |
| ❖ | సోదరులు | : రాండీ జాక్సన్(1961), మైఖేల్ జాక్సన్ (1959), మర్లోన్ డేవిడ్ (1957), జెర్మైన్‌లా జూన్(1954), టిటో జాక్సన్(1953), జాకీ జాక్సన్(1951) |

జనెట్ మాత్రం గాయనిగా తన కృషిని ఆపలేదు. సోదరుడు మైఖేల్ సహకారంతో 1982లోనే తొలి ఆల్బమ్‌ను 'జనెట్ జాక్సన్' పేరుతో విడుదల చేసింది. టాప్ చార్ట్‌లలో ఆ ఆల్బమ్ 84వ స్థానం పొందింది. అందులోని 'యంగ్ లవ్', 'గివ్ యువర్ లవ్ టుమీ', టైటిల్ ట్రాక్ బాగా పాపులర్ అయ్యాయి. ఈ ఆల్బమ్ 2,50,00 కాపీలు అమ్ముడుపోయాయి. ఆ తర్వాత సోదరులు మైఖేల్, టిటో, జాకీ,మర్లోన్‌తో కలిసి 'డ్రీమ్ స్ట్రీట్' ఆల్బమ్ చేసింది.

జాక్సన్ తొలి గ్రాండ్ సక్సెక్‌ను 1986లో 'కంట్రోల్' ఆల్బమ్ ద్వారా పొందింది. ఎ అండ్ ఎమ్ లేబుల్ ద్వారా విడుదలైన ఈ ఆల్బమ్ రూపకల్పనలో జిమ్మీజామ్, టెర్రీ లెవిస్ వున్నారు. దాదాపు ఎనిమిది మిలియన్ కాపీలు ప్రపంచవ్యాప్తంగా అమ్ముడు పోయాయి. ఇందులోని రెండుపాటలు నెంబర్ వన్ సింగిల్స్‌గా నిలిచాయి. 'టైటిల్ ట్రాక్', 'వాట్ హేవ్ యు డన్ ఫర్ మీ లేటలీ' పాటలవి. ఈ ఆల్బమ్ మూడు గ్రామీ అవార్డులకు, తొమ్మిది అమెరికన్ మ్యూజిక్ అవార్డులను నామినేట్ అయ్యి, రెండు బహుమతుల్ని గెలుచుకుంది.



చక్కగా పాటలు పాడటంతో పాటుగా శృంగార పరమైన కదలికలతో జనెట్ చేసే నృత్యాలు ఆమెను అగ్రస్థానంలోకి తీసుకెళ్ళడానికి ఉపయోగపడేది. ఈ డాన్సుల వల్లే జనెట్ ప్రపంచంలోని ఏ దేశంలో టూర్ చేసినా, ప్రదర్శన ఇచ్చినా వేలాది మంది హాజరు కావడం మొదలు పెట్టారు. జనెట్ తర్వాత ఆల్బమ్ 'రిథమ్ నేషన్ 1814' కూడా బాగా జనాదరణ పొందింది. 'బ్లాక్ క్యాట్', 'మిస్ యు మచ్', 'ఎస్కేప్స్', పాటలు బాగా పాపులర్ అయ్యాయి. ఈ ఆల్బమ్ కూడా ఎనిమిది మిలియన్ కాపీలు అమ్ముడు పోవడంతో పాటుగా మూడు అమెరికన్ మ్యూజిక్ అవార్డులు పొందింది.

1993లో జనెట్ ఐదవ ఆల్బమ్ 'జనెట్'ను విడుదల చేయటంతో పాటుగా 'పాయిటిక్ జస్టిస్' అనే సినిమాలోనటించింది. జాన్ సింగిల్ టోన్ దర్శకత్వం వహించిన ఈ చిత్రం విమర్శకుల ప్రశంసల్ని పొందలేకపోయింది. ఆ తర్వాత జనెట్ పాడిన 'దట్స్ ద వే లవ్ గోస్' పాట గ్రామీ అవార్డ్‌లో 'బెస్ట్ రిథమ్ అండ్ బ్లూస్ సాంగ్' కేటగిరిలో నామినేషన్ పొందింది.

1997లో జనెట్ విడుదల చేసిన ఆరవ ఆల్బమ్ 'ద వెల్వెట్ రోప్' ఆమెకు సెక్సీ గాయనిగా కొత్త ఇమేజ్‌ను తెచ్చిపెట్టింది. గాత్రం వెనకబడి శృంగార చేష్టలు అపరిమితం కావడంతో ఈ ఆల్బమ్ ఆశించిన స్థాయిలో సక్సెస్ కాలేదు. అయితే అదే సమయంలో జనెట్ వ్యక్తిగత వ్యవహారంతో మరోసారి వార్తల్లోకి ఎక్కింది. ఎంతో కాలంగా ఆమెకు బోయ్ ఫ్రెండ్, మేనేజర్ రెనెఎలి జోండో తో జనెట్‌కి వివాహం అయ్యిందనే వార్త బైటకు పొక్కింది. 1999లో జనెట్ తన భర్త రెనెకి విడాకులిస్తున్నానని, తామిద్దరం విడిపోతున్నామని ప్రకటించడంతో వాళ్ళ రహస్య కాపురంపై రకరకాల వార్తలు వచ్చాయి. 2000వ సంవత్సరం మేలో జనెట్ విడాకులు పొందింది. అదే యేడాది 'ఎడ్డీ మర్ఫీ బ్లాక్ బస్టర్' 'ద నట్టీ ప్రొఫెసర్ -2'లో నటించింది. ఆ తర్వాత సంవత్సరమే జనెట్ విడుదల చేసిన 'ఆల్ ఫర్ యు' ఘన విజయం సాధించింది. ఇందులోనూ జనెట్ జాక్సన్ శక్తివంచన లేకుండా దేహ ప్రదర్శనకు పాల్పడింది. ఏదేమైనా ఆల్బమ్ సక్సెస్‌తో ఆమె ప్రపంచ వ్యాప్తంగా పర్యటించే అవకాశం పొందింది. మళ్ళీ పాప్ ప్రపంచంలో తన స్థానాన్ని సుస్థిరం చేసుకుంది. 2002 లో అమెరికన్ మ్యూజిక్ అవార్డును 'ఫేవరెట్ ఫిమేల్ పాప్/రాక్ ఆర్టిస్ట్'గా పొందింది.

**- వి.అరుణ సత్యవతి**

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | |
|---|---|
| చిత్రం | : మై హూ నా |
| రచన | : జావేద్ అఖ్తర్ |
| సంగీతం | : అనూమల్లిక్ |
| గానం | : కె.కె., వసుంధరాదాస్, బృందం |
| అభినయం | : జాయేద్‌ఖాన్, అమృతారావు |





ప్రముఖ నృత్య దర్శకురాలు ఫర్హాఖాన్ తొలిసారి దర్శకత్వం వహించి, నిర్మించిన చిత్రం 'మై హూనా' సినిమాలో చెప్పుకోదగ్గ కొత్తదనం, ప్రత్యేకత లేకున్నా, చక్కని నటన (షారుఖ్ ఖాన్, సుస్మితా సేన్, జాయేద్‌ఖాన్, అమృతారావ్), మంచి సంగీతం ఉన్నందువల్ల, అసహజమైన కళాశాల సన్నివేశాలు ఎన్ని ఉన్నా మొత్తం మీద సినిమా ప్రజలకు బాగా నచ్చింది. తొలి సినిమాతోనే హిట్ దర్శకురాలైంది ఫర్హా. ఈ చిత్రంలో తొలిసారి పరిచయవుతున్న జాయేద్ ఖాన్ (హృతిక్ రోశన్ బావమరిది) అమృతారావ్ లు ప్రవేశించే దృశ్యంలో వచ్చే పాట 'చలే జైసే హవా'. హుషారైన బాణి, హాయైన సాహిత్యం, చక్కని గానం - ఈ పాటను హిట్ చేసాయి. సంగీత దర్శకుడు అనూ మల్లిక్, గీత రచయిత జావేద్ అఖ్తర్.

సినిమాలో దృశ్యం అన్ని 'యువ' సినిమాల్లో ఉండేదే ! కళాశాల ప్రాంగణం; నాయికా, నాయకుడు, ఇతర మిత్రబృందంతో కలిసి పాడుతూ, నాట్యం చేయడం. అయితే, రెండో చరణానికి ముందు, ఈ కళాశాలకు వచ్చేందుకు బయల్దేరి రైల్లో వస్తున్న షారుఖ్‌ఖాన్ తోటి ప్రయాణీకులతో తన గురించి చెప్పుకోవడం, అంటే అతని డైలాగులు వస్తాయి. వాటికి పాటతో ఎలాంటి సంబంధం లేదు. ఇక పాట.

ఆమె: చలీ జైసే హవాయే సనన్ సనన్  
ఉడే జైసే పరిందే గగన్ గగన్  
ఛాయే తితిలియా జైసే చమన్ చమన్  
యూహీ ఘూమూ మై భీ మగన్ మగన్ ॥హే హే॥  
మై దీవానీ దిల్‌కీ రానీ గమ్‌సే అంజానీ  
కబ్ కర్‌తీ హూ వో కర్‌తీ హూ - జో హై ఠానీ ॥చలీ॥

మొదటిచరణం:  
కోయీ రోకే - కోయీ ఆహే  
జీత్ నా భీ ముఝుకో సమఝాయే - మై నా సునూంగీ కభీ  
అప్‌నీ ధున్ మే మై రెహతీహూ - మై పగ్‌లీ హూ, మై జిద్దీ హూ  
కెహతేహై యేతో సభీ  
కోయి నహీ జానా- అర్ మాన్ క్యాహై మేరా ॥చలే॥

రెండో చరణం: (అతడు)  
అయీ హసీనా యే తో అయీ  
ముఝుకో దిఖానే అప్‌నీ అదాయే  
మైభీ కుఛ్ కమ్ నహీ- యూ  
అంఖోమే ఆంఖే జో డాలూ -  
దిల్ మై చురాలూ హోశ్ చురాలూ  
కోయి హో కిత్‌నా హసీ  
మేరా హోగయావో జో ఏక్ బార్ ముఝ్‌సే మిలా  
చలీ జైసే హవాయే సనన్ సనన్ -  
ఉడే జైసే పరిందే గగన్ గగన్  
ఛాయే భవరే జైసే చమన్ చమన్-  
యూహీ ఝూమూ మైభీ మగన్ మగన్  
మై దీవానా మై అంజానా- గమ్ సే బేగానా  
హూ ఆవారా లేకిన్ ప్యారా - సబ్‌నే మానా ॥చలీ॥



ఈపాటలో నాయిక తన గురించి చెప్పుకుంటుంది.

సనన్ అంటే అర్థం ఏమీ లేదు. అదొక వర్ణనావిధానం. గాలి వీచడాన్ని వర్ణించడం. ఇక్కడ నాయిక తన స్వభావాన్ని, స్వరూపాన్ని వర్ణించుకుంటోంది; తన స్వేచ్ఛా ప్రియత్వాన్ని ప్రకటించుకుంటోంది. పరిందా అంటే పక్షి. తితిలీ అంటే సీతాకోకచిలక. చమన్ అంటే ఉద్యానవనం; మగన్ అంటే నిమగ్నమై, వివశురాలై . గమ్ అంటే బాధ. అంజానీ అంటే తెలియనిదాన్ని . జోహై రానీ అంటే నాకు నచ్చింది; నేను నిర్ణయించుకున్నది అని భావం. మొత్తం మీద పాట తాత్పర్యం ఇది.

రివ్వున వీచేగాలిలా - అంబరాన ఎగిరే పక్షిలా
తోటలో విహరించే సీతాకోక చిలకలా
పరవశించి తిరుగుతాను
నేనో పిచ్చిదాన్ని - హృదయరాణిని
బాధ ఎరగనిదాన్ని
ఎప్పుడు ఏం చేసినా - నా మనసుకు నచ్చిందే చేసేదాన్ని॥రివ్వున॥

మొదటిచరణం :

ఎవరు ఆపనీ - ఎవరు రానీ
నాకెంత నచ్చజెప్పనీ - నేను వినేదాన్ని కాను
నా లోకంలో నేనుంటాను - నేను పిచ్చిదాన్ని, మొండిదాన్ని
అనే అంటారు నన్నందరూ
ఎవరూ ఎరగరు - నా కోరిక ఏమిటో... ॥రివ్వున॥

మొదటి చరణమంతా నాయిక ఒక్కతే మిత్రబృందంతో కలిసి పాడుతుంది. ఈ చరణం పూర్తయ్యేసరికి, మోటార్ సైకిల్ పై హీరో వస్తాడు. అతను కూడా వీళ్ళతో చేరి తన గురించి పాడుకుంటాడు. నాయిక తన గొప్పదనం చెప్పుకుంటే, నాయకుడు అంతకు రెండింతలు తన గొప్పలు చెప్పుకుంటాడు.

రెండో చరణం :

వచ్చిందండి వచ్చింది అందాల భామ
తన సోయగాలు నాకు చూపించను వచ్చింది
నేనుమాత్రం ఏం తక్కువని?
కళ్ళల్లో కళ్ళు పెట్టి చూస్తే చాలు
మనసు దొంగిలిస్తాను- మరులు గొలుపుతాను(హోశ్ చురానా)
ఆమె ఎంత అందగత్తయినా సరే..
నా స్వంతమై పోతుంది - ఒక్కసారి నన్ను కలిసిందంటే
మళ్ళీ పల్లవి (నాయకుడి పరంగా కొన్ని మార్పులతో)
రివ్వున ఎగిరే గాలిలా - అంబరాన ఎగిరే పక్షిలా-
తోటలో విహరించే భ్రమరంలా - పరవశంతో తిరుగుతాను
నేను పిచ్చివాణ్ణి -ఎవరూ ఎరగనివాణ్ణి
బాధ తెలియని వాణ్ణి
ఆవారా కానీ ప్రేమాస్పదుణ్ణి
అని అందరూ అంగీకరించే మనిషిని ॥రివ్వున॥

ఈ పాటలోని ప్రత్యేకత, సాహిత్యంలోనూ, బాణిలోనూ కనబడే తాజాదనంలో ఉంది. యువతీ, యువకుల స్వభావం, ప్రవర్తనలకు అద్దం పట్టే సాహిత్యం, మనకు తెలీకుండా మనం కూడ గొంతు కలిపేసే హుషారైన బాణి - ఇవి ఈ పాటను విడిగా నిలబెట్టాయి.

**- మృణాళిని**

## హిందీ సినీ సంగీతంలో మలుపులూ-మజిలీలూ

### 1965

'గైడ్' చిత్రం కోసం ఎస్.డి.బర్మన్ అందించిన సంగీతం సూపర్‌హిట్ అయింది. తన కెరీర్‌లోనే ఓ గొప్ప చిత్రంగా నిలిచిన ఈ చిత్రంలో 'వహా( కౌన్ హై తేరా ముసాఫిర్ జాయేగా కహా( ...' అంటూ ఎస్.డి. పాడిన పాట సూపర్‌హిట్ అయింది. 'ఆజ్ ఫిర్ జీనే కి తమన్నా హై..' (లతా) పాటలో ముందుగా వచ్చే చరణాన్ని ఆనంద్ సోదరులు లేకుండానే ఎస్.డి. స్వంతంగా క్రియేట్ చేయటమే కాక, రికార్డు చేసి షూటింగ్‌కు పంపించారు. 'నేను పంపిన ఈ పాట ప్రపంచం గుర్తుపెట్టు కుంటుం'దంటూ దానితోబాటు పంపిన సందేశం చూస్తే ఆ పాటపై ఆయనకు ఉన్న నమ్మకానికి హ్యాట్సాఫ్ చెప్పక తప్పదు. ఈ చిత్రంలో అన్ని పాటలూ హిట్ కావటం గొప్ప విశేషం.

'దిన్ ఢల్ జాయే....', 'క్యా సే క్యా హో గయా..', 'తేరే మేరే సప్నే..' పాటలు సోలోహిట్స్‌గా రఫీ కెరీర్‌లో నిలిచాయి. 'గాతా రహే మేరా దిల్ (లతా, కిశోర్), 'మోసే ఛల్ కియే జాయే హాయ్‌రే హా..'(లతా), 'పియా తోసే నైనా లగే...'(లతా), 'అల్లా మేఘ్ దే' (ఎస్.డి.బర్మన్) పాటలు మరికొన్ని ఈ చిత్రంలోని హిట్ గీతాలు.


'గైడ్'లో వహీదా రెహమాన్, దేవ్‌ఆనంద్

ఈ సంవత్సరం ఎస్.డి. అందించిన మరో మ్యూజికల్ - 'తీన్ దేవియా('. మజ్రూహ్ సుల్తాన్‌పురి అందించిన చక్కటి సాహిత్యానికి దాదా అందించిన బాణీలు విశేషంగా ఆకట్టుకున్నాయి.

'కహీ( బేఖయాల్ హోకర్..' (రఫీ) పాట బేసిక్ ట్యూన్‌ను దాదా అసిస్టెంట్ జయదేవ్ చేసినప్పటికీ, 'అరే యార్ మేరే తుమ్ భీ హో గజబ్'(ఆశా, కిశోర్), 'ఐసే తో నా దేఖో కీ హమ్‌కో...'(రఫీ), 'లిఖా హై తేరీ ఆంఖోం మే('( లతా, కిశోర్), 'ఖ్వాబ్ హో తుమ్ యా కోయీ హకీకత్..'(కిశోర్) పాటలు దాదా విశిష్టతను చెప్పకనే చెప్తాయి.

'భీగీరాత్' చిత్రం కోసం రోషన్ అందించిన సంగీతం ఆయనకు మంచి పేరు తీసుకువచ్చింది. 'దిల్ జో న కహ్ సకా...' అంటూ లతా, రఫీలతో అందించిన రెండు వెర్షన్స్ సూపర్‌హిట్ అయ్యాయి. 'నయీ ఉమర్ కి నయీ ఫసల్' చిత్రం ద్వారా నీరజ్ గీత రచయితగా వెలుగులోకి వచ్చాడు. ఆ చిత్రంలోని 'కార్‌వా( గుజర్ గయా...'(రఫీ), 'దేఖ్‌తీ హీ రహో ఆజ్ దర్పన్ న తుమ్...' (ముకేష్) పాటలు హిట్ అయ్యాయి. ఈ చిత్రానికి సంగీతం రోషన్.


'భీగీరాత్'లో మీనాకుమారి, అశోక్‌కుమార్

'మొహబ్బత్ ఇస్‌కో కహతే హై' చిత్రంకోసం ఖయ్యూమ్ స్వరపరిచిన సుమన్ - రఫీ డ్యూయెట్ 'రహరియే హోష్ మే( అ లూ(...', 'సికిందర్ -ఎ- అజమ్' చిత్రం కోసం హన్స్‌రాజ్ బెహల్ అందించిన చివరి హిట్ గీతం 'జహా( డాల్ డాల్ పర్ సోనే కి చిడియా...' (రఫీ), 'నీలా ఆకాశ్' చిత్రంకోసం మదన్‌మోహన్ స్వరపరిచిన 'ఆప్‌కో ప్యార్ ఛుపానే కి బురీ ఆదత్ హై..'(ఆశా, రఫీ)ఈ సంవత్సరం హిట్ అయిన మరికొన్ని పాటలు.

'రిస్తే నాతే' చిత్రం కోసం మదన్‌మోహన్ అన్ని పాటలను ఒక్క లతా చేతనే పాడించటం విశేషమైతే తిరిగి అదే తరహా ప్రయోగాన్ని 8 సంవత్సరాల తరువాత 'ప్రభాత్' చిత్రం కోసం చేయటం మరో విశేషం.

(వచ్చే సంచికలో మరికొంత)

# సరిగపదమని

**31**

కూర్పు: టి. నవీన్-హైదరాబాద్

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | | ● | 3 | ● | 4 |
| | ● | | ● | ● | 5 | | ● | |
| | ● | 6 | 7 | | ● | ● | 8 | |
| ● | 9 | ● | | ● | 10 | ● | ● | |
| 11 | | | ● | 12 | ● | 13 | 14 | |
| ● | | ● | 15 | | ● | ● | | ● |
| 16 | | ● | | ● | 17 | | | ● |
| ● | ● | ● | ● | ● | | ● | ● | 18 |
| 19 | | | ● | 20 | | ● | 21 | |

**అడ్డం:**

1. '.........శివానందలహరి చంద్రకళాధరి ఈశ్వరీ' జగదేకవీరుని కథ చిత్రంలోని గీతం (5)
5. '....... ....... ధవళాచల మందిర గంగా ధర హర నమో నమో' (2)
6. 'అందరి బంధువయ్యా భద్రాచల.........' దేవుళ్ళు చిత్రంలోని పాట (3)
8. శేష.....వాసా శ్రీ వేంకటేశా' (2)
10. '....... ....... బోలే శంఖం మోగెలే' 'ఇంద్ర' చిత్రం కోసం మణిశర్మ స్వరపరిచినది (1)
11. 'హే కృష్ణా ముకుందా......... జయకృష్ణ ముకుందా .........' పాండురంగ మహత్యం చిత్రంలోని గీతం (3)
13. '........ నీ నామమెంతో రుచిరా' ఇద్దరుమిత్రులు చిత్రంలోని పాట (3)
15. 'భళి భళి భళి భళి దేవా బాగున్నదయా నీ .......' మాయబజార్ చిత్రంకోసం మాధవపెద్ది సత్యం అభినయించి, పాడిన గీతం (2)
16. 'మీర జాలగలడా నాయనతి ...... విధాన మహిమన్! సత్యాపతి' (2)
17. 'చక్రిసర్వోపగతుండెందెందు వెదకి చూచిన అందందే...........' (3)
19. '........ ........ మంజునాథుడొక్కడే' (3)
20. 'వేణు ...... సమ్మోహనం వేలిమీద గోవర్ధనం' స్వరాభిషేకం చిత్రంలోని పాట (2)
21. 'ఆదిభిక్షువు .......నేది కోరేది బూడిదిచ్చే.....నేది అడిగేది' సిరివెన్నెల చిత్రంకోసం సీతారామశాస్త్రి రచించిన గీతం (2)

**నిలువు:**

1. 'ఆనంద తాండవమాడే ........ అనంతలయుడు చిదంబర నిలయుడు' అమెరికా అమ్మాయి లోని గీతం (3)
2. '.......... నాద శరీరా పరా' శంకరాభరణం చిత్రంలోని గీతం (3)
3. 'కైలాసాన కార్తీకాన .....రూపం' సాగరసంగమం చిత్రంలోని ఓ పాట(2)
4. 'పలుకే బంగారమాయెరా.............. పలుకే బంగారుమాయెరా' అక్కినేనితో బాపు తీసిన ఓ సినిమాలోని తొలిగీతంలోని తొలి వాక్యం(5)
7. 'ఓమ్ .......ప్రాణ దీపమ్ శివమ్ శివమ్' శ్రీ మంజునాథ చిత్రంలోని పాట (2)
9. 'బ్రహ్మ మురారి ..........లింగం నిర్మలభాసిత శోభిత లింగం' (4)
12. '....... ....... మహదేవ శంభోహర శంకరా' కాళహస్తి మహత్యం చిత్రంలోని గీతం (2)
14. 'అందాల .......ఇందివర శ్యాముడు ఇనకులబ్ధి సోముడు ఎందువలన దేముడు' (3)
15. '........దారి క్రిష్టయ్య ఎంతటివాడో ఓరయ్యో' మిష్టర్ పెళ్ళాంలోని గీతం (2)
17. 'నీల...... ఘనశ్యామా! ఘనశ్యామా దేవా' చెంచులక్ష్మి చిత్రంలోని గీతం (3)
18. 'అడుగడుగున....... ఉంది అందరిలో...... ఉంది' కె.వి.మహదేవన్ స్వరపరిచిన గీతం (2)

పంపినవారి పేరు :.......................................................

వయసు :........... వృత్తి :.......................................................

చిరునామా :.......................................................

.......................................................

.......................................................ఫోన్ :.......................................................

**పజిల్, కూపన్ 30-11-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...



మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)



రెండవ బహుమతి (ఒక తప్పుతో)



మూడవ బహుమతి (రెండు తప్పులతో)



కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)





# గీతాన్ని, జీవితాన్ని అక్కడే దిద్దుకున్నాను

**- 'యువసేన' రామజోగయ్య శాస్త్రి**

ప్రతి సినీ గీత రచయితకూ ఒక్కో శైలి ఉంటుంది.
దేవులపల్లి, ఆత్రేయ, ఆరుద్ర, సినారె, వేటూరి...
ఇలా ఒక్కొక్కరిది ఒక్కొక్క శైలి. ఓ పాట నడక చూసి
ఆ పాట రాసిందెవరో సులువుగా చెప్పేయొచ్చు.
'లంగావోణి నేటితో రద్దయ్‌పోనీ...' పాట వినగానే
అందులోని చిలిపితనానికి సీతారామశాస్త్రి గుర్తుకొచ్చేస్తారు...
మచ్చుకి ఈ పాట,
వాటిలో పదాలు
చూడండి...
ఓణీ వేసుకున్న పూలతీగ
బోణీ చేసుకున్న తేనెటీగ
రాణీకాసులు
కాణీ ఖర్చులేని అల్లరి...
యే హై చాంద్ కా **టుక్‌డా**
ఏదో చెయ్యవేంది **పోరడా**
నీకు ఆశ ఉంటే చెయ్యివెయ్యి **చెప్పకుండా**
ఇట్టే అందుతుంది చంద్రవంక **తప్పకుండా**
ఇవి చూడగానే వెంటనే శాస్త్రి గారు
రాశారని చెప్పేస్తాం. ఈ పాటలోనే
బొత్తాలు మానేసి లోకానికి
చిన్నిముత్తాల పొదుపంటే చూపావులే..
అనే వాక్యాల్లోని గడుసుతనాన్ని గమనిస్తే
ఇది శాస్త్రి గారి చమత్కారమేనని నిర్ధారించేస్తాం.
ఇన్నిన్ని అందాలు నా నేరమా
జాలేసి చూపిస్తే నిష్ఠూరమా
అని ఓ కుర్రది అంటే అందుకు బదులుగా
నీకున్న జనశక్తి సామాన్యమా
నిన్ను చూశాక మతి చెడితే విడ్డూరమా...!
అంటూ ఓ కుర్రాడి ద్వారా అనిపించడాన్ని చూస్తే శాస్త్రి గారు కాకపోతే ఇంకెవరిలా రాస్తారు అని వాదించేస్తాం. అదే సినిమాలోని
ఏ దిక్కున నువ్వున్నా ఎగిరొస్తా పావురమా
నా రెక్కల కల నాపే బలమేది లేదు సుమా..!
అనే పాటలో పావురమా - లేదుసుమా, రెక్కల కల లాంటి ప్రయోగాలు చూసి 'సందేహం లేదు.. ఇవన్నీ శాస్త్రిగారి ప్రయోగాలే...' అంటూ బెట్ కూడా కట్టేస్తాం.
ఇవన్నీ కొంతవరకే కరెక్ట్.
ఎందుకంటే... వీటన్నిటిలోనూ గల 'శాస్త్రీయత', సీతారామశాస్త్రీయత తో పాటు సీతారామశాస్త్రి గారి మనస్తత్వం కూడా చూసి అలా పొరబడే ఆస్కారం ఉంది.
ఇవి రాసింది శాస్త్రి గారే
కానీ సీతారామశాస్త్రి కాదు....
రామజోగయ్య శాస్త్రి.
ఈ రామజోగయ్య శాస్త్రి ఎవరో కాదు...
సీతారామశాస్త్రి శిష్యుడే..!
నిన్న కులశేఖర్...
నేడు రామజోగయ్య శాస్త్రి..
ఇలా సీతారామశాస్త్రి గారి శిష్యులు సినీ రంగంలో ప్రవేశించి
తమకంటూ ఓ గుర్తింపు తెచ్చుకొంటున్నారు. 'యువసేన' చిత్రం ద్వారా
తెలుగు సినీ సంగీత రంగంలో గీత రచయితగా ప్రవేశించిన
రామజోగయ్య శాస్త్రితో కాసేపు....

**✦ మీ బాల్యం, చదువు....**

మాది గుంటూరు జిల్లా నరసరావు పేట సమీపంలోని ముప్పాళ. నేను బాల్యం అంతా అక్కడే గడిపాను. ఇంటర్‌మీడియట్ నరసరావుపేటలో.. మెకానికల్ ఇంజనీరింగ్ వరంగల్ ఆర్.ఇ.సి.లో చేస్తే, ఎం.టెక్ మాత్రం ఐ.ఐ.టి. ఖరగ్‌పూర్‌లో చేశాను.

**✦ ఇంజనీరింగ్ చదివిన వెంటనే సినిమా ఫీల్డ్‌లోకి వచ్చారా...?**

లేదు. నా ఎం.టెక్ అయిపోయిన తరువాత బెంగుళూరులోని బెస్ట్ అండ్ క్రాంప్టన్ కంపెనీలో ఓ సంవత్సరం తరువాత కిర్లోస్కర్‌లో 5 సంవత్సరాలపాటు చేశాను. తరువాత హైదరాబాద్ షిఫ్ట్ అయ్యి జనరల్ ఎలక్ట్రిక్ బిజినెస్ సెంటర్‌లో మూడేళ్లుగా పనిచేస్తున్నాను. నేను నవంబర్ 12న హైదరాబాద్ రావటం జరిగింది. నా తొలి సినిమాకూడా నవంబర్ 12నే విడుదల కావటం విశేషం.

✦ **ఇంజనీరింగ్ చదివిన మీకు పాటపై మీకు ఎలా ఇంట్రెస్ట్ కలిగింది..?**

నాకు చిన్నప్పటినుంచే పాట అంటే ఇష్టం. మా ఊళ్లో నాటకాలు అవీ బాగా వేస్తుండేవారు. మా బావ గారు పి.ఆర్.కె.ప్రసాద్‌గారు ఆ నాటకాలను డైరెక్ట్ చేస్తుండేవారు. ఈ నాటకాల రిహార్సిల్స్, పక్క ఊళ్లకు వెళ్లినప్పుడు చూడటం... ఇలా నాలో పాటపై మరింత మక్కువ పెరిగింది. 'వయసు పిలిచింది' లో 'ముత్యమల్లే మెరిసిపోయే....' నాకు బాగా ఇష్టమైన పాట. ఆ పాట ఇన్‌స్పిరేషన్‌తోనే నేను పాడటం నేర్చుకున్నాను. నేను రైటర్‌ను కావాలని ఏనాడూ అనుకోలేదు. పాడటం అంటేనే నాకు ఇష్టం. చాలా పాటలను ప్రాక్టీస్ చేసేవాడ్ని. తరువాత చదువులో పడి పాటలు పాడటం ఆపేసినా...ఇంజనీరింగ్‌లో జాయిన్ అయిన తరువాత అక్కడ చేసే ర్యాగింగ్‌లో మళ్లీ పాటలు పాడటం ప్రారంభించాను. ఆ తరువాత వరంగల్ లోని ఆర్.ఇ.సి. మ్యూజిక్ క్లబ్‌లో పాటలు పాడేవాడ్ని. తరువాత ఉద్యోగరీత్యా బెంగుళూరు వెళ్లినప్పుడు ఒకాయన ఇచ్చిన సలహాతో రైటర్‌ని అయ్యాను.

✦ **అంటే మీ మొదటి పాట బెంగుళూరులో రాశారా...?**

అవును. నేను సింగర్‌గా వెళ్దామనుకున్నప్పుడు శ్రీచంద్ర గారని బెంగుళూరులో స్థిరపడిన ఓ తెలుగాయన.. నేనిచ్చే కాన్సెప్టులు చూసి 'మీరు పాడటం కన్నా రైటర్‌గా ట్రై చేస్తే ఉపయోగం ఉంటుంద'న్నారు. ఆయన ప్రయివేట్ క్యాసెట్స్ అవీ చేస్తుండేవారు. అందువల్ల ఆయనే నాకో అవకాశం ఇచ్చి డివోషనల్ క్యాసెట్స్‌కి రాయించారు. అయ్యప్ప మీద నేను రాసిన పాటలు మంచి ఆదరణ పొందటంతో దాదాపు 30, 40 క్యాసెట్స్ తయారు చేశాం. ఈ క్యాసెట్లకు గుడిపాటి వెంకటాచలం గారి బంధువు సుజాతదత్ గారు గాత్రాన్ని అందించేవారు. ఘటం రామలింగశాస్త్రి గారి సంగీత దర్శకత్వంలో విడుదలైన 'వెన్నెల్లో సాయిగానం' నా మొదటి ఆడియో క్యాసెట్‌గా చెప్పుకోవాలి.

✦ **సినిమా ఫీల్డ్‌లోకి ఎలా ఎంటరయ్యారు?**

నేను బెంగుళూరులో అలా పాటలు రాస్తుండగానే ఎల్.ఎన్.శాస్త్రి గారి ద్వారా కన్నడ హీరో, డైరెక్టర్ రవిచంద్రన్‌గారితో పరిచయం కలిగింది. ఈయన తెలుగులో శాంతి -క్రాంతి , మేజర్ సినిమాలను తీశారు కూడా. ఆ తరువాత ఆంటీ ప్రీత్ సే,(తెలుగులో ఆంటీ) అమ్మా నిన్నతొళినల్లి, మూరు మనసు నూరు కనసు సినిమాల్లో కన్నడ పాటలు రాశాను. ఆ తరువాత ఓ కన్నడ చిత్రాన్ని తెలుగులో డబ్బింగ్ చేయవలసి వచ్చినప్పుడు రవిచంద్రన్‌గారి ద్వారా సిరివెన్నెల సీతారామశాస్త్రిగారిని కలవటం జరిగింది. అప్పుడే ఆయనతో నేను మీ దగ్గర వర్క్ చేయాలనుకుంటున్నానని చెప్పడం, ఆయన ఓకె అనటం జరిగినా నా జాబ్ ఒత్తిడి వల్ల అప్పుడు కుదర్లేదు.

✦ **హైదరాబాద్ ఎప్పుడు వచ్చారు?**

2001, నవంబర్ 12న జాబ్ పర్పస్‌తో నేను హైదరాబాద్ వచ్చాను. అప్పుడు మా బంధువుల ఇంట్లో 'హంసం' చూశాను. అందులో పాటలు, వాటికి సంబంధించిన విశ్లేషణలు చదివిన తరువాత రాజా గారిని కలిసి నా పాట వినిపిస్తే ఏమైనా ఉపయోగం ఉంటుందా, లేదా అని తెలుపుతారనుకుని నేను రాసిన అయ్యప్ప భక్తి గీతాల తెలుగు క్యాసెట్‌ను ఆయనకు ఇచ్చాను. ఆ క్యాసెట్ విన్న తరువాత రాజాగారు ముందు నన్ను కీరవాణిగారి దగ్గరకు పంపించడమే కాకుండా 'మీరు సినిమాలకు బ్రహ్మాండంగా పనికొస్తారు. అయితే సీతారామశాస్త్రిగారి లాంటి రచయితల దగ్గర కొన్నాళ్లు పనిచేస్తే మెళకువలు నేర్చుకోవచ్చ'ని సూచించారు కూడా! ఆ ప్రోత్సాహంతో నేను సీతారామశాస్త్రి గారిని మళ్లీ కలవటం, ఆయన శిష్యరికాన్ని పొందడం జరిగింది.

✦ **మరి మీ జాబ్‌కు అది ఇబ్బంది కాలేదా..?**

నాకున్న టైమ్‌నే నేను సర్దుబాటు చేసుకుంటున్నాను. అందువల్ల నా కుటుంబంతో గడిపే టైమ్ కూడా బాగా తగ్గిపోయింది. ఆఫీసునుండి రావడం, వెంటనే శాస్త్రిగారి దగ్గరకు పరుగులు పెట్టడం, తెల్లవారు ఝామునే వచ్చి ఓ రెండు మూడు గంటలు నిద్రపోయి మళ్లీ ఆఫీసుకెళ్లటం.....

✦ **పూర్వకవుల గ్రంథాలు... ప్రబంధాలు ఏవీ చదవకుండానే మీరు పాట ఎలా రాయగలననుకుంటున్నారు?**

నాకున్న ఆలోచన, పరిశీలనా శక్తితోనే రాయగలుగుతున్నాననుకుంటున్నాను.

✦ **స్రవంతిమూవీస్ అంటే సీతారామశాస్త్రిగారి సింగిల్‌కార్డ్ బ్యానర్స్‌లో అదొకటి. మరి 'యువసేన'లో మీకు ఎలా అవకాశం వచ్చింది?**

ఈ విషయంలో నేను సీతారామశాస్త్రిగారికి, రవికిషోర్‌గారికి ఎంతో ఋణపడి ఉన్నాను. 'గౌరి' సినిమా వర్క్ జరుగుతున్న టైంలో సీతారామశాస్త్రిగారిని రవికిషోర్‌గారు అడిగారు... 'నా తరువాత సినిమాలో చిన్న శాస్త్రి చేత ఓ పాట రాయిద్దామనుకుంటున్నాను' అని. దానికి శాస్త్రిగారు వెంటనే ఒప్పుకున్నారు. ఒప్పుకోవటమే కాదు ఆయనే రికమెండ్ చేసి తను రాయవలసిన మరో పాట కూడా ఇప్పించారు. మహావృక్షం నీడన చిన్న మొక్క బ్రతకదంటారు... కానీ తన చల్లటి మనసుతో ఈ చిన్నిమొక్కను బ్రతికించారు శాస్త్రిగారు.

✦ **'యువసేన'కు మీరు రాసిన మొదటిపాట ఏది?**

రవి కిషోర్‌గారికి పాట రాయమని శాస్త్రిగారు నాతో చెప్పినప్పుడు సార్ నాకు అప్పుడే పాటలు రాసేయాలని లేదని ఆయనతో అన్నాను.... అయితే శాస్త్రిగారు అవకాశం వచ్చినప్పుడు రాయటంలో తప్పులేదనటంతో మొదటగా 'ఓణి వేసుకున్న పూలతీగ ఊగుతుంటే బల్లే బల్లే..' పాట రాశాను. ఈ పాటకు దాదాపు 10 నుండి 12 పల్లవులు రాస్తే చరణాలు 8 వెర్షన్స్ వరకూ రాశాను. వాటినుండి శాస్త్రిగారు కొన్ని ఎంపిక చేస్తే... చివరకు రవికిషోర్‌గారు తన సినిమాకు ఏది సూటబుల్‌గా ఫీలయ్యారో అది తీసుకున్నారు.

✦ **రెండో పాట ఎలా...?**

రెండో పాట నాకు శాస్త్రిగారు ఇప్పించారు. మొదటి పాట అయిన తరువాత... రామజోగయ్య శాస్త్రి అంటే ఈ తరహా పాటలే రాయగలడు అని ముద్రపడితే కష్టం కాబట్టి మొదటి దానికి పూర్తిగా డిఫరెంట్‌గా ఉండే పాట రాయమని శాస్త్రిగారు చెప్పటం... రవికిషోర్‌గారు కూడా ఒప్పుకోవటం... నేను ఓ 30 సాకీలు, ఓ 15 పల్లవులు దాకా రాస్తే చివరకు 'ఏ దిక్కున నువ్వున్నా ఎగిరొస్తా పావురమా...' పాట రెడీ అయింది.

✦ **ఆడియో రిలీజ్ తరువాత రెస్పాన్స్ ఎలా ఉంది?**

చాలా బావుంది. ముఖ్యంగా రవికిషోర్‌గారు, శాస్త్రిగారు చాలా హ్యాపీ ఫీలయ్యారు. రవికిశోర్ గారయితే విజయ్‌భాస్కర్, త్రివిక్రమ్ శ్రీనివాస్, పవన్‌కళ్యాణ్ గార్లకు ఈ పాటలు వినిపించి రామజోగయ్య బాగా రాశాడని చెప్పడం.... త్రివిక్రమ్ గారు ఫోన్ చేసి అభినందించడం మరువలేని అనుభూతి. అయితే ....నేను మంచి పాటలు రాసి కొద్దిగానైనా పేరు తెచ్చుకునే సమయానికి మా అమ్మగారు ఈ లోకంలో లేకపోవడం ఒక్కటే కొరత.

✦ **శాస్త్రిగారితో సాంగత్య వైభవం ఎలా ఉంది మీకు?**

శాస్త్రి గారు నన్ను తన సరసన కూర్చోబెట్టు కుని నా పాటను సరిదిద్ది మెళకువలను నేర్పించి, మెలకువలోనికి రప్పించారు. ఆయన మార్గ దర్శకత్వంలో గీతాన్ని, జీవితాన్ని దిద్దుకున్నాను. తన విలువైన సాంగత్యాన్ని నాకు వరంగా అందించిన శాస్త్రిగారు, నా సద్గురువు బాబాయేనని నా భావన. ఆయన ఋణం ఎన్నటికీ తీర్చుకోలేను.

**-పి.గిరి మహాలక్ష్మి**

# తాతా థిత్తై తథిగిణతోం

సీరియల్ 24

- జీడిగుంట రామచంద్రమూర్తి

| పాత్రలు | నటీనటుల సజెషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.

## జరిగిన కథ

విష్ణుమూర్తి అనే బిజినెస్‌మన్ కూతురు అశ్విని తండ్రంటే భయపడే పల్లెటూరి యువకుడు శ్రీరామ్‌ను ప్రేమించి తండ్రిని ఒప్పించి పెళ్లాడింది. వారి శోభనం జరగడానికి కొన్ని గంటల ముందు ఓ సాధువు ఎక్కడినుండో వచ్చి కోడలు గర్భం దాలిస్తే నీకు చావు తప్పదని శ్రీరామ్ తండ్రి వీరభద్రాన్ని హడలగొడతాడు. దాంతో ఒకే చూరుకింద ఉన్నా కొత్తదంపతులు కలవకూడదని ఆంక్షలు విధిస్తాడాయన. ఎడబాటు భరించలేక వారు ఎవరికీ చెప్పకుండా విజయవాడలో 'హనీమూన్' జరుపుకుందామని ప్లాను చేసి ఓ లాడ్జీలో దిగుతారు. అక్కడకు పోలీసులు వస్తారు.

- ఇక చదవండి



విషయం బోధపడింది శ్రీరామ్‌కి!

తాము హోటల్లో అడుగు పెట్టగానే, రిసెప్షన్‌లో వున్న మేనేజరు -అశ్విని వైపు 'అలా' నిశితంగా ఎందుకు చూశాడో అర్థమైంది. కొన్ని క్షణాలు.. ఆలోచించి ఓ నిర్ణయానికి కొచ్చాడు.

"ఓ.కే.సార్ ! మీరు చెప్పినట్టే పోలీస్‌స్టేషన్ కొస్తాం ! తన కూతురు కనిపించటం లేదని పేపరు ప్రకటన ఇచ్చిన ఆ జగన్నాథం ఎవరో - ఆయన్ని కూడా వెంటనే పిలిపించండి! ఆయనొచ్చి, ఈ అమ్మాయి తన కూతురే అని చెప్తే - మీరు నాకు ఎలాంటి శిక్ష వేసినా ఒప్పుకుంటాను! ఒకవేళ.. ఈ అమ్మాయి తన కూతురు కాదని చెప్తే -మీ మీద నేను పదిలక్షలు పరువునష్టం దావా వేస్తాను ...సరేనా? " - ఛాలెంజ్ చేస్తున్నవాడిలా అడిగాడు.

"మీరు వేసే దావాలు మా దగ్గర చెల్లవు బాబూ! కంప్లయింట్ వచ్చినప్పుడు ఎవరినైనా సరే - స్టేషన్‌కి తీసుకెళ్ళి ఆరాతీసే అధికారం మాకుంది." మొండిగా చెప్పి శ్రీరామ్ చేతికి బేడీలు వేసేందుకు ముందుకొచ్చాడు ఇన్‌స్పెక్టరు.

అంతవరకూ ఎంతో ధైర్యంగా నిలబడిన అశ్విని-'బేడీలు' చూడగానే బేలగా మారిపోయింది. గభాల్న శ్రీరామ్ గుండెలపై వాలిపోయింది.

"సారీ శ్రీరామ్ !?. ఇదంతా నావల్లే జరిగింది. పుట్టినరోజు కానుకగా నన్ను 'హనీమూన్' తీసుకెళ్ళమంటూ - మూర్ఖంగా నేను బలవంతం చేయటం వల్లనే జరిగింది." అంటూ కన్నీళ్లు పెట్టుకుంది.

ఆ కన్నీళ్లు చూసిన ఇన్‌స్పెక్టరు కొంచెం మెత్త బడ్డాడు.. నిజంగా వాళ్ళిద్దరూ భార్యాభర్తలేనేమో నన్న అనుమానం కూడా కలిగింది. శ్రీరామ్ చేతికి బేడీలు వేసే ప్రయత్నం విరమించుకున్నాడు-

"ఊఁ! సరే! ఈ ఊళ్లో మీకు తెలిసినవారెవరైనా వుంటే చెప్పండి! ...ఫోన్ చేసి వాళ్లని ఇక్కడికి పిలిపిస్తాను! వాళ్లొచ్చి.., మీరిద్దరూ భార్యాభర్తలని 'సర్టిఫై' చేస్తే - ఒదిలేస్తాను!" అన్నాడు ఓ నిర్ణయానికొచ్చినవాడిలా..

వెంటనే అశ్విని అంది శ్రీరామ్‌తో..

"శ్రీరామ్! ఈ ఊళ్లో మీ నాన్నగారి ఫ్రెండెవరో వున్నారని చెప్పావుగా!"

శ్రీరామ్ కూడా చటుక్కున గుర్తుకు తెచ్చుకున్నాడు -

"ఆఁ! వున్నారు సార్... చిదంబరంగానీ - క్రిమినల్ లాయరు ! లబ్బీపేటలో వున్నారు.." -అంటూ గబగబా తన బ్యాగ్ లోని డైరీ తీసి - అందులోవున్న చిదంబరం 'ఫోన్ నంబరు' -వేరే కాగితం మీద రాసిచ్చాడు.

"ఆల్ రైట్ ! రిసెప్షన్‌లోంచి ఫోన్ చేసి పిలుస్తాను!" అంటూ ఇన్‌స్పెక్టరు బయటకు నడిచాడు. కానిస్టేబులు మాత్రం రూమ్ బయట 'కాపలా' గా నిలబడ్డాడు.

"ఛ... మనం బయల్దేరిన వేళ బాగోలేదు! అందుకే ఇలా జరిగింది. ఈ హనీమూన్ హాయిగా మా ఇంట్లో జరుపుకున్నా బావుండేది!" కన్నీళ్లు తుడుచుకుని మంచం మీద కూర్చుంటూ అనుకుంది అశ్విని.

"నేనూ అలాగే అనుకున్నాను! కానీ మా నాన్న వట్టి అనుమానం మనిషి... మన మీద అడుగడుక్కీ నిఘా వేసే రకం! మా స్కూలు బంట్రోతు వీరయ్యను నాకు ఎస్కార్టుగా వేసి... మధ్యలో మీ ఇంట్లో మజిలీ వేసినట్టు ఏ గూఢచారి ద్వారానో ఆయనకు తెలిసిందంటే - నానా రభసా జరుగుతుంది!"- చెప్పాడు శ్రీరామ్.

"అదీ పాయింటే ... ఇపుడింతకీ ఆ చిదంబరంగారు ఇంట్లో వుంటారో - ఉండరో?" దిగులుగా చూసిందామె.

"తప్పకుండా వుంటారు అశ్వినీ! మనం అగ్నిసాక్షిగా పెళ్ళి చేసుకున్నవాళ్ళం... ఆ అగ్నిదేవుడే మనల్ని కాపాడుతాడు... నువ్వేం దిగులుపడకు!"

"కానీ -మీ ఊళ్లోవున్న తన పొలాలు చూసుకునేందుకు - ఆయనగారు అప్పుడప్పుడు వస్తూంటారని చెప్పావ్ కదా? అలా వచ్చినప్పుడు ఎప్పుడైనా - ఈ విషయంతా మావయ్యగారికి చెప్పేస్తారేమో.."

"అదంతా నేను చూసుకుంటానుగా.. నువ్వేం దిగులుపడకు! ముందీ గండం గడవనియ్!" ఆమె భుజం తట్టి ధైర్యం చెప్పాడు శ్రీరామ్.

మరో అయినిమిషాలు బరువుగా గడిచాయి..

అంతలోనే ఇన్‌స్పెక్టర్‌తో సహా చిదంబరం హడావిడిగా ఆ రూమ్ లోకి వచ్చాడు..

"నమస్తే అంకుల్!" అతని రాకకోసమే ఆత్రంగా ఎదురుచూస్తున్న శ్రీరామ్ ఉత్సాహంగా అతనికి ఎదురేగేడు. అశ్విని కూడా ఆయనకు మర్యాద పూర్వకంగా నమస్కరించింది.

"మీరటోయ్? -ఎవర్నో గుర్తుపట్టాలి, అర్జంటుగా రండంటూ ఇన్‌స్పెక్టర్ ఫోన్‌చేస్తే - ఖంగారు పడుతూ వచ్చాను.. ఇంతకీ మీరెపుడు వచ్చారు?"ఆశ్చర్యంగా చూస్తూ అడిగేడు చిదంబరం.

"ఇంతకు ముందే - ఓ గంటయింది అంకుల్!"

"అయితే వీళ్లు మీకు తెలుసునన్నమాట !" తేలిగ్గా నిట్టూర్చి అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నాకు తెలుసో, తెలియదో పక్కన పెట్టండి... అసలు మీరు -వీళ్ళిద్దర్నీ ఎందుకు అనుమానించారో ఆ విషయం చెప్పండి! అయినా ఊళ్లో అనేక చోట్ల తప్పుడు పనులు జరుగుతూంటే - వాటిని పట్టించు కోకుండా -ఈ 'స్టార్ హోటల్' పైన దాడి చేస్తారా? దిసీజ్ టూమచ్.. !" కోపంగా చూశాడు చిదంబరం ఇన్‌స్పెక్టరు వైపు.

"మేం దాడి చేయడం కాదుసార్! ఈ హోటల్ మేనేజరే మాకు రిపోర్టిచ్చాడు!" అంటూ జరిగిన విషయమంతా చెప్పి -పేపరు ప్రకటన కూడా చూపించాడు ఇన్‌స్పెక్టరు.

"సరే ! ఇపుడు ఆ పేపర్లో అమ్మాయీ, ఈ అమ్మాయీ ఒకరే కాదని - నేను చెప్పాను కదా ఇక మీరు వెళ్ళిరండి!"

"సారీసార్ !.. సారీ ఫర్‌ది ఇన్‌కన్వీనియన్స్!" అంటూ చిదంబరానికీ, శ్రీరామ్‌కీ చెప్పి - కానిస్టేబుల్‌తో సహా నిష్క్రమించాడు ఇన్‌స్పెక్టరు...

"అది సరే కానీ శ్రీరామ్ !.. లబ్బీపేటలో మాకు లంకంత మేడ వుంటే -మీరు బెజవాడవచ్చి -అక్కడకు రాకుండా ఈ హోటల్లో బస చేయటం ఏమిటీ? ఈ విషయం మీ నాన్నకి తెలిస్తే నిన్నూ -నన్నూ కలిపి తన బహుభాషా ప్రావీణ్యంతో ఉతికి ఆరేస్తాడు తెలుసా?" అక్కడున్న సోఫాలో కూర్చుంటూ మందలింపుగా చూస్తూ అన్నాడు చిదంబరం.

ఏమి బదులు చెప్పాలో అర్థంకాలేదు శ్రీరామ్‌కి...

"అదికాదు బాబాయ్ గారూ... ఏదో సరదాగా రెండు రోజులు ...ఇలా..!" అంటూ, అశ్విని కల్పించుకుని చెప్పబోయి -మళ్లీ సిగ్గుపడి ఆగిపోయింది.

"అది సరే ! ..మీరు అసలీ వూరు ఏం



పనిమీద వచ్చారూ.. అని..”

శ్రీరామ్ అశ్వనీ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు..

చిదంబరం 'లాయర్ బుర్ర' కి విషయం బోధపడింది. భళ్లున నవ్వేస్తూ అన్నాడు మళ్లీ-

“ఓకే! ఓకే!.. అర్థమైపోయింది లెండి.. ఏదో సరదాగా రెండ్రోజులు ఒంటరిగా -అయ్‌మీన్.. 'జంట'గా గడుపుదామని వచ్చారు.. అవునా?”

విషయాన్ని వివరించక తప్పలేదు శ్రీరామ్‌కి. పెళ్ళయిన మర్నాడు తమ ఇంటికి స్వామీజీ ఎవరో వచ్చి- తన తండ్రిని కలిసి మాట్లాడిన వైనం మొదలు - తన తండ్రి తమపై విధించిన ఆంక్షల వరకూ- అంతా పూస గుచ్చినట్టు చిదంబరానికి చెప్పేశాడు.

“సరే .. మీ హనీమూన్ మా ఇంట్లో జరుపుకుందురుగాని... బయల్దేరండి” అన్నాడు చిదంబరం సోఫాలోంచి లేస్తూ..

“మీకెందుకు అంకుల్ .. ఇబ్బంది ?” మొహమాట పడుతూ చెప్పాడు శ్రీరామ్.

“నాకేం ఇబ్బంది లేదు.. నేనూ మీ ఆంటీ ఆనక హైదరాబాద్ వెడుతున్నాం. మళ్లీ ఎల్లుండి వస్తాం! అంతవరకూ మా ఇల్లు ఫ్రీ - కమాన్ మై బోయ్” అంటూ వాళ్ళ బ్రీఫ్‌కేసు అందుకున్నాడు చిదంబరం. పదినిమిషాల్లో వాళ్లెక్కిన కారు లబ్బీపేటలో - చిదంబరం మేడ ముందు ఆగింది.

మరో అరగంటలో -శ్రీరామ్, అశ్వినీ శోభనానికి అన్ని ఏర్పాట్లూ జరిగిపోయాయి!

* * *

విశాఖపట్నం వెడుతున్నట్టుగా, ఇంట్లో చెప్పి- బెజవాడలో 'బ్రేక్ జర్నీ' చేసి అశ్వినితో 'హనీమూన్' పూర్తిచేసుకుని-మూడోరోజు పొద్దున్నే ఇంటికి తిరిగి వచ్చిన శ్రీరామ్- తండ్రికి ఎలాంటి అనుమానం రాకుండా అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాడు.

అశ్విని పుట్టినరోజు సందర్భంగా, బెజవాడ చందనాబ్రదర్స్‌లో ఆమెకు కంచిపట్టుచీర కొనిపెట్టి - పనిలో పనిగా, తనుకూడా పక్కనే వున్న 'రెడీమేడ్' షాపులో బట్టలు తీసుకున్నాడు. పెళ్లికి వెళ్ళినందుకు, విశాఖపట్నంలో తన ఫ్రెండు బట్టలు పెట్టాడని వాటినే - తండ్రికి చూపించాడు. బెజవాడ సూపర్‌మార్కెట్లో కొన్న జీడిపప్పు పొట్లాన్ని తల్లిచేతిలో పెట్టి - 'విశాఖపట్నంలో జీడిపప్పు 'చీప్' కదా అని తీసుకొచ్చాను' అని చెప్పాడు.

పుట్టింట్లో శ్రావణ శుక్రవారం నోము నోచుకున్నాక -పదిరోజులకు అశ్విని కూడా తిరిగి వచ్చింది.

తల్లితండ్రుల్ని నమ్మించి - పకడ్బందీగా తమ పథకాన్ని అమలు జరుపుకున్నందుకు శ్రీరామ్ హాయిగా ఊపిరిపీల్చుకున్నాడు.

మళ్లీ మామూలుగా గడిచిపోతున్నాయి...

బెజవాడలో అనుభవించిన హనీమూన్ తాలూకు మధురక్షణాల్ని మననం చేసుకుంటూ ఇంకో ఆర్నెల్లూ గడిపేస్తే -స్వామీజీ విధించిన గడువు పూర్తయిపోతుంది. అప్పుడిక మళ్ళీ ప్రతిరోజూ తమకు హనీమూనే - అనుకున్నాడు శ్రీరామ్ పరవశంగా.

అయితే ఆ పరవశం, ఆ మధురాలోచనలూ ఆట్టేరోజులు నిలవలేదు. ఓ రోజు పొద్దున్న -ముఖం కడుక్కుని కాఫీ తాగుతున్న అశ్వినికి హఠాత్తుగా కళ్లు తిరిగినట్లనిపించింది... తూలిపడబోయి.. పక్కనున్న గోడ పట్టుకుని నిలదొక్కుకుని ఆ తర్వాత 'బాత్‌రూం' లో వాంతి చేసుకుంది.

ఇదంతా చూసిన పార్వతమ్మ కంగారుపడిపోయింది. అప్పటికే వీరభద్రం, శ్రీరామ్ స్కూల్‌కి వెళ్లిపోయారు. టౌనుకెళ్లి ధాన్యం ఆడించుకు రావటానికి బస్తాల్ని బండిలోకి ఎక్కిస్తున్న నారాయణ కనిపించా డామెకు.

“అర్జంటుగా వెళ్ళి మనూరి ఆరోగ్య కేంద్రంలో డాక్టరమ్మ వుంటుంది తీసుకురా” అంటూ పురమాయించింది. కోడల్ని జాగ్రత్తగా వెంటపెట్టుకుని వెళ్లి గదిలో మంచంమీద పడుకోబెట్టింది.

మరోపదినిమిషాల్లో డాక్టరమ్మ వచ్చింది. మంచం మీద నీరసంగా పడుకుని వున్న అశ్వినిని పదినిమిషాలపాటు క్షుణ్ణంగా పరీక్షించి, ఆ తర్వాత ఏదో అర్థమైనట్టుగా ముసిముసి నవ్వులు నవ్వుకుంది.

“ఏమైంది డాక్టర్ ?” ఆత్రంగా అడిగింది అశ్విని.

“చదువుకున్న ఆడపిల్లవి.. పెళ్లిచేసుకుని అత్తారింటికి కాపురానికొచ్చాక ఏమౌతుందో ఆ మాత్రం గ్రహించుకోలేవా?” ముసిముసిగా నవ్వుతూనే - గొప్పగా అడిగింది డాక్టరమ్మ.

అశ్వినికి ఒళ్లు మండిపోయింది..

“అత్తారింటికి కాపురానికి రావటానికీ - నాకు కళ్లు తిరిగి వాంతి కావటానికీ సంబంధమేమిటో?” కోపంగా చూస్తూ అడిగింది.

“నువ్వు తల్లివి కాబోతున్నావమ్మా! కంగ్రాచ్యులేషన్స్” డాక్టరమ్మ ఉత్సాహంగా అశ్విని భుజం తట్టి చెప్పింది.

తన తలపై పిడుగు పడినట్టుగా ఉలిక్కిపడింది అశ్విని.

అలాంటి పరిస్థితి రాకుండా చూసుకోవాలనే - ఆరోజు తన పుట్టింటికి వెడుతూ, ఆరోగ్యకేంద్రం దగ్గర కారు ఆపుకుని- ఆ డాక్టర్నే అడిగి 'పిల్స్' తీసుకెళ్లింది! 'హనీమూన్' లో వాటిని వాడిన కారణంగానే - తమకు గర్భం రాదన్న విశ్వాసంతో - నిర్భయంగా ఇప్పుడు 'పరీక్ష' చేయించుకుంది.....

కానీ... జరిగిందేమిటీ?

ఒకవేళ... లేడీడాక్టర్ తనకు సరిగ్గా పరీక్ష చేయలేదా? ..లేక తను వాడిన ఆ మాత్రలు పనిచేయలేదా.. ? ఈవిషయం మూడో మనిషికి తెలిస్తే -ఇంట్లో మూడో ప్రపంచయుద్ధం జరిగిపోతుంది..!

గబగబా మంచందిగి వెళ్లి- తమ సంభాషణ అత్తగారు వినకుండా -ఆ గది తలుపులు మూసేసింది అశ్విని..

“ఇకనించీ నీ ఆరోగ్యాన్ని జాగ్రత్తగా చూసుకోవాలమ్మా! నెలనెలా మా ఆరోగ్యకేంద్రానికొచ్చి చెకప్ చేయించుకోవాలి. పళ్లూ, పాలు బాగా తీసుకుంటూండు.” తన మెడికల్‌కిట్ సర్దుకుంటూ చెప్తోంది డాక్టరమ్మ.

“చాల్లెండి..మీ సలహాలు! పల్లెటూరి డాక్టర్లంటే - ప్రజల్లో ఇందుకే నమ్మకం లేకుండా పోతోంది... ప్రతి చిన్నరోగానికి పట్నాలకు పరుగులు తీస్తున్నారు!” విసుక్కుంది అశ్విని.

“వాట్ డూయూ మీన్?” అసహనంగా చూస్తూ అడిగింది డాక్టరమ్మ.

“మీ 'డయోగ్నసిస్' తప్పంటున్నాను! ఇప్పట్లో నేను తల్లిని కాకూడదని, 'పిల్స్' వాడాను... అవికూడా ఆరోజు మీరే ఇచ్చారు” చెప్పిందామె.

ఈసారి షాకవటం డాక్టరు వంతైంది.

-(ఇంకావుంది)



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం



ఆ నాయిక, నాయకుడూ ప్రేమించుకున్నారు. నాయిక కలవారి కూతురు. నాయకుడు ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవం తన సంపదలనుకునే గుణసంపన్నుడు. కూతురి ప్రేమను కాదనలేక పేదవాడితో ఆమె పెళ్లి జరిపించి, అల్లుడిని ఇల్లరికం తెచ్చుకుంటుంది ఆ పిల్ల తల్లి. తనకు నచ్చినట్టు కూతురి పెళ్ళి జరగలేదన్న కోపాన్ని ఆమె అల్లుడిమీద చూపిస్తూ ఉంటుంది. తల్లికీ, భర్తకూ మధ్య నలిగిపోతూ ఉంటుంది నాయిక. ఆమె తండ్రి, భార్య మాటను కాదనలేని స్థితిలో ఉంటాడు.

అత్తగారికీ, అల్లుడికీ మధ్య జరిగిన ఘర్షణ ఫలితంగా అతను కోపగించుకొని తమ కవల పిల్లలలో ఒక అమ్మాయిని తీసుకుని ఇల్లు విడిచి వెళ్లిపోతాడు. తల్లి దగ్గర అమ్మమ్మ పోషణలో గారాల కూచిగా ఒకపిల్ల, తండ్రి దగ్గర ఆదర్శ బాలికగా రెండవ పిల్ల పెరుగుతుంటారు.

నాయికా, నాయకులు విడిపోయినా వాళ్ల అనురాగం తరిగిపోలేదు. ఒకరి నొకరు తలుచుకుంటూ బాధపడుతూ ఉంటారు.

'కుళందైయుం దైవముం' తమిళ చిత్రంలోనూ, ఆ చిత్రం ఆధారంగా నిర్మించిన 'లేతమనసులు' చిత్రంలోనూ నాయికా నాయకుల ఎడబాటును, వాళ్ల బాధను వివరించడానికి అన్ని సన్నివేశాలలో పాటకు చోటు కల్పించారు.

ప్రేమ మొదలయినప్పుడు 'అన్బుళ్ళ మాన్‌విళియే' (తెలుగులో అందాల ఓ చిలకా) అని నాయకుడు పాట మొదలు పెడితే నాయిక 'అన్బుళ్ళ మన్నవనే' (తెలుగులో అందాల చెలికాడా) అని బదులు చెప్పింది. ఎవరికి వారుగా విడివిడిగా భారంగా బతుకున్న సందర్భంలోని పాటను నాయిక 'అన్బుళ్ళ మన్నవనే' (అందాల చెలికాడా) అని మొదలు పెడుతుంది.

తమిళ చిత్రంలోని శోక గీతాన్ని రాసిన వారు 'వాలి'. అసలు పేరు రంగరాజన్. ఆయన స్వస్థలం తమిళనాడులోని పుణ్యక్షేత్రమైన శ్రీరంగం. రంగరాజన్‌కు చిన్నప్పట్నించి బొమ్మలు గీసే సరదా ఉండేది. ప్రముఖ తమిళ పత్రిక 'ఆనంద వికటన్'లో ఆ రోజుల్లో 'మాలి' అనే పేరుతో ప్రసిద్ధులైన చిత్రకారుడు పనిచేస్తుండే వారు. 'మాలి'లాగా తాను చిత్రకారుడు కావాలని 'రంగరాజన్' తమ అసలు పేరును కాక 'వాలి' అనే పెట్టుడుపేరుతో చిత్రలేఖనం ప్రారంభించారు. ఆ ఊపులో మద్రాసు వచ్చి ప్రసిద్ధమైన మద్రాసు చిత్ర, శిల్పకళల బోధనా సంస్థలో చేరారు. ప్రముఖ కళాకారులు దేవీప్రసాద్ రాయ్‌చౌధురి గారి నేతృత్వంలో పనిచేస్తూ ఆ సంస్థలో కొన్నేళ్ళు చిత్రకళాభ్యాసం చేసి మధ్యలో ఆ చదువు మానేసి శ్రీరంగం వెళ్ళిపోయారు 'వాలి'.

శ్రీరంగంలో ఆయన ఓ తమిళ లిఖిత పత్రిక ప్రారంభించారు. ఆ పత్రికలో ఆయన గీసిన బొమ్మలు ఉండేవి. ఇలా ఉండగా -ప్రముఖ రచయితా, 'కల్కి' తమిళ పత్రికా సంపాదకులూ అయిన 'కల్కి' కృష్ణమూర్తిగారు 'వాలి' రచనా ప్రతిభను గుర్తించి ఆ యువకుడికి తగిన

చిత్రం : కుళంధైయుం ధైవముం  రచన : వాలి
సంగీతం : విశ్వనాథన్  గానం: టి.ఎం.సౌందర్రాజన్, సుశీల

ఆ: అన్బుళ్ళ మన్నవనే ఆ శైయిల్ ఓర్ కడిదం
నాన్ కైగళిల్ ఎళుదలిల్లై
అధై కణ్ణీరిల్ ఎళుది వందేన్
అ: నలం నలందానా ముల్లై మలరే
సుగం సుగందానా ముత్తుచ్చుడరే
ఇళైయ కన్నియిన్ ఇధై మెలిందదో
ఎడుత్త ఎడుప్పితే నడై తళర్న్దదో
వణ్ణప్ పూంగొడి వడివం కొండదో
వాడై కాట్రిలే వాడి నింద్రదో
అన్బుళ్ళ మాన్‌విళియే ఆ శైయిల్ ఓర్ కడిదం
నాన్ ఎళుదువ దెన్న వెంద్రాల్
ఉయిర్ కాదలిల్ ఓర్ కవిధై
ఆ: నలం నలందావే నీ ఇరుందాల్
సుగం సుగంతానే నినై విరుందాల్
ఇధై మెలిందదు ఇయర్కై, అల్లవా
నడై తళర్న్దదు తనిమై యల్లవా
వణ్ణప్పూంగొడి పెణ్మైయల్లవా
వాడవైత్తదుం ఉణ్మై యల్లవా
అ: అన్బుళ్ళ మాన్ విళియే
ఆ: ఆశైయిల్ ఓర్ కడిదం
అ: నాన్ కైగళిల్ ఎళుదవిల్లై
ఆ: అధై కణ్ణీరిల్ ఎళుది వందేన్



సాయం చేయమని అప్పటి తిరుచిరాపల్లి ఆకాశవాణి కేంద్రంలోని అధికారులకు చెప్పారు.

ఆ మాట సాయంతో 'వాలి' ఆకాశవాణిలో అడపాదడపా రోజుకు ఇంత రుసుము అనేపద్ధతి మీద కొన్నేళ్ళు సేవ చేశారు. అప్పట్లో ఆయన నాటక రచన కూడా ప్రారంభించడంతో నాటకాలాడే చాలా సంస్థలు, అతని చేత ఎన్నో నాటకాలు రాయించుకున్నారు. ప్రముఖ తమిళనటుడు కీర్తిశేషులు వి.గోపాలకృష్ణన్ ప్రేరణతో 'వాలి' చలనచిత్రరంగ ప్రవేశం చేశారు. ప్రముఖ చిత్ర దర్శకులు కె.ఎస్.గోపాలకృష్ణన్, సంగీతదర్శకులు ఎం.ఎస్.విశ్వనాథన్ - 'వాలి'ని ఎంతో ప్రోత్సహించసాగారు.

1958లో వెలువడిన 'అళగర్ మలై కళ్ళన్' (అళగర్ కొండ దొంగ) చిత్రంతో 'వాలి' చలనచిత్ర రచయిత అయ్యారు.

చిత్రగీత రచయితగా 'వాలి'కి పేరు తెచ్చిన చిత్రం 'ఎంగవీట్టు పిళ్ళై'! 'రాముడు-భీముడు' తెలుగుచిత్రం ఆధారంగా విజయాసంస్థ ఎం.జి.ఆర్. కథానాయకుడిగా నిర్మించిన ఆ చిత్రం కోసం 'వాలి'రాసిన 'నాన్ ఆణై యిట్టాల్' (నేను ఆజ్ఞాపిస్తే) అనేపాట ఎంతో ప్రాచుర్యం పొందింది. ఆ చిత్రం కోసం 'వాలి' రాసిన వలపు పాటలు ఎన్నో చర్చలకు గురయ్యాయి.

'నాన్ ఆణై ఇట్టాల్' పాట తర్వాత అనేక చిత్రాలలో ఎం.జి.ఆర్. వ్యక్తిత్వాన్ని ప్రశంసించే తీరులో ఎన్నో పాటలు రాశారు 'వాలి'. ఎం.జి.ఆర్. సొంతంగా రాజకీయ పక్షాన్ని ప్రారంభించిన తర్వాత ఆ పాటలు- ప్రచారానికి బాగా పనికి వచ్చాయి. 'వాలి' ఎం.జి.ఆర్ చిత్రాలకే కాక శివాజీగణేశన్ చిత్రాలకూ పాటలు రాశారు. 'వాలి' దాదాపు 6,500 చలన చిత్రగీతాలు రాశారని అంచనా. వాటిలో దాదాపు రెండు వేల పాటలకుపైగా ఎం.ఎస్.విశ్వనాథన్ సంగీత దర్శకత్వంలో వెలువడిన చిత్రాల కోసం రాసినవే.

'కుళందైయుం దైవముం' తమిళ చిత్రం కోసం 'వాలి' రాసిన విరహగీతాన్ని పి.సుశీల, టి.ఎం.సౌందరరాజన్ గానం చేశారు.

తమిళ చిత్రంలోని సన్నివేశంలో నాయికా, నాయకుల పాత్రలు పోషించిన వారు జమున,జయశంకర్.

ఈ తమిళగీతం లోని భావాలు ఇవి:

ఆ: ప్రియమైన రాజా ఆశగా (ప్రేమతో) ఒక లేఖ
నేనా చేతులతో (చేత్తో)రాయలేదు
దాన్ని కన్నీట రాసుకు వచ్చాను (రాస్తున్నాను)
అ: క్షేమం క్షేమమేనా జాజిపువ్వా
సుఖం సుఖమేనా ముత్యాల జ్వాలా
లేత కన్నె నడుము సన్న బడిందో
అడుగు పెట్టగానే నడక తడబడిందా
రంగుల పూలతీగ ఆకారం ధరించిందా
వడగాలిలో వాడి నిలిచిందా (వాడిపోయిందా)
అందాల హరిణాక్షీ ప్రేమతో ఒకలేఖ
నేను రాస్తున్నదేమంటే-
ప్రాణప్రదమైన ప్రేమతో ఒక కవిత
ఆ: క్షేమం క్షేమమే కదా నీ వుంటే
సుఖం సుఖమే కదా గుర్తుంటే
నడుము సన్నబడడం సహజంకదా
నడక తడబడడానికి (కారణం) ఏకాంతం (ఒంటరితనం) కదా
రంగుల పూలతీగ స్త్రీత్వం కదా
వాడిపోయేలా చేసిందీ నిజమేకదా
అ: ప్రియమైన హరిణాక్షీ
ఆ: ప్రేమతో ఒక లేఖ
అ: నేను చేత్తో రాయలేదు (రాయడంలేదు)
ఆ: దాన్ని కన్నీట రాస్తున్నాను

నాయికా, నాయకులు ఆనందంగా పాడుకొన్న పాటలో 'క్షేమం క్షేమమేనా', 'సుఖం- సుఖమేనా', అని అర్థాలు చెప్పుకొన్న ఈ శోకగీతంలో

చిత్రం : లేతమనసులు
రచన : దాశరథి
సంగీతం : విశ్వనాథన్
గానం : పి.బి.శ్రీనివాస్, సుశీల

ఆ: అందాల చెలికాడా అందుకో నాలేఖ
నా కన్నీట వ్రాశాను ఈ మదిలోన దాచాను
అ: తళతళలాడే నీ కనులు
వెల వెల బోయిన వెందుకనీ
కురులు మోముపై వాలె నెందుకో
అడుగు తడబడె చిలకకేలనో
పెదవి వణకెను చెలియ కెందుకో
అందాల ఓ చిలుకా అందుకో నా లేఖా
నా మదిలోని కథలన్నీ ఇక చేరాలి నీ దాకా..
ఆ: వలచిన వాడే రానపుడు
వెల వెల బోయే నా కనులు
కురులు మోముపై వాలె కలతలో
విరులు కురులలో వాడె బాధతో
అడుగు తడబడె గుండె బరువుతో
పెదవి వణకెను వలపు పిలుపుతో
అ: అందాల ఓ చిలకా
ఆ: అందుకో నా లేఖా
అ: నా మదిలోని వెతలన్నీ
ఆ: నా కన్నీట వ్రాశాను



'నలం నలందానా' అంటే 'క్షేమమేనా క్షేమమేనా' అనీ 'సుగం సుగందానా' అంటే 'సుఖమేనా సుఖమేనా' అనీ రెండేసి సార్లు అడిగినట్లు అన్వయించుకోవాలి.

ఆనందగీతం నాయకుడు ప్రారంభించగా శోకగీతం నాయిక ప్రారంభించింది. వలపు లేఖను కళ్లతో రాసుకొని వచ్చానన్న నాయిక వగపు లేఖను కన్నీటితో రాసుకు వచ్చానంటున్నది. సమాంతరంగా సాగే ఆనంద విషాదగీతాలలో వీలైనంత వైవిధ్యం కనిపించాలి. కాని ఈ పాటలలోని చరణాలలో చాలా తక్కువ తేడాలే కనిపిస్తున్నాయి.

ఆనంద విషాద గీతాలు రెండింటిలోనూ నాయకుడు పాడే భాగంలో తేడాలేదు. కాకపోతే టి.ఎం.సౌందరరాజన్ ఈ పాటను బరువుగా బాధ ధ్వనించేలా పాడారు. నాయిక కోసం సుశీల పాడిన పంక్తులూ బరువుగా సాగాయి. ఆనందగీతంలో పోల్చినప్పుడు నాయిక పాడిన పంక్తులలో 'నడక తడబడడానికి ఒంటరితనం కారణం' అనేది ఒక్కటే తేడాగా కనిపిస్తుంది.

ఆనందగీతం నాయికా, నాయకులు పెళ్లి కావడానికి ముందు పాడుకొన్నది. అందులో యువతి అయిన నాయికను 'లేత కన్నె' (ఇళైయ కన్ని) అని పేర్కొనడం సబబుగా ఉన్నా, విషాద గీతంలో 'లేతకన్నె' అనే మాటకన్నా 'యువతి' అనే అర్థం వచ్చే మాట వాడి ఉంటే బాగుండేది.

ఆనందగీతం నిడివితో పోలిస్తే ఈ విషాదగీతం కొంత కురచగా కనిపిస్తుంది.

తెలుగు వెర్షన్ గా వచ్చిన 'లేతమనసులు' చిత్రంలోని విషాదగీతాన్ని దాశరథి రాశారు. జమున, హర్‌నాథ్‌ల కోసం పి.సుశీల, పి.బి.శ్రీనివాస్ పాడారు. తమిళ చిత్రానికీ తెలుగు చిత్రానికీ ఎం.ఎస్. విశ్వనాథన్ సంగీతం సమకూర్చారు.

తమిళ గీతం కన్నా తెలుగు పాట చక్కగా ఉండడానికి ఎన్నో కారణాలు-

నాయికా, నాయకుల మధ్యగల అనుబంధం, ఒకరికొకరు దూరమైన బాధ, ఆ బాధను ఇంకెవరితోనూ పంచుకోలేని ఒంటరితనం మొదలైన వాటిని దాశరథి నాయికా, నాయకులిద్దరి ద్వారా పలికించారు.

నాయిక తన బాధ ఎవరితోనూ చెప్పుకునే పరిస్థితిలో లేదు. అందుకే ఆమె కన్నీట వ్రాసిన తన లేఖను మదిలోనే దాచుకోవలసి వచ్చింది. వలచినవాడు సరసన ఉన్నప్పుడు ఆమెలో తళతళలు, మిసమిసలు అన్నీ ఉండేవి. భర్త దూరం కావడంతో ఆమె కనులు వెలవెల బోయాయి. కలతతో కురులు మోముపై వాలాయి. బాధతో కురులలోని విరులు వాడాయి. గుండె బరువుతో అడుగు తడబడుతున్నది. ఒకప్పుడు ఆనందంతో వలపు పిలుపు వినిపించిన ఆమె, వగపుతో వలచిన వాణ్ణి పిలుస్తూ ఉంది. అప్పుడు ఆనందంతో వణికిన పెదవులు ఇప్పుడు ఆవేదనతో వణుకుతున్నాయి.

తమిళగీతంలో కన్నీరు, ఒంటరితనమూ - నాయికకు మాత్రమే పరిమితాలు. తెలుగు పాటలో నాయిక కన్నీళ్ల ప్రస్తావనతో బాటు నాయకుడి వెతల ప్రస్తావనా ఉంది. రెండు పాటలలోనూ నాయిక బాధకే ఎక్కువ ప్రాధాన్యం. అయితే తెలుగు పాటలో నాయకుడి నోట, 'నా మదిలోని వెతలన్నీ ఇక చేరాలి నీదాకా' అనిపించి -అతని మనసుకు అద్దం పట్టే ప్రయత్నం చేశారు దాశరథి. అలాగే - తమిళ గీతంలో లేని వైవిధ్యాన్ని తెలుగు పాటలోకి తెచ్చారు. తెలుగులోని ఆనంద విషాద గీతాలు రెండింటిలోనూ పల్లవిలో కొంత భాగాన్ని 'పెదవి వణికెను వలపు పిలుపుతో' అనే పంక్తినీ మినహాయిస్తే - రెండు పాటలూ వేటికవే స్వతంత్ర గీతాలు.

సౌందరరాజన్ పాటలో వినిపించే అతి నాటకీయత పాటలో వినిపించక పోవడం -తెలుగు పాటకు మరింత వన్నెను తెచ్చింది. నాయికా నాయకుల విషాదాన్ని సుశీల, శ్రీనివాస్- అతిగా కాక సన్నివేశానికి అతికేటట్టు వినిపించి- పాట విలువ పెంచారు.

-పి.ఎస్.గోపాలకృష్ణ

# బాణీ ముత్యాలు

సేకరణ : పి.గిరి, హైదరాబాద్



ఆత్రేయ

మాటలలో చిక్కుపడి మనసు నలిగిపోతుంది
మనసులేని మాటలనే మనం నమ్ముతున్నది
పలుకలేని ప్రతిగుండె బాధతో నిండినది
ఒలికే ప్రతి కన్నీటిచుక్క వెచ్చగా ఉంటుంది

చిత్రం : భార్యాబిడ్డలు
పాట పల్లవి : బ్రతుకు పూలబాట కాదు



సిరివెన్నెల

ఒంటరిగా దిగులు బరువు మోయబోకు నేస్తం
మౌనం చూపిస్తుందా సమస్యలకు మార్గం
కష్టం వస్తేనే గద గుండె బలం తెలిసేది
దుఃఖానికి తలవంచితే తెలివికింక విలువేది

చిత్రం : రుద్రవీణ
పాట పల్లవి : చెప్పాలని ఉంది
గొంతు విప్పాలని ఉంది



సుద్దాల అశోక్‌తేజ

నేలతల్లి ఒడిలోన ఉన్న పసిగరిక బెదురుతుందా
ఎంత పెద్ద సుడిగాలికైన తలవొంచి ఒదుగుతుందా
నీలిమబ్బులతో మేలమాడగల మర్రికొమ్మకూడా
పిల్లగాలి కొనవేలు తగిలినా వణికి ఊగిపోదా
బడబాగ్నితో కడుపురగిలినా
బయటపడని కడలిగుణం
పడమరలో మునిగిన రవినే
తూర్పున తేల్చే గొప్పతనం
ఓ మిణుగురంత మిగిలున్న చాలు
చీకటి చీల్చే ఆశాకిరణం

చిత్రం : ఆవిడే శ్యామల
పాట పల్లవి : ఓ గమ్యమున్న చరణం అది సవ్యమైన చలనం



దేవిశ్రీప్రసాద్

ఓడిపోవటం తప్పుకాదురా
చచ్చిపోవడం తప్పు సోదరా
జీవితం అంటే జోక్ కాదురా
దేవుడిచ్చిన గొప్ప గిఫ్టురా
దాన్ని మధ్యలో కతమ్ చేసే హక్కు ఎవరికీ లేదురా
నవ్వెయ్యరా చిరు చిందెయ్యరా
అరె బాధ కూడా నిన్ను చూసి పారిపోద్దిరా
దాటేయరా అడ్డు దాటేయరా
ఏ ఓటమీ నిన్ను ఇక ఆపలేదురా

చిత్రం : శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్
పాట పల్లవి : చైలా చైలా చైలా

# 'హాసం' క్లబ్ కార్యక్రమ విశేషాలు

## హైదరాబాద్



చిత్తరంజన్, విజయలక్ష్మి



'ఈ మావిపై నుండి' పాడి వినిపిస్తున్న తల్లీకూతుళ్లు వందన, స్వప్న



'నీవుండేదా కొండపై' ఫ్లూట్‌పై వాయిస్తున్న జ్ఞానేశ్వర్



క్రికెట్ స్టేడియం వాతావరణాన్ని మిమిక్రీ చేసి చూపుతున్న రవి

**30 .10. 04**

నాటి సమావేశం ఎప్పటిలాగానే జోక్స్‌తో, పాటలతో ఆహ్లాదంగా గడిచింది. గాయకుడు, సంగీతకారుడు చిత్తరంజన్ ఎస్. రాజేశ్వరరావు, ఎన్.డి.బర్మన్‌ల గురించి ఇచ్చిన సోదాహరణ ప్రసంగాలు హైలైట్‌గా నిలిచాయి.

ఆయన తన కుమార్తె విజయలక్ష్మితో కలిసి రాజేశ్వరరావు, ఎన్.వరలక్ష్మిల యుగళగీతం 'ఆనందమే లేదా' ఆలపించి, వారి గానవైశిష్ట్యాన్ని వివరించారు. ఆ తర్వాత రఫీ ఇత్యాది గాయకులచే బర్మన్ ఎంత చక్కగా పాడించారో పాడి వినిపించారు. బర్మన్ సంగీతంలో రూపొందిన 'చాంద్ ఫిర్ నిక్‌లా' పాటను విజయలక్ష్మి పాడి బహుమతి గెల్చుకున్నారు.

చిరంజీవి శ్రుతి 'ఇకనేలనే' అనే క్షేత్రయ్య కృతి పాడి మరో బహుమతి గెల్చుకున్నారు. మహిత పాడిన త్యాగరాజ కీర్తన 'ఉపచారము చేయమన్నారా' మరో హైలైట్‌గా నిలిచింది.

సభ నిర్వహించిన యస్వీ రామారావు ఎస్.రాజేశ్వరరావు జీవితవిశేషాలను తెలుపగా ఆయన పాడిన 'చల్లగాలిలో' అనే క్లిష్టమైన పాటను చిరంజీవి చైత్ర అలవోకగా పాడి సభను ఆనందపరిచారు. మాల 'ఏమని పాడెదనో ఈ వేళ' పాడారు.

**నవంబరు కార్యక్రమం 27 న ఆంధ్ర బాలానందసంఘంలో జరుగుతుంది.**

## వినబడ్డ జోక్స్

విమానాల్లో ప్రయాణించినపుడు పక్కసీటులో ఏడ్చే పసిపిల్లలు తగిలారంటే ఇక ఆ ప్రయాణం ఏడిసినట్టుగానే సాగుతుంది. ఆ విషయం తెలిసిన ఎయిర్‌పోర్టు క్లర్క్‌లు బోర్డింగు పాస్ ఇచ్చేటప్పుడు ప్రయాణికులకు హామీలిస్తూంటారు.

ఓ రోజు ఒకాయన క్యూలో తన వెనుకనే నిలబడివున్న తల్లిని, ఏడిచే పిల్లని చూస్తూ నుదురు కొట్టుకోవడం చూసి క్లర్క్ ఓదార్చబోయాడు - 'మరీ ఇదవకండి. ఇంతా చేసి ఆ పిల్లాడి సీటు మీ పక్కకి రాకపోవచ్చు. మూడునాలుగు వరసల తర్వాత వచ్చిందనుకోండి. అప్పుడు మీకు బాధ ఉండదుగా" అని.



జోక్స్ చెప్పి నవ్విస్తున్న జెన్నీ

ఆయన చికాకుపడ్డాడు- "ఊరుకోవయ్యా, పెద్ద తెలిసున్నట్టు చెప్పొచ్చావ్! వాడు మా అబ్బాయే! వాడి సీటు నా పక్కన కాక వేరెక్కడ వస్తుంది!?"

★ ఓ డాక్టరు గారు ఓ దీవిలో చిక్కుకుపోయాడు. 'హెల్ప్' అని ఓ బోర్డు మీద రాసి ఒడ్డున పాతిపెట్టాడు. పడవల వాళ్లెవరైనా చూడకపోతారా. రక్షించకపోతారా అని ఆయన ఆశ!

కానీ ఎవరూ రాలేదు, రక్షించలేదు. ఎందుకో తెలుసా?

ఆయన హేండ్‌రైటింగ్ ఎవరికీ అర్థం కాలేదు కనుక!

★ నాలుగేళ్ల చిట్టి ఇంటికి వాళ్ల నాన్నగారి ఫ్రెండు ఓ పెద్దకుక్కను వెంటబెట్టుకు వచ్చారు. చిట్టిని ఇంప్రెస్ చేద్దామని, "పాపా, మా కుక్క పేరేమిటో తెలుసా? సీజర్, గీజర్ లాటి ఇంగ్లీషు పేరు కాదు. చక్కగా 'విక్రమాదిత్య!" అన్నాడాయన. "ఓహో" అని ఊరుకుంది చిట్టి.

చిట్టి ఆనందించినట్టు కనబడకపోవడంతో ఆయనకు అనుమానం వచ్చింది - "ఇంతకీ విక్రమాదిత్య అంటే ఎవరో నీకు తెలుసా?" అని అడిగాడు.

"తెలియకపోవడమేం? ఇప్పుడే చెప్పారుగా, కుక్క అని." అంది చిట్టి.

'హాసం క్లబ్' ప్రారంభించదలచినవారు సంప్రదించవలసినది
శ్రీ ఎస్.వి.రామారావు,
040-24160279,
98491 39030

## శ్రీకాకుళం

అక్టోబరు 10 వ తేదీ రెండవ ఆదివారంనాడు జరిగిన ద్వితీయ కార్యక్రమంలో ఆద్యంతం నవ్వులు విరిసాయి. పులఖండం శ్రీనివాసరావు ప్రార్థనతో ప్రారంభమయి, కన్వీనరు రామారావు, సమన్వయకర్త శాకమూరి జగదీశ్ చెప్పిన జోకులతో, ఇంద్రసేన్, రామ్మనోహర్‌ల పారడీసాంగ్స్‌తో ముందుకు సాగి ఈ సభలో సంగీతవిభాగంలో కూడా ఎన్నో ఐటమ్స్ హైలైట్స్‌గా నిలిచాయి. గజల్‌గాయకుడు వాసుదేవాచారి సెమీ క్లాసికల్ సాంగ్, శ్వేత హిందీపాట పాడగా సముద్రాల కృష్ణమాచారి హిందీపాటల స్వరకల్పనలు తెలుగులోకి వచ్చిన విధానం సోదాహరణంగా పాడి వినిపించారు.

గాయత్రీ డిగ్రీ కాలేజీ విద్యార్థులు 'రైల్వేస్టేషన్' మైమ్ చేశారు. హరికథా కళాకారులు దూసి బెనర్జీ, జెవి సోమయాజులు గొంతును మిమిక్రీ చేశారు. పియస్ మూర్తి, శ్రీనివాసబాబు, శివకుమార్, సత్యన్నారాయణ, దూసి ధర్మారావు, చక్రవర్తి, రమణ, డా॥సంపత్‌కుమార్ ప్రభృతులు పాల్గొన్న ఈ సభ విష్ణుమూర్తి వందనసమర్పణతో ముగిసింది.

**వచ్చే కార్యక్రమం నవంబరు 14న జరుగుతుంది.**

## పలాసా



అక్టోబరు 30 న జరిగిన కార్యక్రమం జైపూర్ ఆలిండియా రేడియో కళాకారిణి నుంబ్బలక్ష్మి ప్రార్థనాగీతంతో ప్రారంభమయింది. కొట్ని రమేష్, మురళీమోహన్, ఎస్‌కేవి శాస్త్రి జోక్స్ చెప్పారు. జి.దాలయ్య (మంటలు రేపే నెలరాజా) రఘురాం (గోవింద, గోవింద), శోభారాణి (కన్నీటికి కలువలు పూచెనే) రమణ(ఆదిభిక్షువు వాడినేమి) వాసుదేవనాయుడు (షిరిడియే మా పండరిపురం) ఈశ్వరపాత్రో (జాణవులే, నెరజాణవులే) పాడిన పాటలు సభికుల హర్షధ్వానాలు అందుకున్నాయి. రమేష్ జంతువుల అరువులను



మిమిక్రీ చేశారు. చీకటి కామేశ్వరరావు 'మీరజాలగలడా' పాటకు నాట్యం చేశారు. శ్రీనివాస బాబ్జీ వ్యాఖ్యాతగా వ్యవహారించారు. హాస్యనటులు మిఠాయిచిట్టి, భాగవతార్ ధర్మవురి క్రిష్ణమూర్తి, రామమూర్తి గార్ల ఆత్మశాంతికి రెండు ని॥లు మౌనం పాటించారు.

**వచ్చే కార్యక్రమం 27-11-2004 డా॥ రామినాయుడి గారి క్లినిక్‌లో జరుగుతుంది.**

## విజయనగరం

లలితకళలకు నిలయమైన విజయనగరంలో ఆంధ్రప్రదేశం అవతరణోత్సవ పర్వదినాన విజయనగరం హాసం క్లబ్ వి.కరుణ, భాను, స్వాతిల 'వక్రతుండమహాకాయం' ప్రార్థనతో ప్రారంభమయింది. మోహనరాగంలో ప్రారంభమయిన ఈ కార్యక్రమం హాస్య, సంగీత ప్రియులను సమ్మోహితులను చేసింది. అంధ విద్యార్థి మాధవ్ 'శ్రీరామచరితాన్ని' మధురంగా ఆలపించడంతో భువనవిజయంలో శ్రీకృష్ణదేవరాయలు, తెనాలి రామకృష్ణ, ధూర్జటిల మధ్య జరిగిన పద్య సంభాషణను తానొక్కడే పాడి వినిపించి బహుమతి గెల్చుకున్నారు.

న్యాయ నిర్ణేత ఇచ్చిన 'నా దినచర్య' అనే అంశంపై రెండునిమిషాలపాటు ఆంగ్లపదాలు లేకుండా కేవలం తెలుగులో మాట్లాడి, మరెన్నోజోకులు చెప్పిన మేఘమాల మరో బహుమతి గెల్చుకుంది. 'టు సర్ విత్ లవ్' నవల కథాంశాన్ని టిఎల్‌యన్ మూర్తి ఆసక్తికరంగా చెప్పారు.

కన్వీనరు యన్.కె.బాబుకు సభా నిర్వహణలో వి.వెంకటరావు, కెయస్ రాజులు సహకరించారు. తదుపరి కార్యక్రమాలు ప్రతి నెలా మొదటి మంగళవారం జరుగుతాయని తెలిపారు.

## రాబోయే సమావేశాలు

| | | | | |
|---|---|---|---|---|
| రాజమండ్రి | 21 11 04 | 6.00 pm | విక్రమహాలు | వివరాలకు- శ్రీ ఎం.వి.అప్పారావు, 2438085, 98852 15155 |
| విజయనగరం | 07 12 04 | 6.00 pm | డిస్ట్రిక్ట్ లైబ్రరీ | ॥ శ్రీ బాబు 94403 43479 |
| జగ్గంపేట | 05 12 04 | 4.35 pm | ఆర్యవైశ్య కళ్యాణ మంటపం ఎదురుగా | ॥ శ్రీ నూజిళ్ళ సూర్యనారాయణ, ☎ 234185 |
| శ్రీకాకుళం | 12 12 04 | 6.00 pm | రామలక్ష్మణ్‌హాలువద్ద, గాయత్రిస్కూల్ | ॥ శ్రీ ఓ. రామారావు ☎ 220341 |
| వైజాగ్ | 21 11 04 | 6.00 pm | ప్రేమసమాజం | ॥ శ్రీ మస్తాన్‌రెడ్డి, 2720219 |
| ఏలూరు | 21 11 04 | 6.35 pm | జిల్లా లైబ్రరీ | ॥ శ్రీ డి.రామకృష్ణారావు, 222318/9848141100 |
| హైదరాబాద్ | 27 11 04 | 6.35 pm | బాలానందసంఘం | ॥ శ్రీ ఎస్.వి.రామారావు, 24160279/9849139030 |
| పలాసా | 27 11 04 | 6.35 pm | డా॥రామినాయుడు క్లినిక్ | ॥ శ్రీ డా॥ వై.రామినాయుడు, 98486 51615 |

కార్యక్రమాల సమగ్ర వివరాలు 'హాసం క్లబ్ బులెటిన్'లో లభిస్తాయి

# కనకాభిషేకం చేయించుకున్న విదుషీమణి

# పసుపులేటి రంగాజమ్మ...

శ్రీ కృష్ణదేవరాయల పేరు స్మరించగానే
మనకి అష్టదిగ్గజాల.. కవిత సుధారసధారలూ...
కదనరంగపు కాహళీలు...
విజయనగర సామ్రాజ్య వైభవం..
కత్తులూ .....పువ్వులూ ....నెత్తురూ ... పన్నీరూ..
అన్నీ కలగాపులగమైన ఓ అద్భుత వర్ణచిత్రం కళ్లముందు మెదుల్తుంది....
సరిగ్గా.. అచ్చుమచ్చు
అదే అనుభూతి కల్గుతుంది.... రఘునాథరాయల గురించి
కొద్దోగొప్పో చదువుకున్నవారికి -
తంజావూరు!
నాయక రాజుల వైభవం.. !!
ప్రతిపద్య చమత్కారం చేసిన 'విజయవిలాస'కర్త చేమకూర వెంకట కవీ,
అల్లం వెల్లుల్లీ దట్టించి వొండిన గుత్తొంకాయ కూరలాంటి...రాధికా సాంత్వనం కవయిత్రి..... ముద్దుపళనీ...
ఓరి నాయనో. ....అదేం శృంగారం.. ప్రతీ పద్యం నిప్పు కణిక..రసగుళిక... రసికుడన్నవాడు చదివి తీరాల్సిన పుస్తకం
'ముద్దుపళని' రాధికా సాంత్వనం..
తెల్ల దొరలు.. ఈ పద్యాల విశృంఖలత్వానికి పిచ్చెక్కీ ఆ పుస్తకాన్ని రెండుసార్లు నిషేధించారుట...
తర్వాత మన తెలుగు ముఖ్యమంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారొచ్చాక... నిషేధం ఎత్తివేశారు..!
రాధికా సాంత్వనం... వెలుగులోకి మళ్ళీ వొచ్చింది!
అదిగో సరిగ్గా ఆ అస్థాన విదుషీమణే
రంగాజమ్మ...
యథారాజా తథాప్రజా అనీ!....
ఏలిక గూండా ముండాకొడుకైతే... ప్రజలంతా ఆ పద్ధతికే వొస్తారు..
రాజుగారు బుద్ధుడైతే ... అంతా ఉత్తమ మార్గాన్నే అవలంబిస్తారు.
అంచేత... రఘునాథనాయకుడి కుమారుడైన విజయరాఘవ నాయకుడు..
1633 నుంచీ 1673 వరకు అంటే ఏకంగా నలభై ఏళ్లపాటు తంజావూరిని సంగీత సాహిత్య ....కళారంగాల్లో సర్వోత్కృష్టంగా తీర్చిదిద్దాడు!
ఆయన 23 యక్షగానాలూ.. 3 ద్విపద కావ్యాలూ...
గోపికాభ్రమర గీతాలూ.. ఫాల్గుణోత్సవ రగడ.. చౌపదినీ రాజగోపాల దండకం వంటివి రచించాడనీ-
క్షేత్రయ్య ఎక్కువకాలం ఈయన ఆస్థానంలోనే గడిపినట్లు చారిత్రకాధారాలున్నాయ్!!

**కవిత రచియింప విజయ రాఘవ విభుండె**
**నేర్చునని వాణి నర్తించు నేర్పమీఱ**
**చామరానిల కందళ చలితమగుచు**
**తనరు సభయందు అల శారదాధ్వజంబు -**

అని రాశాడు చెంగల్వ కాళకవి.
అలాంటి శారదాధ్వజాన్ని... సంగీత సాహిత్యాకాశం దాకా ఎత్తి రెపరెపలాడించిన కవయిత్రి...
పసుపులేటి రంగాజమ్మ!
ఈమె తల్లి మంగమాంబ- తండ్రి వేంకటాద్రి..
ఈమెకి తెలిసిన అష్టభాషలు...
సంస్కృత, ప్రాకృత, శౌరసేని, మాగధ, పైశాచి, చూళిక,అపభ్రంశ- ఆంధ్ర..
ఈమె రచనా శైలి పరికిస్తే... క్షేత్రయ్య రాశాడేమో అన్న భ్రమ కూడా కలుగుతుంది..!
ఏంచేతంటే క్షేత్రయ్యలాంటి మహానుభావుడి పరిచయం. కళ్ళతో చూడడం వల్ల... ఆయన వాసనలు కొన్ని ఈవిడ కవిత్వానికి కంటుకోవడం సహజం.. అంటుకట్టి .... కొత్తపూలు పూయించడం సరదా!!
విజయరాఘవుని ఆస్థానానికి ఘనత తెచ్చిన కవయిత్రులలో చంద్రరేఖ, కృష్ణాజి, రంగాజమ్మలు ప్రముఖులు. వీరిలో తొలి ఇద్దరూ గ్రంథాలు రాసినట్టు తోచదు. రంగాజమ్మ మాత్రం బహుగ్రంథ కర్త్రి. వాటిలో కొన్ని...

1. మన్నారుదాస విలాసము, ప్రబంధం
2. మన్నారుదాస విలాసము (నాటకం)
3. ఉషాపరిణయము
4. రామాయణ సంగ్రహము
5. భారత సంగ్రహము
6. భాగవత సంగ్రహము..

చివరి మూడూ ఇప్పుడు అలభ్యాలు. పూర్వాంధ్ర కవయిత్రులలో ఇన్ని కృతులు రాసినవారు లేరు. మన్నారుదాస విలాసం ప్రబంధంగానూ, యక్షగానంగానూ రాసినా వాటిలో తేడా చూపించిన దిట్ట ఈమె.
ప్రబంధంలో పద్యాలు సీసాలు. నాటకానికి వచ్చేసరికి ద్విపదలు, దరువులు పాధ్రాన్యం వహించాయి.
ప్రబంధంలో నాయికా విహారం, జలకీడ్ర, విప్రలంభ వర్ణనం - ఇవన్నీ నాటకానికి వచ్చేసరికి కుదించిందామె.
పఠితలకు, నాటక ప్రేక్షకులకు గల స్థాయీభేదం, ఔచిత్యం మనసులో పెట్టుకున్నదేమో మరి!
అంతేకాదు, ప్రబంధంలో లేని ఎరుక ఘట్టం, గొల్లల ప్రసంగం, ముత్తయిదువుల ముచ్చటలు - ఇవన్నీ పాటకజనరంజకాలు కాబట్టి నాటకంలో చేర్చింది.
నవలలను తెరకనువదించే వారందరూ పరిశీలించి, అనుకరించినవలసిన టెక్నిక్ ఇది!
తంజావూరులో పుట్టిన ఉత్తమ యక్షగానాలలో మన్నారుదాస విలాసం అగ్రస్థానంలో ఉందని అంటారు విమర్శకులు.
క్రీడాభిరామంలాగా ఆనాటి ప్రజల జీవితానికి దర్పణం పట్టడంతో బాటు రాజజీవితాన్ని ప్రతిబింబించింది.
రాజు కొలువుసేయడం, విన్నపాలు అలకించడం, కొలువు సింగారం.. ఇవన్నీ అద్భుతంగా వర్ణించింది. కొలువు సింగారాన్ని వర్ణించిన విధం -
నెలత యొక్కతె చేరి నిలువుటద్దము పట్టె

జెలువ యొక్కతె యొరసిగ యొనర్చె
జంద్రాస్యయొక్కతె జాజిసరుల్ సుట్టె
జాన యొక్కతె రుమాల్ జారగట్టె
గలికి యొక్కతె దిద్దె గస్తూరి తిలకంబు
గనకాంగి యొక్కతె చౌకట్టువెట్టె
జాణయొక్కతె బురుసాహిజారును బూన్చె
సకియ యొక్కతె యరచట్ట దొడగె
దరుణియొక్కతె హరువుగా దట్టిగట్టె..

.. రాజుల జీవితాన్ని ఇంత ఇదిగా వర్ణించగలిగిందంటే రాజులతో ఎంత చనువుండి వుండాలి?

ఈమె తన గ్రంథాలలో 'నచ్యుత విజయరాఘవ సార్వభౌము ధర్మపత్నియై రంగుమీరు రంగాజమ్మ' 'తత్పట్టమహిషియై తనరినదేవి' అని చెప్పుకున్నా..

అది వట్టి మాటవరసకే!

నిజానికి పట్టపు దేవేరి కంటె ఎక్కువ మహాయోగం పట్టింది.

తన గురించి తను ఇలా చెప్పుకుంది!

విచిత్ర తర పత్రికా శతలిఖిత
వాచికార్థవగాహన ప్రవీణయు దత్పతి
పత్రికా శత స్వహస్త లేఖన ప్రశస్తకీర్తయు
శృంగార రసితరంగిత పద కవిత్వ మహనీయ
మతి స్ఫూర్తియు నతులితాష్టభాషా కవితా
సర్వంకష మనీషా విశేష విశారదయు, రాజ
నీతి విద్యావిశారదయు విజయ రాఘవ మహీ
పాల విరచిత కనకాభిషేకయు, విద్వత్కవి జన
స్తవనీయ వివేకయు -
శ్రీమద్రాజగోపాల కరుణాకటాక్ష వీక్షణానుక్షణ
ప్రవర్ధమాన సారస్వత ధురీణయు,

.. పసుపులేటి రంగాజమ్మా....



అంచేత కనకాభిషేకం అవగానే మనకి శ్రీనాధుడే కాదూ.. రంగాజమ్మ గూడ సాక్షాత్కరించాలి మనోఫలకం పైన..

నిజంగా మహిళాలోకానికి ఎంత గర్వకారణం..?

సరస్వతి నాలికమీద తాండవం ఆడుతోంటే

పార్వతీదేవిలా రంగాజమ్మ నతమస్తకంతో కూర్చోగా !

..లక్ష్మి న్వరూవం.. బంగారునాణేల రూపంలో...

కనకధార కురుస్తోంటే..

ఓహ్..! తెలుగు కళాహృదయానికి

అదెంత పులకింత....!!

'ముదితల్ నేర్వగరాని విద్య గలదే ముద్దార నేర్పింపగన్'

అన్నారెప్పుడో .. కానీ ఇప్పుడే... ముదితలే.. విద్యా వ్యవహారాలు నేర్పేస్థితికొచ్చారు!

ఉషావరిణయం అవతారికలో మృదురసాన్వదములుగ శృంగారపదాలు అనేకం రచించినట్లు తెలుస్తోంది.

తంజావూరు 'సరస్వతీ' మహల్లో రంగాజమ్మ రచనలు మరి కొన్ని వున్నాయని వినికిడి..

అలా నిక్షిప్తం చేసిన మహానుభావులకు శతకోటి వందనాలు

మళ్లీ వాటిని 'వెలుగు'లోకి తీసుకురావడానికి ఏ టంగుటూరి 'ప్రకాశమో' పుట్టడూ!!

**- తనికెళ్ల భరణి**



నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ తీరుతెన్నులపై అధ్యయనం చేసిన రచయిత, జర్నలిస్టు నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది



## తంతి తంతు

చంద్రమోహన్ తెలుగు సినిమాల్లోనే కాకుండా, మలయాళం, తమిళ చిత్రాల్లో కూడా వేశాడు. 'నాళై నమదే' అని, ఒక తమిళ చిత్రంలో నటిస్తూ వుండగా, అతని హృదయం 'ఘోష' పెట్టి, తల్లడిల్లిపోయింది. ఆ వైనం బెట్టిదనిన-

ఆ 'నాళై నమదే' అన్న సినిమా, హిందీలో వచ్చిన 'యాదోంకి బారాత్' అన్న ముగ్గురు సోదరుల సినిమాకి నకిలీ. (తెలుగులో కూడా వచ్చింది- "అన్నదమ్ముల అనుబంధం' అని) హిందీలో, తెలుగులో ముగ్గురు సోదరుల పాత్రలూ ముగ్గురు నటులు వేయగా, తమిళ సినిమాలో పై ఇద్దరు సోదరుల పాత్రలూ యమ్.జి. రామచంద్రన్ వేసి ఆఖరి సోదరుడి పాత్ర చంద్రమోహన్‌చే వేయించారు!

ఆ 'నాళై నమదే' షూటింగ్ బెంగుళూర్లో జరుగుతోంది. అదే సమయంలో, అతను హీరోగా నటిస్తున్న రామానాయుడుగారి 'ఒక చల్లని రాత్రి' షూటింగు - ఇది మద్రాసులో! బెంగుళూరు షూటింగ్ సరిగా సాగడం లేదు. ఎమ్.జి.ఆర్. ముఖ్యమంత్రి కాబోతున్న సందర్భం అది. దాంతో ఆయన ఏ సమయానికి బెంగుళూరు వచ్చి నటిస్తారో ఎవరికీ తెలియడంలేదు. ఆయనతో నటించవలసిన నటీనటులంతా, బెంగుళూర్లో క్షణక్షణం నిరీక్షణతో వున్నారు.

చంద్రమోహన్ 'ఒక చల్లని రాత్రి'కి ఇచ్చిన తేదీలు సమీపించాయి. బెంగుళూరులో తమిళ చిత్రం షూటింగు జరగడం లేదు, అయినా సినిమా కంపెనీవాళ్లు పంపడం లేదు. ఎమ్.జి.ఆర్ అంటే ప్రముఖ హీరో గనక, అతనికి అందరూ ప్రాముఖ్యత ఇవ్వవలసిందే.

"నేను ఇక్కడ ఇరుక్కుపోయాను. రావడానికి వీలు కలుగడంలేదు. అంచేత మన షూటింగ్ తేదీలకి ఆలస్యమవుతుంది" అని చంద్రమోహన్ నాయుడిగారికి వార్త అందించాడు. అందించాడే గాని, ఆనందంగా లేనే లేడు. వెళ్లకపోతే వాళ్లూ, ఉండకపోతే వీళ్లూ అక్షింతలు వేసేస్తారు. అవీ బియ్యపు అక్షింతలు కావు- రాళ్ళ అక్షింతలు!

రామానాయుడిగారికి వెళ్లిన వార్తకి 'స్పందన' లేదు. "ఆ ఎవడికోసం వస్తాడూ- కాల్‌షీట్స్ మనవి!" అనుకుని ఊరుకుని వుంటారని అనుకున్నాడు చంద్రమోహన్. ఇలా మధనపడిపోతూ వుండగా -

ధనకోటి అని మేకప్‌మన్. ప్రసిద్ధుడు. 1945 నుంచి పరిశ్రమలో వున్నవాడు. పెద్ద పెద్ద తమిళ కంపెనీలకి పనిచేశాడు. చాలాకాలం పద్మిని, రాజసులోచనల్లాంటి ప్రముఖ నటీమణులకి 'పర్సనల్ మేకప్‌మాన్'.

అతను -చంద్రమోహన్ అవస్థ పడిపోతూ వుండడం చూసి, విషయం అర్థం చేసుకుని అపారమైన 'జాలి'తో ఊరడించి, ధైర్యం చెప్పాడు.



ఆ మర్నాడు చంద్రమోహన్ అనుకున్నట్టుగా కాకుండా, వేరే విధంగా నాయుడుగారు టెలిగ్రాం పంపించారు. "నువ్వు వెంటనే షూటింగ్‌కి రావాలి. ఇక్కడ అందరం నిరీక్షిస్తున్నాం. రాకపోతే, తీవ్రపరిణామాన్ని ఎదుర్కోవలసి వస్తుంది" అన్న ధోరణిలో వుంది ఆ తంతి.

ఆ తంతి అలా నెత్తిమీద తంతే, ముళ్లు నిండిన గోతిలో పడ్డట్టయ్యాడు చంద్రమోహన్. రామానాయడుగారికెలా బోధపరచడం? ఈ తమిళ నిర్మాతకి ఎలా బాధ విడమరచడం? 'కాన్‌ఫ్లిక్ట్ సీన్' లో కొట్టుకున్నాడు హీరో. టెలిగ్రాం చూసిన తమిళ చిత్ర నిర్మాత "ముడియాదే! ఎప్పడి పో ముడియుమ్? అణ్ణా ఎంద నిమిషత్తులుం వరలాం!" అని తమిళంలో కొట్టిపారేశాడు - చంద్రమోహన్ తంతిని.

మళ్లీ పాపం, ధనకోటే చంద్రమోహన్‌ని ఓదార్చాడుగాని, తక్కిన వాళ్లెవరూ "సానుభూతి విభూతి " పుయ్యడంలేదు! అనునిత్య ఆహార ప్రియుడైన చంద్రమోహన్ రెండు అన్నం మెతుకులు కూడా మెతకలేక పోయాడు. కంటికి నిద్ర కరువైంది. వెళ్లవలసిన బాధ్యత తనది! వెళ్లకపోతే నాయుడుగారు, ఫిలిమ్ ఛాంబర్‌లో పెట్టి, నష్టపరిహారం లక్షల్లో చెల్లించమంటారు కాబోలు!

రెండు రోజులు గడిచిపోయింది. హీరో ఎమ్.జి.ఆర్ దిగారు. కలవరంలో వున్న చంద్రమోహన్ మదికి పట్టిన చంద్రగ్రహణం - విడుపు కొచ్చినట్టయింది. ఇక లాభంలేదని, నీవే తప్ప ఇతః పరం బెరగనన్నట్టుగా ఆయన్నే శరణువేడుకోవాలని, చంద్రమోహన్ ఆ తంతిని, ఎమ్‌జిఆర్ కి చూపించి, జరిగిన 'తంతు' యావత్తు వివరించాడు.

యమ్.జి.ఆర్, 'అడడడా', అని 'ఇవాళ ఇతని కాంబినేషన్ తీసేసి, పావం పంపించేయండి" అన్నాడు పెద్దమనసుతో! అంటూ టెలిగ్రామ్ చంద్రమోహన్‌కి అందజేస్తూ, మరోసారి చూడడంలో టెలిగ్రామ్ పైన బెంగుళూరు పోస్టాఫీస్ అని కనిపించింది!

"ఇదేమిటి బెంగుళూరు నుంచిరావడం ?" అని బెంగతో వున్న చంద్రమోహన్‌కి ఎమ్.జి.ఆర్ తంతి చూపించారు. "సరిగా చూసుకోలేదా? ఇది నిజంకాదు తంబీ, ఎవరో ఇక్కడినుంచే ఈ టెలిగ్రాం పంపారు" అని, అలా చూసేసరికి ధనకోటి కనిపించాడు.

"ఆఁ! అర్థమైంది. కచ్చితంగా ఇది ధనకోటి

చేసిన పని- ఏం కంగారు లేదు"అని ఎమ్.జి.ఆర్ ధైర్యం చెప్పగా, తనమీద వున్న కేసు కొట్టేస్తే సంతోషాంత తరంగుడైన ముద్దాయిలా ఫీలయిన చంద్రమోహన్, 'ధనకోటి ఆడిన నాటకమా!' అని అతన్ని చూశాడు. ధనకోటి నవ్వుతున్నాడు.

అతను ఇలాంటి ప్రాక్టికల్ జోక్స్ చేస్తుంటాడని తెలిసినవాళ్లు, అతన్ని నమ్మరు. అతని సంగతి తెలియని చంద్రమోహన్ నమ్మి, పొరపాటున తంతి వచ్చిన ఊరిపేరు చూసుకోకుండా - ఎమ్. జి. ఆర్. కాల్‌షీట్స్ గనక, రామానాయుడు గారు సర్దుబాటు చేసుకున్న విషయం తెలియక - సంఘర్షణలో పడి గిలగిల కొట్టుకున్నాడు. ఇప్పుడు చంద్రమోహన్ మొహం, మోహనంగా, వెన్నెలతో వెలిగిపోయింది!.

**కె.వి.రెడ్డికీ, ఎన్టీయార్‌కీ తప్పలేదు....**

ఈ ధనకోటికి, ఇలాంటి ప్రాక్టికల్ జోక్స్ అలవాటు. అయితే అతను, తన సంగతి తెలియనివాళ్ళ దగ్గరే ఈ తమాషాలు చేస్తాడు- ఆనందిస్తాడు. ఒకసారి చెప్పాడు.

"యోగివేమన షూటింగ్ జరుగుతోంది. ఆ సినిమాకి నేను అసిస్టెంటు మేకప్‌మాన్‌ని. కె.వి. రెడ్డిగారికి వంట్లో బాగుండక, ఇంటి దగ్గర్నుంచి భోజనం కారియర్‌లో వచ్చింది. అందరికీ భోజనాలు 'వాహిని' మెస్ నుంచే వచ్చేవి. లంచ్ టైమ్‌లో కె.వి.రెడ్డిగారు, భోజనానికి కూచోగా, ఏముంది? కారియర్ ఖాళీ!!అందులో ఏమీలేదు.

బరువుగా వుండాలని అడుగున రాళ్లు మాత్రం వున్నాయి. ఆయన అగ్గిబుగ్గయిపోయి గట్టిగా అరిచారు. ఇంటివాళ్లనీ, ప్రొడక్షన్ వాళ్లనీ తిట్టితిట్టి పోస్తున్నారు. నేను వెళ్లి- "క్షమించండి సార్ - ఇది నేను చేసిన పనే. మా అందరికీ మెస్ భోజనం రాగా, మీకు స్పెషల్‌గా ఇంటినుంచి రావడం ఏమిటని, నేనే కారియర్ విప్పి ఓ మూల కూచొని తినేశాను. భోజనం చాలా బాగుందిసార్! .. నేను చేసిన తప్పుకి నన్ను వుంచితే వుంచండి, లేకపోతే తీసేయండి సార్"అన్నాను. ఆయన భోజనం తినేసి, ఆయనతో వేళాకోళం ఆడినందుకు కొందరు తిట్టినా, రెడ్డిగారు మాత్రం నవ్వేశారు".

ఈ ధనకోటి సంగతి నాకూ చాలాకాలం తెలియదు. ఒకనాడు - జాలిపడిపోతూ, 'నాగయ్యగారు పోయార'న్నాడు! అప్పుడాయన ఆరోగ్యంగానే వున్నారు. నేను షాక్ తిని, "ఎప్పుడూ?ఎలా? "అని అడిగాను. "ఇప్పుడే పాపం... మధ్యాహ్నం బాడీ తీసుకెళ్తారట"అని మరింత జాలిపడ్డాడు.

నేను, షూటింగ్‌లో వున్న అందరికీ ఈ దుర్వార్త చెప్తే అందరూ ఆశ్చర్యపోయినా- ఒకరెవరో , "ఎవరు చెప్పారు?" అని అడిగితే, 'ధనకోటి' అన్నాను. "అయితే వట్టిదే- ఇలాంటి వార్తలు చెప్పి నమ్మించేది అతనే!" అని కొట్టి పారేశారు అందరూ!

ధనకోటి ఇంకా పెద్దదెబ్బ కొట్టింది- ఎన్.టి.రామారావుని. "కమేడియన్ బాలకృష్ణ గుండె పోటుతో చచ్చిపోయాడు'' అని, ఎన్.టి.ఆర్. మేనేజర్‌తో అన్నాడు ధనకోటి. అతను వూరుకోకుండా, కంగారుపడిపోయి- రామారావుగారితో చెప్పాడు. రామారావుగారు, తమ్ముడు త్రివిక్రమరావుగారూ హుటాహుటిన బయల్దేరి, బాలకృష్ణ ఇంటికి వెళ్ళిపోయారు.

వెళ్తే ఏముంది? ఇల్లు కలకల్లాడుతోంది- బాలకృష్ణ విఠలాచార్యగారి షూటింగ్‌లో వున్నాడు! రామారావుగారు మేనేజర్‌ని, ఒక ఊపు వూపారు. "ఏమిటీ దరిద్రపు పుకారు?" అని విరుచుకు పడుతూ వుంటే- "నాకు తెలీదు సార్, ధనకోటి చెప్పాడు" అన్నాడతను వణికిపోతూ. "ఎవడా ధనకోటి?" అని ధనకోటిని పిలిపించి, వార్నింగులు కురిపించి, ''జాగ్రత్త'' అని హెచ్చరించి పంపించారు.

అలా, తన సంగతి తెలియని వాళ్ల దగ్గర - ఎంతమందో పెద్దల్ని "చంపాడు" ధనకోటి. అదేమిటో , అతనికా సరదా! నమ్మిస్తాడు! నవ్వుకుంటాడు! కాలక్రమేణా ధనకోటి మరణిస్తే ''నిజమేనా!? లేక తనమీద తనే జోక్ వేసుకున్నాడా?" అని చాలామంది అడిగారు..

❖ ❖ ❖

**"జోక్ అంటే ఇదా?"**

ఒకసారి - ఇలాగే రమాప్రభ నా మీద జోక్ పేల్చింది. గుమ్మడిగారికి టెలిఫోన్ చేసి - నేను పోయానని చెప్పిందిట. ఆయన ఒక్కసారి



కంగారుపడి, "అరెరె.. ఎలా..ఏం జరిగింది?" అని గుండె పట్టుకుని, ఆత్రుతగా అడుగుతుంటే - రమాప్రభ పక పకా నవ్విందట.

"ఇవాళ ఏప్రిల్ ఫస్ట్ కదా!... మిమ్మల్ని ఫూల్ చేయ్యాలని.."అందిట.

దాంతో ఆయన మండిపోయి- "ఫూల్‌ని చెయ్యడం అంటే ఇదా! జాగ్రత్త ఇలాంటి సీరియస్ జోక్స్ చెయ్యకు-ఇంకెప్పుడూ!" అని సీరియస్‌గా హెచ్చరించారుట.

ఈ మాట గుమ్మడిగారు నాకు చెప్పగా, నేను రమాప్రభని అడగ్గా- ఆవిడగారు ఏడుపు మోహం పెట్టి - "ఏదో సరదాకి ఫూల్‌ని చెయ్యాలని చెబితే, అందరూ నా మీద సీరియస్సవుతారేం - జోక్ అర్థం చేసుకోలేరూ, చెబుతూ వుంటే?" అని సీరియస్సయింది - నేను నవ్వేసినా!

❖ ❖ ❖

**జీతాల తేదీ ఒకటే!**

విజయ సంస్థ వారు -జీతాలు ఇచ్చేవాళ్లకి నెల అయీ అవగానే, ఆఖరిరోజునే, 30,31 తేదీల్లో జీతం ఇచ్చేసేవారు. ''ఇవ్వాళ్టితో నెలపూర్తయిందికదా, రేపు ఎందుకూ ఇవ్వడం?" అన్నది నాగిరెడ్డిగారి సిద్ధాతం.



అలాగే రాజరాజేశ్వరీ సంస్థ (కన్నాంబ, కడారు నాగభూషణం) కూడా నెలాఖర్లోనే జీతాలు ఇచ్చేసేవారు. ఈ విషయాన్ని అందరూ గొప్పగా చెప్పుకునేవారు- ఆ సంస్థల గురించి. ఈ పొగడ్తలు విన్న నిర్మాత డి.యల్.నారాయణ (దేవదాసు, ఏకవీర, కన్యాశుల్కం చిత్రాల నిర్మాత) "ఏం నా గురించి చెప్పరేం? నేను కూడా 30,31 తేదీలకే జీతాలు ఇచ్చేస్తాను కదా, అయితే, ఒకటో తేదీకి ఇవ్వవలసింది, నెల అయిన తర్వాత 30,31వతేదీకి -అనుకోండి'' అన్నారొకసారి- చమత్కారం చేస్తూ.

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు



**ఆదిరాజు చక్రపాణి, చందానగర్**

ప్ర॥ నేనెప్పుడూ 'బ్యాంక్' దగ్గరే స్పృహ తప్పి పడిపోతుంటాను. ఎంచేతంటారు?

జ॥ బ్యాంక్ బాలన్సూ, మెంటల్ బాలెన్సూ బాలెన్స్ అవక....

**వి.మంజురాణి, హైదరాబాద్**

ప్ర॥ లవర్‌కి ఉత్తరమిచ్చి పంపడానికి ఎటువంటి వ్యక్తిని ఎన్నుకోవాలి?

జ॥ టింగరోణ్ణి మాత్రం ఎన్నుకోకూడదు. 'ఉత్తరమ్ ఇచ్చి వస్తావా?' అంటే 'సోడా, మంచింగ్ అక్కర్లేదా?' అంటాడు.

## డబుల్ రోల్




**అరుగు** దిగడానికి బద్ధకించేవాడికి తిన్నది **అరుగుతుందా**

ఎవరిదో గానీ ఈ **వరి** చేను బాగా పండింది

**- మామిడి మహేంద్ర, పూణే.**

అవినీతి గురించి **విని** విని బోరుకొడుతుందిరా

**జాని** నిజానికి చాలా మంచివాడురా

**- పి.పి.యస్.అప్పారావు, ఆర్.సి.పురం.**



## పేరు - రిపేరు



అన్నయ్య - శంకర్‌దాదా యం.బి.బి.యస్-

తమ్ముడు - గుడుంబాశంకర్

**-రఫీ, కాశీబుగ్గ.**

నేనున్నాను...

ఐతే ...!?

**-యిమ్మిడి శెట్టి సామ్య, అనకాపల్లి**

ఫూల్స్ - చిత్రం - ఏప్రిల్ 1 విడుదల

**-కేతా శ్రీనివాస్, విజయవాడ**

అమ్మాయికాపురం - చాలాబావుంది - మా అల్లుడు వెరీగుడ్

**-కోట శ్రీదేవి, శృంగవరపుకోట.**

## చిలిపి లిపి




Pay though do - పేదోడు

Pay the రి come - పేదరికం

Though P D - దోపిడి

Pim-D-won-ట - పిండివంట

Go -Rin-ట - గోరింట

**-వరదా సాయికుమార్, పర్లాకిమిడి**

## ఈ రూటే వేరు



Beggar Husband - బిక్షపతి
Squirrel Devotion- ఉడతాభక్తి

-టి.శ్రీనివాసచారి, హైదరాబాద్

Vehicle Come - బండొచ్చె
That Hot - ఆకారం

-ధీరజ్‌కుమార్, నందిగామ

## చిలిపి కవిత




వాడో మెదడు తినే శాడిస్టు
తగులుకుంటే వదలని పేస్టు
వాడికి లేదు టేస్టు
వాడి బ్రతుకే వేస్టు
దొరికితే అయిపోతాం రోస్టు
వాడికన్నానయం
రామ్‌గోపాల్వర్మ 'ఘోస్టు'

-మహేంద్రాడచలం, టెక్కలి.

## పేరడీ పేరడ్




పల్లవి: టాటా.. వీడుకోలూ...
గుడ్‌బై.. ఇంక సెలవు
డబ్బుపెట్టిన ఖాతాదార్‌లారా!
తెగవెతికే పోలీస్‌లారా...!! ॥టాటా॥

చరణం: జనం దాచే డబ్బులకన్న విలువైనది ఏదీలేదనీ
ఎన్నడో నాకు తెలిసింది అది నేడే నిజముఅయ్యింది
ఆ రాచబాటలో పోతాను... పోతాను.. పోతాను..
ఈ రొచ్చుపేటకు.. రాను ... ఇకరాను..॥టాటా.. వీడుకోలూ॥

చరణం: దోచుటలో వున్న హాయీ.. మరి దాచుటలో లేనేలేదని..
చాటుగ తెల్చుకున్నాను నే నీటుగ సర్దుకున్నాను
ఆ క్షేమనగరుకే పోతాను.. పోతాను.. పోతాను..
ఈ క్షామనగరుకూ.. రాను.. ఇక రాను..॥టాటా.. వీడుకోలూ॥

చరణం: విదేశాల్‌కి పోతే ఇంక..
ఏ మాత్రం కేసూ లేదనీ
మనకు మన పెద్దలే చెప్పారు
నా దిగులంతా వాళ్ళే తీర్చారు
నే దేశం విడిచిపోతాను
విదేశాలకే పోతాను పోతాను...

(బుద్ధిమంతుడు చిత్రంలోని "టా! టా! వీడుకోలు గుడ్‌బై! ఇంక సెలవు" పాటకు పేరడీగా..)

-గూటూరి వెంకటేశ్వరరావు, కశింకోట.

## షార్ట్‌కట్స్




పేరి రామ శర్మ - పేరాశ
రంగం భద్రయ్య - రంభ
ఎర్రోజు లక్ష్మీకమల - ఎలక
కోరుమల్లి పంకజం - కోపం
కందుల పుల్లయ్య - కంపు
నాగ శతకాల నందకిషోర్- నాశనం

-ఎన్.బి. క్రీస్ట్, విద్యానగర్.

ఈ సంచికలోని పేరడీ పేరడ్‌ని రాసిన **గూటూరి వెంకటేశ్వరరావు, కశింకోట** గారికి సోహాన్ మ్యూజిక్ వారు 'సాప్రూట్ రీమిక్స్' ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.

SOHAN
MUSIC





మహాసహస్రావధాని

డా॥ గరికపాటి నరసింహారావు

# పలకరిస్తే పద్యం...

1116 పృచ్ఛకులతో 750 పద్యాలను ఏకధాటిగా ధారణ చేసి 'మహాసహస్రావధాని'గా కీర్తి ప్రతిష్ఠలనందుకున్న డా॥ గరికపాటి నరసింహారావుగారు సాగించిన అవధానయజ్ఞాలలో చమత్కారంగా దొర్లిన ఆశు పద్యాలివి. ఈ పద్యాలకు పృచ్ఛకులుగా వ్యవహరించినవారు శ్రీకాంత్, మంజుల, కుమార్, జ్యోతి, సాయి... చిత్తగించండి....

**◆ అవధాని గారూ... ఓ సాహితీ సభలో సరస్వతీ దేవి పటాన్ని ఓ కుర్చీలో పెట్టారు. దానికి మూడు కాళ్లే ఉన్నాయి. నాలుగో కాలుకు బదులు ఇటుకలు పెట్టారు. మీ వంటి అవధానులు ఇటువంటి దృశ్యాన్ని చూస్తే ఎలా స్పందిస్తారు?**

అతి ప్రాచీనకాలం నుండి విద్యకు, కవిత్వానికి ఆలవాలంగా ఉన్న సరస్వతికి ఇటుకలు ఆలవాలం కావటం విచిత్రమేనండి. అయినా తప్పేముంది?

**పటుతర ధారయు ధారణ**
**కిటకిట కనురెప్పలట్లు**
**కీలించెడి వాక్యటవిటపీ సంవాసినీ**
**ఇటుకలపై నిల్చినావు కిటుకదియేమో**

అని మనం ప్రశ్నించ వలసి ఉంటుంది. వటవిటపీ అంటే మఱ్ఱిచెట్టు. వాక్కులనే వటవృక్షంలో నివసించేటటువంటి తల్లి సరస్వతి. అటువంటి మహావిద్యా స్వరూపిణికి కూడా ఇటుకలు ఆధారం కావడం చిత్రమైనది. కానీ ఈ పద్యం మొత్తం 'ట'కార ప్రాసతో ఒకరకమైన పలుకు చమత్కారంతో రావడానికి కూడా ఇటుకలే కారణం.

**◆ అవధానిగారూ.. ఆంధ్రులకి నోరూరించేది, ఇతరులకు అరివీర భయంకరంగా ఉండేది మన అవకాయ కదా.. అవకాయ మీద ఓ పద్యం చెప్తారా?**

**మావిళ్ల ముక్కపై మమకారమున్**
**జల్లి అందింపగా జిహ్వ ఆవకాయ**

ఆవకాయలో ఉపయోగించేది కారం కాదు, అది మమకారం. అందువల్ల ఆంధ్రులకి అది కన్నతల్లితో సమానం.

**మావిళ్ల ముక్కపై మమకారమున్**
**జల్లి అందింపగా జిహ్వ ఆవకాయ**
**ఎండకాలమునందు ఎండి పోయిన గుండెకు**
**అభినందనము తెల్పు నావకాయ**

వేసవికాలంలో ఒకరకంగా గ్రీటింగ్స్ చెబుతుంది మనకు ఆవకాయ. చాలా ఆనందాన్ని, అభిరుచిని రుచిగా మార్చి అందిస్తుంది.

**కూరలే లేనిచో కోమలి వేయుచో**
**అనురాగమున్‌జూపు ఆవకాయ**

పదార్థాల రుచి వడ్డించేవాళ్లను బట్టి ఉంటుంది. తినాలి అని వడ్డిస్తే ఒకరకంగా ఉంటాయి. అక్కర్లేదులే అని వడ్డిస్తే వేరొక రకంగా ఉంటాయి.

**కూరలే లేనిచో కోమలి వేయుచో**
**అనురాగమున్‌జూపు ఆవకాయ**

ఆవకాయలో మరొక గొప్ప విశేషముంది. అది గొప్ప త్యాగశీల

**చీకుచున్నను గానీ పీకుచున్ననుగానీ**
**ఆనందమే నిచ్చు ఆవకాయ**
**ఆపదల నాదుకొను కూర ఆవకాయ**

ఆపద్బాంధవురాలు ఆవకాయ. ఎప్పుడైనా కూరలు లేని పరిస్థితి ఉంటే ఠక్కున ఆవకాయ వేసి ఆనందంగా భోజనం చేయవచ్చు.

**ఆపదల నాదుకొను కూర ఆవకాయ**
**అతివ నడుమైన జాడియే ఆవకాయ**

నడుము దగ్గర జాడీ పెట్టుకుంటే నడుము ఏదో, జాడీ ఏదో తెలియకూడదు. జాడీ ఎలాగూ అలాగే ఉంటుంది. నడుము కూడా అలాగే ఉంటే బావుంటుంది.

**అతివ నడుమైన జాడియే ఆవకాయ**
**ఆంధ్రమాత సిందూరమ్మె ఆవకాయ**
**ఆంధ్రదేశమ్మె తానొక్క ఆవకాయ**

**◆ అవధాని గారూ... ఆవకాయ అనేది ఆంధ్రులకి చాలా ఇష్టమైనదని చెప్పారు కదా... కానీ ఆంధ్రమాత అనేది గోంగూరకు పెట్టింది పేరు కదా.. మీరు మరి మా గోంగూరను వదిలివేస్తే ఎలా ? గోంగూర మీద కూడా ఓ పద్యం చెప్పాలి.**

తప్పకుండా చెబుదామండి. వంటకు సంబంధించి గోంగూర పచ్చడి నిర్మాణంలోనే పరమాద్భుతమైన రహస్యాలెన్నో ఉన్నాయి.

**ఆకు కూరను తెచ్చి పీకి పాకముపెట్టి**
**దోరగా వేయించు నోరచూపు**

అక్కడ దోరదోరగా గోంగూరను వేయిస్తూ పక్క గదిలోకి ఓర చూపును విసురుతూ ఉంటే... అప్పటికి భర్త గారు సిద్ధమవుతాడు.... ఆ పచ్చడికి తగినట్టుగా భోజనం చేయటానికి తన మనస్సును సంసిద్ధ పరచుకుని.

**ఆకు కూరను తెచ్చి పీకి పాకముపెట్టి**
**దోరగా వేయించు నోరచూపు**
**రోట రుబ్బెడివేళ నోటినురగ చేసి**
**లొట్టవేయించెడి గుట్టు రూపు**
**గుంటూరు కారమ్ము గుమ్మరించి**
**గరిటె పోపు పెట్టెడి వేళ టాపు లేపు**

గోంగూర పచ్చడికి గుంటూరు కారం వేస్తేనే చాలా అద్భుతంగా, ఆరోగ్యప్రదంగా కూడా ఉంటుంది. గరిటె పోపు అంటారు ప్రత్యేకంగా... ఆ తరహా పోపు పెడితే నిజంగా టాపులేపినట్టే ఉంటుంది..

**గుంటూరు కారమ్ము గుమ్మరించి...**
**గరిటె పోపు పెట్టెడి వేళ టాపు లేపు**

ఉల్లిపాయనుజేర్చి ఒక్కొక్క ముద్దనే
మ్రింగుచుండెడి వేళ నింగి నూపు
తెలుగు కవులకు పద్యాల తెలివినిచ్చు
తెలుగు వారికి నిలువెల్ల వెలుగునిచ్చు
తెలుగు తల్లుల వంటింటి కలల పంట
తినుడు గోంగూర పచ్చడి తినుడు మీరు...
తినుడు గోంగూర పచ్చడి తినుడు మీరు

**◆ అవధాని గారూ... మధ్యాహ్నం భోజనంలో మీరు చెప్పినట్టు గోంగూర పచ్చడి, ఆవకాయ చాలా బాగున్నాయి. వాటి గురించి చాలా బాగా చెప్పారు. అయితే సాయంత్రం పూట ఫ్రెండ్స్ అంతా సరదాగా సెంటర్‌లోకి వెళ్లి మిరపకాయ బజ్జీలు తింటాం కదా... మరి వాటి గురించి కూడా మీరు చెబితే బాగుంటుంది.**

మిరపకాయ బజ్జీ కేవలం రుచి కలిగించే పదార్థమే కాదు. సరదా కోసం తినేదే కాదు. దానిలో లోతుగా ఆలోచిస్తే చాలా గొప్ప తత్వం ఉంది. అదంతా పద్యంలో చెప్పే ప్రయత్నం చేద్దామండి.

ఐదు గంటల వేళ ఆ దారి
వ్రెక్కగా చుయ్ మనును
గూబ గుయ్‌మనును

ఆ శబ్దం వినపడగానే ఇటువైపు వెడుతున్నవాడు కూడా ఆ బజ్జీల బండి వైపు దారి మారుస్తాడు ఖచ్చితంగా. ఇక ఆ పైన

పచ్చి మిరపకాయ కచ్చి రేపెడియెట్లు
గుచ్చి చూచుచుండెను గుండె వైపు

అది ఒక ప్రేమ బాణంలాగా గురి చూసి వదిలిపెట్టే సరికి అటువైపు వెళ్లకుండా ఉండలేం కదా. ఆ తరువాత అది వేగుతూ ఉంటే ఆ ధ్వని వేరు , ఆ వాసన కూడా వేరు...

శనగ కవచమూని సలసలా వేగుచో
కడుపులో రసనాడి కదలసాగు

వాడింకా మూకుడులోంచి బజ్జీ తియ్యకుండానే మన కడుపులో ఆ రసనాడి కదులుతూంటుంది. ఇక ఆ పైన తింటే ఎలా ఉంటుందయ్యా..

ముక్క కొరికినంత ముల్లోకముల యాత్ర
చేత కాసులు లేక చేయగలడు

ఖర్చు లేకుండా ఆ మూడు లోకాలు తిరిగి రావాలంటే ఒక్కసారి ఆ కారం బజ్జీ తింటే చాలు. డబ్బులు ఖర్చు లేకుండా యాత్ర అంతా చేయొచ్చు. ఇక మిరపకాయబజ్జీలో ఉండే గొప్ప తత్వం ఏమంటే ఎవరైనా డబ్బు ఖర్చుపెట్టేది ఆనందించడానికి కానీ ఏడవటానికి కాదు కదా.. కానీ మిరపకాయ బజ్జీ మాత్రం

ధనము వెచ్చించి కన్నీళ్లు కొనగజేయు
మిరపబజ్జీల రుచిని నే మరువలేను

డబ్బిచ్చి కొని, తిని ఏడుస్తాం. ఆ తత్వం ఏమిటో, ఆ రహస్యం ఏమిటో..

ధనము వెచ్చించి కన్నీళ్లు కొనగజేయు
మిరపబజ్జీల రుచిని నే మరువలేను

అయితే ఎన్ని తినాలయ్యా...

ఒక్కటో రెండో మంచిదే... ఒక్కటో రెండో మంచిదే...
ఎక్కువైన సచిన్ టెండూల్కరుడు మాకు సాటి రాడు

ఇక అక్కడ్నుంచీ రన్స్ తియ్యటం ప్రారంభించాలి ఇంటికొచ్చాక. ఎక్కడ్నుంచి ఎక్కడికి అనేది నేను చెబ్తే బావుండదు కానీ టెండూల్కర్ కూడా ఆ రన్స్ విషయంలో మనకు సరిపోడు. అదీ మిరపకాయ బజ్జీ తత్వం.

**◆ అవధానిగారూ... ఇంత ఘాటైన మిరపకాయ బజ్జీ నిప్పించారు చాలా బాగుంది. మరి దానికి అమృతప్రాయమైన కాఫీని జోడిస్తే ఇంకా బావుంటుందేమో కదా.**




కాఫీని అమృతపాయమని మీరు యథాలాపంగా అన్నారేమో కానీ నిజంగా అది అమృతమే. దాని పుట్టుకకు మూలమూ నా దృష్టిలో అమృతమే.

తరుణి జగన్మోహినియే
సురులకు వడ్డించి సుధను
శూన్యపు పాత్రన్ ధర విసిరిన
అది గైకొని నరుడెవ్వడో మరిగి కాచినాడీ కాఫీ

క్షీర సాగర మథన సందర్భంలో జగన్మోహిని ఆవిర్భవించి, అమృతాన్ని పంచిన తరువాత... ఖాళీ పాత్రను నేనేమి చేసుకుంటానని బహుశా ఆ ఖాళీ పాత్రను క్రింద పారేసి ఉంటుంది. అది అందుకున్న నరుడెవడో దాని రుచి మరిగి తరువాత ఈ కాఫీ అందులో కాచి ఉంటాడు. అందువల్ల కాఫీ నిజంగా మీరన్నట్టు అమృత ప్రాయమే.

**◆ అవధానిగారూ... ఏమీ అనుకోకపోతే చిన్న అధిక ప్రసంగం. ఇప్పుడు మిరపకాయ బజ్జీ తింటామన్నారు... తిన్నాం. తరువాత కాఫీ తాగాం, అమృతప్రాయంగా ఉందన్నారు. తరువాత సహజంగా సిగరెట్ ఓ దమ్ము లాగుతారు కదా... మరి దాని గురించి కూడా చెబితే బాగుంటుందేమో అనిపిస్తుంది నాకు.**

**ఈ ప్రశ్నకు అవధానిగారు చెప్పిన సమాధానం ఎలా ఉంటుందో వచ్చే సంచికలో.....**

రసజ్ఞులైన పాఠకులు కూడా ఈ 'పలకరిస్తే పద్యం' శీర్షికలో పాల్గొనవచ్చు. సంచికకు రెండు ప్రశ్నల చొప్పున పద్యాలు చెప్పడానికి మహాసహస్రావధాని గరికపాటి నరసింహారావు గారు అంగీకరించారు. 'హాసం' పాఠకులకే పరిమితమైన ఈ అమూల్య అవకాశాన్ని రసజ్ఞులందరూ వినియోగించుకుంటారని ఆశిస్తున్నాం. పద్యాన్ని కోరే పాఠకులు తాము ఇవ్వాలనుకుంటున్న సమస్యను ఈక్రింది చిరునామాకు పంపాలి.

**పలకరిస్తే పద్యం**
**హాసం, హాస్య - సంగీత పత్రిక,**
**502, శ్రీ బాలాజీ నిలయం,**
**బి.యస్.పి.కాలనీ, మోతీనగర్,**
**హైదరాబాద్ -500 018**

అవధాని గారి పద్యాలకు ఎంపికైన సమస్యలను పంపే పాఠకులకు తగిన బహుమతి ఉంటుంది.




సంగీత సాహిత్యాల పరంగా నాటికీ, నేటికీ, ఏనాటికీ మేటి అనిపించుకోగల జానపద చిత్రాలలో విజయా వారి

# జగదేకవీరుని కథ

ఒకటి. ఆ చిత్రంలోని ఓ మూడు పాటల గురించి గత సంచికలో వివరించగా, మరో రెండిటి గురించి ఈ సంచికలో...

ఐనదేమో ఐనదీ ప్రియ
గానమేదే ప్రేయసీ ॥ఐనదేమో॥
ప్రేమ గానము సాగ గానే
భూమి స్వర్గమె ఐనది
భూమి స్వర్గమె ఐనది ॥ఐనదేమో॥
ఏమి మంత్రము వేసినావో
ఏమి మచ్చును చల్లినావో ॥ఏమి॥
నిన్ను చూసిన నిముసమందె
మనసు నీ వశమైనదీ-
మనసు నీ వశమైనదీ- ॥ఐనదేమో॥
కలుకులొలికే హొయలు చూసి
వలపు చిలికే లయలు చూసి ॥కులుకు॥
తలపు లేవొ రేగి నాలో
చాలా కలవరమైనదీ
చాలా కలవరమైనదీ
ఐనదేమో ఐనదీ ప్రియ
గానమేదే ప్రేయసీ



ఈ పాటను ఘంటసాల, సుశీల ఆలపించగా ఎన్.టి. రామారావు, బి.సరోజాదేవి అభినయించారు. కళ్యాణి రాగాన్ని బేస్‌గా చేసుకుని స్వరపరచిన ఈ గీతంలోని ట్యూన్ 'మ'ధ్యమం, 'ని'షాద స్వరాలపై తక్కువగాను, మిగిలిన 'సరిగపద' స్వరాలపైన ఎక్కువగాను సంచరించడం వలన ఈ పాటకు ప్రధాన రాగం మోహన అని అనుకోవడానికి అస్కారం ఉంది. అటు 'మ', 'ని'లను తక్కువగా వాడినా, ఇటు 'సరిగపద'లనే ఎక్కువగా ఉపయోగించినా మొత్తం ట్యూన్‌ని తన పట్టులో ఉంచుకుంటూ 'సరిగపదమని' శాసించగల పెండ్యాల హస్తవాసితో ఈ గీతం ఎంతో

'కళ్యాణ'ప్రదంగా ఎంత సమ్మోహనంగా తయారయిందో విన్నవారికి అనుభవ యోగ్యమే! మోహనరాగంలో 'సరిగపద' అనే 5 స్వరాలు మాత్రమే వస్తాయి. కళ్యాణి రాగంలో 'సరిగమపదని' అనే సప్త స్వరాలూ వస్తాయి. ఈ పాటకు కళ్యాణి రాగాన్నే ఆధార రగంగా తీసుకున్న పెండ్యాల వారు 'మ' 'ని' అనే స్వరాలు అతి తక్కువగా ప్రయోగిస్తూ మోహన రాగం అనే భ్రమను కలిగించారు. ఈ పాట మొదలవడానికి ముందు ఘంటసాల , సుశీల ఆలపించిన అలాపనలు మొత్తం ఒక పాటకు ఎంత ప్రాచుర్యం లభిస్తుందో అంతటి ఖ్యాతిని సంపాదించుకున్నాయి. అదీగాక ఈ పాటలోని ఆ ఆలాపనలలోంచి అన్నపూర్ణా వారి 'వెలుగునీడలు' (1961) చిత్రంలోని 'హాయిహాయిగ జాబిల్లి' పాటలోకి పాడుకుంటూ వెళ్ళి పోవడం చాలా సులువు. కావాలంటే ఓసారి సాధనచేసి చూడండి. 'ఐ'కారంతో మొదలైన పాటలు చాలా తక్కువ గల మన తెలుగు సినీగీతాల చరిత్రలో పింగళివారి పుణ్యమా అని ఓ విశేషాదరణ పొందిన గీతం చేరిందని చెప్పవచ్చు. అంతటి విశేషాదరణకు కారణం సంగీతంతో పాటు సరళమైన తన తెలుగుతో పింగళి జల్లిన మచ్చు కూడా!

రారా కనరారా
కరుణ మానినారా ప్రియతమలారా
రారా కనరారా
కరుణ మానినారా ప్రియతమలారా
నాలో నాలుగు ప్రాణములనగా
నాలో నాలుగు దీపములనగా
నాలో నాలుగు ప్రాణములనగా
నాలో నాలుగు దీపములనగా
కలిసి మెలసి అలరించిన చెలులే
కలిసి మెలసి అలరించిన చెలులే
ననువిడనాడెదరా
రారా కనరారా
కరుణ మానినారా ప్రియతమలారా ... రా రా
మీ ప్రేమలతో మీ స్నేహముతో
మీ ప్రేమలతో మీ స్నేహముతో
అమరజీవిగా నను చేసితిరే
మీరు లేని నా బ్రతుకేలా
మీరు లేని నా బ్రతుకేలా
మరణమె శరణముగా
రారా కనరారా
కరుణ మానినారా ప్రియతమలారా



ఈ పాటను ఘంటసాల ఆలపించగా, ఎన్టీఆర్ అభినయించారు. సన్నివేశ ప్రాధాన్యంగా మధ్య మధ్య బి.సరోజాదేవి, యల్ విజయలక్ష్మి, జయంతి, బాల కనిపిస్తారు. ఈ పాట సాహిత్యం అతి తక్కువే అయినా పూర్తిపాఠం ఈనాటికీ ఎందరికో కంఠోపాఠంగా ఉందంటే అందుకు కారణం ఆ సాహిత్యంలోని లోతు మాత్రమే! భాగీశ్వరి రాగంలోని ఈపాటను మనసును పూర్తిగా లగ్నం చేసుకుంటూ పాడుకుంటే ఎటువంటి వారికైనా రసస్పర్శ అంటే ఏమిటో అవగాహనలోకి వస్తుంది. అంతటి అనుభూతినీ స్వరంతో పెండ్యాల, గళంతో ఘంటసాల మనకందించారు. ఈ పాట స్వరకల్పనకు ముందు -సన్నివేశాన్ని పెండ్యాలకు వివరించి "ఏ రాగంలో చూస్తారో ..చూడండి" అన్నారు దర్శకులు కె.వి.రెడ్డి. సాధారణంగా నాటకరంగంలో ఇటువంటి శోకతప్త గీతాలకు ముఖారి, అసావేరి, సింధుభైరవి, ముల్తానీ, ఘూర్జరీ , తోడి, భాగీశ్వరి మొదలైన రాగాలను వాడతారని చెబుతూ, సాహిత్యాన్ని చూసి భాగీశ్వరి రాగంలో ట్యూన్‌ని ఓసారి అనుకున్నారు పెండ్యాల. అలా కాసేపు మనసులో సాధన జరిగాక, అది బాగున్నదనిపించాక - కె.వి.రెడ్డిగారికి వినిపించారాయన. "ఆర్తి, ఆరాధనా భావం రెండూ బాగా వచ్చాయండీ.. చాలా బాగుంది" అన్నారు కె.వి.రెడ్డి. అయినా పెండ్యాలవారి మనసెందుకో ఊరుకోలేదు. ఇంకా ఆలోచిస్తూనే ఉంది. ఆ సమయంలో ఆయనకి అరబిక్, ఈజిప్షియన్ మెలోడీస్ కొన్ని స్ఫురించాయి. ఊహకందని లోకాల నుంచి వచ్చి తిరిగి అదే లోకాలకు వెళ్ళిపోయిన దేవకన్యలను ఉద్దేశించి పాడినపాట కాబట్టి ఆ ట్యూన్స్‌లో ప్రయత్నిస్తే కొత్తదనంగా ఉంటుందనిపించింది. రాత్రంతా కూర్చొని ఆ మెలోడీస్‌తో స్వరపరిచి మర్నాడు కె.వి.రెడ్డిగారి దగ్గరకు వెళ్ళి 'మరో రాగంలో కూడా ట్రై చేశానండీ... వింటారా?" అని అడిగారు. "చాలా ..సంతోషం.. కానివ్వండి" అన్నారు కె.వి.రెడ్డి. మహదానందంతో పాడారు పెండ్యాల. "ఇది కూడా బావుందే...ఏం అంటారు కవిగారు!?" అడిగారు కె.వి.రెడ్డి-పక్కనే ఉన్న పింగళి నాగేంద్రరావుగారిని. మళ్ళీ పాడమన్నారాయన. ముందు రోజు పాడిన భాగీశ్వరి రాగం ట్యూన్‌తో పోల్చుకుంటూ, మరోసారి పాడేరు పెండ్యాల. "రెండిట్లోనూ పూర్తి ఎక్స్‌ప్రషన్ కనిపిస్తోందే! దేన్ని ఒదులుకుంటాం!?" అనే సందిగ్ధంలో పడ్డారు వారిద్దరూ ఆయన పాడేక. ఈ పరిస్థితి ఓ మూడు నాలుగు రోజులపాటు కొనసాగింది. ఎవరిచేత ఏపని చేయిస్తున్నా నిర్ణయాన్ని మాత్రం తన దగ్గిరే అట్టిపెట్టుకొనే కె.వి.రెడ్డి సైతం సందేహంలో పడి ఎన్.టి.ఆర్.ను తీరిక చూసుకుని రమ్మని కబురుపంపించారు. అలాగే వచ్చారాయన. జరిగిన వైనమంతా తెలిపి "సన్నివేశం మీకు తెలుసు కనుక పైగా నటించాల్సింది కూడా మీరే కనుక నిర్ణయం మీకే వదిలేస్తున్నాం. మీరే నిర్ణయం తీసుకున్నా కట్టుబడి ఉంటాం" అన్నారు, "పాడండి మాష్టారూ" అన్నారు ఎన్.టి.ఆర్. అలాగేనని మొదలు పెట్టారు పెండ్యాల. కళ్ళుమూసుకుని రెండు స్వర రచనల్నీ విన్నారు ఎన్.టి.ఆర్. మొత్తం అనుభూతిని ఆకళింపు చేసుకున్నారు. "మరొకసారి పాడండి మాష్టారూ" అని అడిగారు. సరేనని మళ్ళీ పాడారు పెండ్యాల. అయిదు నిమిషాల పాటు ఏమీ మాట్లాడలేదు ఎన్.టి.ఆర్. ఎవ్వరూ ఆయన్ని మాట్లాడించలేదు కూడా. అందరూ తదేక దీక్షతో ఆయన్నే చూస్తున్నారు. కాసేపాగి "రెడ్డిగారూ.. నా నిర్ణయం భాగీశ్వరికే... ఎందుకంటారా. .అరబిక్ మెలోడీలో కొత్త దనం ఉన్నమాట వాస్తవమే అయినా సాహిత్యాన్ని కొంచెం వెనక్కి నెట్టి ముందుకు దూకుతోంది. అంటే ముందు సంగీతమే చెవులను తాకుతోంది. భాగీశ్వరిలో సంగీత సాహిత్యాలు రెండూ జోడుగా ఒకేసారి మనసుని తాకుతున్నాయి. అదే సన్నివేశానికి నిండుదనం చేకూరుస్తుంద"ని ప్రకటించారు. ఎన్.టి.ఆర్. లోతైన ఆయన పరిశీలన అందరికీ అమోదయోగ్యమైంది. ఆ ప్రకారమే "రారా కనరారా" పాట భాగీశ్వరి రాగంలోనే రికార్డయి ఈనాటికీ సజీవంగా ఉంది.

(మరికొన్ని పాటల గురించి వచ్చే సంచికలో..



జంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే
ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...

బాల్యపు లేతదనం మళ్ళీ కోరుకునే పెద్దలకు మరీ మరీ ప్రత్యేకం



పిల్లల కోసం ప్రత్యేకం...

# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ
ఎమ్బీయస్ ప్రసాద్

2వ భాగం

చిత్ర పరిచయం 6

సమన్వయం
మంజీర

**(జరిగిన కథ - అంబోతు అనే జంతువుల అండర్‌వరల్డ్ డాన్ కోరిక మేరకు డా॥ జాన్ డూలిటిల్ ఓ అడవిని సంరక్షించే కార్యక్రమం చేపడతాడు. అరుదైన వన్యజాతికి చెందిన ఆడ భల్లూకం ఒకటి అడివిలో ఉందని, దాన్ని సర్కస్‌లో పెరిగిన ఆర్చీ అనే మగభల్లూకంతో కలిపితే విచక్షణారహితంగా అడివిని నాశనం చేసే కంట్రాక్టర్లకు ప్రభుత్వం అడ్డువేస్తుందనీ తెలుస్తుంది జాన్‌కి. కోర్టునుండి ఒకనెల గడువు తీసుకుని జాన్, ఆర్చీ వద్దకు వెళతాడు. సర్కస్‌లో పెరిగిన భల్లూకం అడివిలో పెరిగిన భల్లూకంతో జతకట్టడం జరిగేపని కాదని వాదించిన కాంట్రాక్టర్ల లాయరు టీవీ చూస్తూ జాన్ అడివికి ప్రయాణం కట్టిన సంగతి తెలుసుకుంటాడు. - ఇక చదవండి)**

సర్కస్ భల్లూకాన్ని తీసుకుని కుటుంబంతో సహా జాన్ అడివికి తరలి వెళ్లిన వార్తను టీవీద్వారా కని, విని ఉన్న ఆ త్రయానికి కనీవినీ ఎరుగనంత కోపం వచ్చింది. "వెధవ సొద" అంటూ లాయరు టీవీ కట్టిపారేశాడు.

జో అనే కంట్రాక్టరు మండిపడ్డాడు. "రెండు కలప కంపెనీలకు నేను ఆల్రెడీ కమిటయి పోయున్నాను. చెప్పిన ప్రకారం దుంగలు పంపకపోతే వాళ్లు నా దుంపతెంచడం ఖాయం."

అతని స్నేహితుడు "అది సరేనయ్యా, కానీ ఏం చేస్తాం? విషయమంతా కాంప్లికేటెడ్ అయిపోయింది. ముఖ్యంగా, ఆ అరుదైన జాతి తాలూకు భల్లూకం అన్నారు చూడు, అది కనక బతికి బట్టకడితే, మనం చచ్చి తలారా దుప్పటి కప్పించుకోవడం ఖాయం." అన్నాడు.



జో స్నేహితుడి మీద మండిపడ్డాడు. "నాకు ఆ దుంగలు అందించకపోయేవో, నువ్వు కూడా అరుదైన, అంతరించిన జాతుల్లో చేరిపోతావు జాగ్రత్త!"

లాయర్ వేడి చల్లార్చబోయేడు - "నువ్వంతగా ఇదవ్వకు జో! ఆ సర్కస్ భల్లూకం అడివిలో ఎప్పుడో ఒకప్పుడు తప్పటడుగు వేయడం ఖాయం. దాని తలకాయ మీ ఇంట్లో గోడను అలంకరించడం ఖాయాతిఖాయం!"

జో ఒక విషపునవ్వు నవ్వాడు. "మా హాల్లో అప్పుడే దానికో చోటు రిజర్వ్ చేసివుంచానులే!"

* * *

జాన్ కుటుంబంతో సహా అడవుల్లోకి వచ్చిపడ్డాడు. ఓ కాటేజీలో నివాసం ఏర్పరచు కున్నాడు. ఆర్చీ రాకకై ఎదురుచూస్తున్నాడు. దిగీదిగగానే లక్కీ షికార్లు మొదలెట్టింది. ఓ బండరాయి వద్దకు వెళ్లి హాయిగా, తృప్తిగా కాలెత్తింది. ఇంట్లో అయితే ఇలాటివన్నీ బాత్‌రూమ్‌లోనే కానివ్వాలి. ఇక్కడయితే ప్రకృతిపిలుపుకు వెంటనే, చిత్తం వచ్చినచోట స్పందించవచ్చు. అంతలో ఓ ఆడతోడేలు అటువచ్చి చూసింది. పళ్లు బయటపెట్టి గుర్రుమంది. కయ్యానికి అన్నట్లు కాలు దువ్వింది. లక్కీకి అనుమానం వచ్చింది - పోరు, పొక్కూ లేకుండా హాయిగా తన పని తాను చేసుకుంటున్న తన మీద ఇంత ఆగ్రహమా? నిజంగా కోపంగా ఉందా? లేక ఇదేమైనా జంగ్లీ టైపు లవ్‌సిగ్నలా? అని. గట్టిగా అడిగి కనుక్కుందామనుకునేలోపున అది పారిపోయింది.



* * *

ఎట్టకేలకు ఆర్చీ సర్కస్‌వాన్‌లో అడివికి రానే వచ్చింది. జాన్ తన కాటేజీ ముంగిట్లో జంతువులందర్నీ సమావేశపరచి ఆర్చీని పరిచయం చేయబోయాడు. వ్యాన్ తలుపులు మూసేసి ఆర్చీని వేదికమీదకు గ్రాండ్ ఎంట్రీ ఇచ్చేందుకు సన్నాహాలు చేశాడు -



"...మనమంతా ఇక్కడ ఎందుకు సమావేశ మయ్యామో మీ అందరికీ తెలును. ఇవ్వటిదాకా అసాధ్య మనుకున్నదాన్ని సుసాధ్యం చేయడానికి మనం కంకణం కట్టుకున్నాం. కానీ మన శత్రువులు మనం

ఫెయిలవుతామని చాలా ఆశగా ఉన్నారు. అడవులు కొట్టడానికి రంపాలు సాన బెట్టుకుని, లారీలు సిద్ధం చేసుకుని పెట్టుకున్నారు. వారి ఆశలు నిరాశ చేయాలి. మీరంతా రెడీయేనా?"

జంతువులన్నీ ఒక్కసారి నిలబడి మూకుమ్మడిగా సంఘీభావం తెలియబరచాయి.

"దట్స్ గుడ్! అడివిని రక్షించే మన పథకంలో కేంద్రబిందువైన ఆర్చీని ఆహ్వానిద్దాం. మీ పంజాలు దగ్గరకు చేర్చి ఒక్కసారి కరతాళధ్వనులు.. కరతాళధ్వనులు అనకూడదేమో, వాటెవర్ ఇటీజ్.. మిన్నుముట్టేలా ఒక్కసారి.. దట్స్ రైట్.. వనరక్షకుడు, వన్యప్రాణి రక్షకుడు ఆర్చీకి స్వాగతం.. సుస్వాగతం" అంటూ తను మాత్రం కరతాళధ్వనులు చేస్తూ ఆర్చీకి ఆహ్వానం పలికాడు.

వ్యాన్ తలుపు తెరుచుకుని బయటకు వాలి కిందనున్న కాళ్ల మీద ఆనింది. స్టేజీమీదకు వచ్చినంత ఆర్భాటంగా ఆర్చీ వాల్చిన తలుపు మీద నిలబడి 'హాయ్' అని అందరికీ అభివాదం చేసింది. ఎంతో ఆతృతగా చూస్తున్న జంతువులను చూసి పోజు కొడుతూ "ఈ దిక్కుమాలిన అడివిలో పాటలు పాడడం వచ్చినవాళ్లెవరైనా ఉంటే నాతో పదం కలపండి, పాదం కలపండి." అని ఎనౌన్సు చేసింది ఆర్చీ.



ఈ ధోరణేమిటో జంతువులకు అంతుపట్టలేదు. ఏమీ మాట్లాడకుండా చూస్తూ కూచున్నాయి. ఓ ఉడత మాత్రం "ఇదంతా ఏమిటి? జోకా?" అంది.

ఆ మాట వినబడ్డట్టుంది, ఆర్చీకి కోవం వచ్చింది. "జోకేమిటి? జోకు? నేను సీరియస్‌గానే ఉన్నాను. నాకోసం మీరందరూ విధించిన డ్యూటీని చేయడానికి సిద్ధంగానే ఉన్నాను. ఆ విషయాన్నే మీకు పాటద్వారా చెప్తాను చూడండి." అంటూ తనను వ్యాన్‌లో తీసుకొచ్చిన డ్రైవరుకు 'ఇక కానీ' అన్నట్టు సైగ చేసింది.

అతను వెంటనే వ్యాన్‌లోకి దూరి మ్యూజిక్ సిస్టమ్ ఆన్ చేశాడు. ఇక ఆర్చీ డాన్సాడడం మొదలుపెట్టింది.

**'బతుకుతా, బతుకుతా**
**నా జాతిని బతికిస్తా, బతికిస్తా**
**ప్రేమిస్తా, ప్రేమిస్తా**
**ప్రేమిస్తేనే బతికిస్తా, బతికిస్తా**
**ప్రేమించకపోతే అంతరిస్తా'**

క్లబ్‌లో డాన్సు చేసే వాళ్లలాగానే 'ఇక మీరందుకోండి' అంటూ ప్రేక్షకులకు సైగ చేసింది. కానీ సభలో స్పందనేమీ లేదు.

తమ ఇళ్లనూ, ప్రాణాలనూ రక్షిస్తాడని ఆశ పెట్టుకున్న జీవి ఇలా సర్కస్ బఫూన్ వేషాలేయడం వాటికి మింగుడుపడలేదు. చల్లగా జారుకుంటే మంచిదనుకుని లేవడం మొదలెట్టాయి. లేళ్లు 'వీణ్ని నమ్ముకుంటే ఇక చచ్చినట్టే'



అన్నాయి. పక్షులు 'కానీ, ఏమయితే అదే జరగనీ' అని, మగ కుందేలు భార్యతో 'అయిందా సంబడం, వీడెవడో వచ్చి ఊడబొడిచేస్తాడన్నావ్' అని, వందులు 'ఆట అయిపోయింది, లేలే' అనీ లేచి ఒళ్లు దులుపుకుంటున్నాయి.

* * *

ఇవతల ఆర్చీ కూడా డాన్సు చేసి చేసి అలసిపోయింది. 'ఇక చాల్లే', ఆ మ్యూజిక్ సిస్టమ్ ఆపేయి' అంటూ డ్రైవర్‌కు చేత్తో సైగ చేసింది. డ్రైవర్ ఆపేయగానే కూలబడింది.

ఈ తమాషా అంతా చూసి జాన్‌కి చికాకేసింది. అందుకే ఆర్చీని అడివి లోపలికి తీసుకుని వెళ్లేటప్పుడు "నువ్వు నిజంగా ఎలుగుబంటివి కావు.



ఎలుగుతోలు కప్పుకుని పగటివేషగాడివి. ఈసారి పండగలు వచ్చినప్పుడు నీకు మంచి గిరాకీ!" అన్నాడు కసిగా.

ఆర్చీ అదేమీ పట్టించుకోలేదు. పట్నవాసపు వాళ్లు పల్లెటూళ్లను చూసి విసుక్కున్నట్టు "అబ్బ, ఇక్కడంతా మట్టీ, బురదా బాబూ! నా పాదాలు చూడు, ఎలా మాసిపోతున్నాయో!" అంది.

జాన్‌కు ఒళ్లుమండి వెటకారంగా, "అవును ఆర్చీ, ఈ అడివిలున్నాయే, దేవుడు వీటిని మన్నూ, మశానంతో చేశాడు. ఈసారి కనబడ్డప్పుడు రబ్బరు, ఫోమ్‌తో చేయమని చెప్తానులే" అన్నాడు.

అంతలోనే ఆర్చీ చూపు ఆడభల్లూకం మీద పడింది. స్వజాతిది కాబట్టి ప్రకృతిసహజమైన కోరిక కలిగింది. "హేయ్ డాక్టర్, నువ్వు చెప్పినమ్మాయి ఈమేనా! లవ్లీగా ఉందికదూ!"

"అవును"

"వాహ్, చూడు, చూడు దాని నడక చూడు. దాని హొయలు చూడు. తనకోసం చావడానికైనా నేను సిద్ధం."

"దాని అందం చూసి పడిఛస్తే చాలు, నిజంగా చావక్కర్లేదు, చస్తే కథ మధ్యలోనే ముగిసిపోతుంది. నేనెళ్లి మాట్లాడతాను. నీ గురించి చెబుతాను. నువ్విక్కడే ఉండు". అని ఆఫర్ చేశాడు జాన్.

"సరే, అలాగే కానీ, నువ్వెళ్లినపుడు చెప్పు- తన కడుపు పండించడానికి నేను రెడీ అని. కానీ చెప్పేది కాస్త సుతారంగా చెప్పు. మొరటుగా చెబితే ఆడవాళ్లకు నచ్చదు."

"సరే, సరేలే" అంటూ జాన్ ముందుకు సాగాడు. ఆర్చీ చెట్టు వెనక్కాల నక్కింది.



జాన్ ఆడభల్లూకం దగ్గరికి వెళ్లి 'హాయ్' అని పలకరించాడు.

'హాయ్' అని బదులు రావడంతో ధైర్యం తెచ్చుకుని -

'హాయ్, ఐ యామ్ జాన్' అని పరిచయం చేసుకున్నాడు.

'ఐ యామ్ ఎవా'

'ఎవా, బ్యూటిఫుల్ నేమ్ ! నైస్. నిన్ను కలుసుకోవడం నా అదృష్టం". అని కాస్త ఉబ్బేసి, టీవీ యాంకర్ల స్టయిల్లో అడిగాడు -"ఇప్పుడో ఓ చిన్న ప్రశ్న ! నీ కలల రాకుమారుడు ఎదురయితే ఏం చేద్దామనుకుంటున్నావ్?"

జాన్ వరస చూసి ఎవా కన్ఫ్యూజ్ అయింది. తనను వలచి వచ్చాడనుకుంది. అతని ప్రేమ స్వీకరించలేనందుకు సంతాపం తెలిపింది, అదీ అతి నాజూగ్గా -"నువ్వు చాలా అందంగా ఉన్నమాట నిజమే కానీ వేరే జాతులతో పెళ్లంటే నా కిష్టం ఉండదు."

రాకుమారుడు అనడం వల్ల వచ్చిన ముప్పును జాన్ వెంటనే

గ్రహించాడు "ఓ ఐయామ్ సారీ, నేను నా గురించి చెప్పుకోవటం లేదు. 'రాకుమారుడు' అనడం నా తప్పేలే! 'రాచభల్లూకం' అనాల్సిందేమో! నీ జాతికే చెందిన భల్లూకరాజాన్ని పరిచయం చేస్తాను. స్నేహం చేస్తావా?"



"భల్లూక రాజమా? అదెవరు?"

"అదిగో అటుచూడు. రాచఠీవితో విలసిల్లుతున్న ఆ గంభీర, మగధీర...." ఎలా వర్ణించాలో మాటలు తట్టక జాన్ ఆగిపోయి ఆర్చీ వైపు చేయి చాచి చూపాడు.

ఎవా అటువైపు చూసింది కానీ అక్కడ ఆర్చీ కనిపిస్తేగా? చెట్టు వెనక్కాల దాక్కుంది.

"అక్కడెవరూ లేరే!"

"లేకపోవడమేమిటి?" అంటూ తిరిగిచూసిన జాన్‌కి కూడా ఆర్చీ కనబడలేదు. "కాస్త సిగ్గులే..." అని సంజాయిషీ చెప్పాడు.

"మరి అలాంటివాడ్ని మగధీరుడు, శూరుడు అంటావేం?"

ఇక జాన్‌కి అసలు విషయం చెప్పక తప్పలేదు. "ఇక్కడ ఇష్టం వచ్చినట్లు చెట్లు కొట్టేయడం, దానివల్ల పశుపక్ష్యాదులు అవస్థపడడం చూస్తున్నావు కదా..?"

"....స్తున్నాను"

"అవునా, దాన్ని ఆపాలంటే నేను రెండు పసిఫిక్ వెస్టర్న్ జాతికి చెందిన ఎలుగుబంట్లను ఒక చోటకు చేర్చాలి. ఒక ఎలుగుబంటి నువ్వు. మరొకటి ఆర్చీ! మరి మీ ఇద్దరూ జత కడితే చాలు బోల్డు చిన్న, చిన్న పసిఫిక్ వెస్టర్న్ ఎలుగుబంట్లు పుట్టుకొస్తాయి. వాటిని పెట్టుకుని నేను ఏం తమాషాలు చేస్తానో నువ్వే చూద్దువుగాని..."

అంతా విన్నాక ఎవా "కథ బాగానే వుంది కానీ ఎలుగుబంట్లకు సంధానం కుదిర్చే బ్రోకర్లతో మాట్లాడం నాకు ఇష్టం ఉండదు" అంటూ వెళ్లిపోబోయింది.

"ఆగాగు, నీ దర్పం బాగానే ఉంది! నాతో మాట్లాడకపోతే పోయావ్, కనీసం ఆర్చీతో నైనా మాట్లాడు" అంటూ "ఆర్చీ, ఇలారా" అంటూ పిలిచాడు జాన్.



ఆర్చీ పెద్ద పట్టించుకోనట్టు పోజు కొడుతూ కాజువల్‌గా వాళ్ల దగ్గరకు వచ్చి "ఏం మాట్లాడమంటావ్, జానీ" అంది.

"ఏదో ఒకటి మాట్లాడు . నీ గురించి చెప్పు. తన గురించి తెలుసుకో". ఇక ఆర్చీ మొదలెట్టింది -" నాపేరు ఆర్చీ! నాకు ఇష్టమైనవేమిటంటే- వెన్నెల వెలుగులో సముద్రపొడ్డున ప్రియురాలితో నడవడం, 'బ్యాక్‌స్ట్రీట్ బాయ్స్' పాటలు వింటూ, ఆమెకు పాడి వినిపిస్తూ..."

"నువ్వు అదోరకం టైపులా ఉన్నావే.."

"అంటే సెక్సీ అనా?" గొప్పగా ఫీలవుతూ ఆర్చీ అడిగింది.

"అస్సలు కాదు... తిక్కవాళ్లంటారు చూడు. .. అలాంటి టైపు"

పరిస్థితి బాగాలేదని గ్రహించిన జాన్ "ఆర్చీ, నువ్వు కాస్త అలా వెళ్లు. ఈ సంగతి నా కొదిలేయ్." అని ఆర్చీ పంపించేసి, "ఇదిగో ఎవా, సరసాలు చాలించి ఆర్చీ గురించి నువ్వేమనుకుంటున్నావో నాకు చెప్పేయ్, సిగ్గు పడకు.." అని అడిగాడు.

ఎవా నవ్వింది. "ఉన్నమాట కుండబద్దలు కొట్టినట్టు చెప్పాక నరనమేమిటి, నరనం !? అలాంటి ఆడంగి వాడితోనా కాపురం?"



"తొందరపడి అలాంటి నిర్ణయానికి రావద్దు. ఆడవాళ్లతో మాట్లాడం పాపం ఆర్చీకి కొత్త. నువ్వు కాస్త అవకాశం ఇచ్చి ప్రోత్సహించావంటే..."

"..అవకాశం నేనిచ్చేదేమిటి? నాక్కావలసినది నిజమైన భల్లూకం. తనకోసం, నాకోసం వేటాడి, పోరాడి వేళకి ఇంతకి పట్టుకురాగలిగేది, ఇతరుల బారినుండి నన్ను రక్షించేది. అంతేగాని ఇలాంటి షోకిల్లారాయుడివల్ల ఒరిగేది ఏముంది.."

"నువ్వు చెప్పేది నా కర్థమవుతోంది..."

".... పైగా నేను ఇప్పటికే ఒకళ్లతో ఇన్‌వాల్వ్ అయివున్నాను.."

"ఓహ్... నీకు ఇప్పటికే బాయ్ ఫ్రెండ్.. అదే బేర్‌ఫ్రెండ్ ఉన్నాడా?... అదే, ఉందా? మీ జాతివాళ్లు ఎవరూ లేరుగా.. వేరేజాతి భల్లూకమా?"

"అవును " ఒప్పేసుకుంది ఎవా.

"నువ్వు దాన్ని ప్రేమిస్తున్నావా?"

"ప్రేమా!? ఆ పేరు చెప్పకు. నాకు చికాకు. మా కజిన్ ప్రేమ వివాహం చేసుకుంది. తీరాచూస్తే దాని మొగుడు అదిగో ఆ ఉత్తరం వైపున్న గుహలో మరోజాతి భల్లూకప్పిల్లతో చాటుమాటుగా స్నేహం చేస్తున్నాడు".

జాన్ ఊరడిల్లాడు. "అంటే నీకు ఇప్పటిదాకా ఎవరిమీదా ప్రేమ లేదన్నమాట!" అడిగాడు అతృతగా .

"లేదు"

"హమ్మయ్య !అయితే మనం ఒక ఒప్పందం కుదుర్చుకుందాం. నేను ఇవాల్టినుండే ఆర్చీకి ట్రెయినింగు ఇచ్చి దాన్ని ఓ నిజమైన భల్లూకంగా మారుస్తాను. అటువంటిదాన్ని పెళ్లిచేసుకుని పిల్లలు కనాలని నీ కనిపించే విధంగా దాన్ని మారుస్తాను. అయితే దానికి కాస్త టైము పడుతుంది. ఎంతో కాదు, నెల్లాళ్లు చాలు! నువ్వే లోపున ఓపిక పట్టాలి. అంతే"!.

ఆ విధంగా ఆర్చీని సంస్కరించే కార్యక్రమానికి శ్రీకారం చుట్టాడు జాన్!

(సశేషం)




# పెళ్ళిపుస్తకం

## దర్శకత్వం : బాపు

వెండితెర నవల

**17**

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత

**ముళ్ళపూడి వెంకటరమణ**

**నవలీకరణ**

**ఇలపావులూరి మురళీమోహనరావు**

### జరిగిన కథ

కుటుంబ బాధ్యతలున్న కృష్ణమూర్తి, భామలకు పెళ్లవుతుంది. ఒకే ఊరిలో ఉండాలని శ్రీధరం కంపెనీలో ఉద్యోగాలలో చేరతారు. చేరడానికి తామిద్దరం భార్యాభర్తలు కాదని చెప్పవలసి వస్తుంది. కృష్ణమూర్తి బ్రహ్మచారి అనుకుని శ్రీధరరావు కూతురు వసుంధర అతన్ని అభిమానిస్తూ ఉంటుంది. అది భార్యాభర్తల మధ్య పొరపొచ్చాలకు దారితీస్తుంది. శ్రీధరం బావమరిది గిరి, భామను బ్లాక్‌మెయిల్ చేసి గెస్ట్‌హౌస్‌కు రమ్మంటాడు. అక్కడ శ్రీధరం భార్య అతనికి బుద్ధి చెప్తుంది. ఇటు వసుంధర విదేశాలనుండి వచ్చిన బావను తనకు కాబోయే భర్తగా కృష్ణమూర్తికి పరిచయం చేసి క్రిస్మస్ పార్టీకి పిలుస్తుంది. ఇంటికి తిరిగివచ్చిన భామకు భర్త వసుంధరతో కలిసి పార్టీకి వెళ్లాడని తెలియడంతో అపార్థం చేసుకుని రోదిస్తుంది. **-(ఇక చదవండి)**

**ఆ**లోచనా రీతి ఒకేరకంగా సాగుతున్నపుడు, మనసు మార్చుకోవడానికి ఇష్టం లేనపుడు, తెలివిగా వ్యవహరించి కాపురాన్ని నిలబెట్టు కోవలసిన సమయంలో మాంగల్య బంధాన్ని కాలదన్ను కోవడానికే నిర్ణయించుకుంది. ఏమిటీ విపరీత ప్రవర్తనకు కారణం? తనకంటూ సొంత సంపాదన ఉండటమేనా? ఆర్థిక స్వాతంత్ర్యానికి అర్థం ఇదేనా?



ఇంటి ముందు వ్యాన్ ఆగుంది. తన సామాన్లన్నీ వ్యాన్లోకి ఎక్కించింది భామ. భర్త ముఖం కూడా చూడలేదు. వ్యాన్ ఎక్కబోతుండగా అకస్మాత్తుగా ప్రత్యక్షమయ్యాడు కృష్ణమూర్తి. దీనవదనంతో భార్యకు చేతులు జోడించి నమస్కరించాడు. అతని వంక చూడలేదు భామ.



''ఇవాళ మన కంపెనీ యజమాని శ్రీధరం గారి షష్టిపూర్తి. వనివాళ్ళందరికీ బోననులిస్తున్నారు" అని అన్నాడు.

"తెలుసు" అన్నది భామ ముక్తసరిగా.

''..తెలియందం... మాములువాళ్ళకి రెండేసి వేలు, మనలాంటి పెద్దజీతగాళ్లకి దంపతులైతే పదిహేను, నాలాంటి దొంగబ్రహ్మచారులకు పదివేలు క్యాష్ ఇస్తారు" చెప్పాడు కృష్ణమూర్తి.

వింతగా చూసింది భామ కృష్ణమూర్తి వైపు. నిజానికీ విషయం ఆమెకు తెలియదు.

"అలా వింతగా చూడకండి. నేను నీచమైన డబ్బుకోసం గొంతుకోసే కిరాతకుడినని తేల్చేశారు. డబ్బెంత నీచమైనా ఇప్పుడది నాకు చాలా అవసరం"కృష్ణమూర్తి చెబుతుండగా భామ దూరంగా వెళ్ళిపోయింది.

ఆమె వెంట నడిచాడు కృష్ణమూర్తి. "ఇంకోపదిరోజుల్లో మాచెల్లాయికి గుండె ఆపరేషనుంది" అన్నాడు.

భామ హృదయం భారంగా మూలిగింది. పెళ్ళి చూపులరోజు తాము కమిట్ అయిన వాటిల్లో ఇదికూడా ఒక అంశం.

కృష్ణమూర్తి చెప్పసాగాడు. "మీ దయవల్ల నేను వెనకేసి దాచింది కాక ఇంకా సరిగ్గా పదివేలు కావాలి. ఈ పదిరోజుల్లో పదివేలు నేను తేలేను. బానుగారి అమ్మాయిని వల్లో వేసుకున్నా ఇంత వెంటనే డబ్బు లాగడం కష్టం. అందువల్ల నా చెల్లెల్ని బ్రతికించుకోడానికి నాకు పదివేలు కావాలి. ఇవ్వాళే కావాలి. మీరు ఇవాళే బండారాలు బద్దలుకొట్టి బానుగారి అమ్మాయిని నా కుట్ర నుంచి కాపాడుతానన్నారు. అది ఈ ఒక్క పూట ఆవండి" బ్రతిమాలుతున్నాడు.



భామ తీవ్రాలోచనలో పడ్డది.

"వెయ్యి అబద్ధాలు చెప్పైనా ఒక్క పెళ్ళి చెయ్యమన్నారు. మీరు ఒక్కనిజాన్ని ఒక్కపూట ఆపి నా చెల్లెలికి ప్రాణదానం చెయ్యండి. ఆ తరువాత మీ దయ, మీ ఇష్టం, మీ హక్కు" అన్నాడు కృష్ణమూర్తి.

భామ వినిపించుకోడానికి ఇష్టపడటం లేదు. బయటకు నడవసాగింది గబగబ ముందుకు నడిచి భామ కడ్డంగా నిలబడ్డాడు కృష్ణమూర్తి. "మీ క్కూడా డబ్బు కావాలి. మీ అక్క ప్రాణం కాపాడటానికి ..ఈ ఒక్కపూట అగండి. షష్టిపూర్తి కాగానే దంపత్తాంబూలాలిస్తారు. అవి భార్యాభర్త కలిసి అందుకోవాలి. మీ పక్క అయిదు నిమిషాలు భర్తగా నిలబడటానికి మా

ఫ్రెండు నెవరినైనా ..." చెప్పబోయాడు.

కృష్ణమూర్తి చెప్పిన దాంట్లో ఉన్న వాస్తవాన్ని గ్రహించిన సత్యభామ "హు..ఆ మాత్రం ఫ్రెండ్స్ నాకూ ఉన్నారు. మొగుడిగా నటించేవాళ్ళు అర్థణాకు ముగ్గురు"అన్నది కన్నీళ్ళతో

మౌనంగా తలపట్టుకున్నాడు కృష్ణమూర్తి.

* * *

ఆ రోజు శ్రీధరం దంపతులు షష్టిపూర్తి మహోత్సవం జరుపుకుంటున్నారు. బంధుమిత్రులు, ఆయన కంపెనీలలో పనిచేసే ఉద్యోగులు అందరూ గార్డెన్లో చేరారు. రిసెప్షన్‌లోఉన్న కొంతమంది వచ్చే అతిథుల మీద పన్నీరు జల్లుతూ ఆహ్వానిస్తున్నారు. కృష్ణమూర్తి హుందాగా డ్రస్ చేసుకుని అందరికీ చిరునవ్వుతో స్వాగతం చెబుతున్నాడు.



"హల్లో .... హౌ ఆర్యూ... వెల్‌కమ్... స్వాగతం...రండి రండి...." ఇలా అందరినీ రకరకాలుగా పలుకరిస్తూ హడావిడిగా తిరుగుతున్నాడు. వసుంధర కృష్ణమూర్తి స్పెషల్‌గా డిజైన్ చేసిన చీరను ధరించి స్వాగతం చెబుతున్నది. మరోవంక సత్యభామ కూడా అతిథులను సాదరంగా స్వాగతిస్తున్నది. ఇద్దరూ కలిసే తిరుగుతున్నా ఒకరినొకరు పలుకరించుకోవడం లేదు. శరీరాలు చేరువలోనే ఉన్నా మనసులు మాత్రం దూరంగానే ఉన్నాయి.

వసుంధర చల్లుతున్న పన్నీటి చుక్కలు కృష్ణమూర్తి లాల్చీమీద పడ్డాయి. "వసూ... వసూ... నా చొక్కా తడిపేస్తున్నావ్ " కేక పెట్టాడు కృష్ణమూర్తి.

"సో వాట్ కె.కె...నువ్వు నీ చీర తడిపేస్కో. ఇన్‌ఫాక్ట్ ఇది నీ చీరే" అన్నది వసుంధర. కృష్ణమూర్తి పక పక నవ్వి "నవ్వుతూ

ఫన్నీ...వెరీ ఫన్నీ" అన్నాడు.

ఇంతలో ఓ నడివయసు వ్యక్తి బట్టతలతో, ఖద్దరు లాల్చీ, ధోవతి మీద నెహ్రూ జాకెట్ ధరించి కుంటుకుంటూ నడుస్తూ చేతికర్రను ఊతంగా పట్టుకుని ఎవరికోసమో వెతుకుతున్నట్లు "భామా..ఒసే భామా.... ఇట్రా..నిన్నే.. " అరుస్తున్నాడు. అతను భామ భర్తగా కాసేపు



నటించడానికి అంగీకరించిన వ్యక్తి. స్టేజీ డ్రామాలు వేసే అలవాటుండటంవల్ల చిన్నదానికీ పెద్దదానికీ ఊరికే కేకలు పెట్టడం అలవాటు అతగాడికి. నడుము వడిపోయిన వాడిలా అభినయిస్తున్నాడు.

అతని అరుపులు విని అక్కడికి పరుగెత్తింది భామ. "నమస్కారం" అన్నాడతను భామను చూసి. చేతిలో కర్రజారి క్రింద పడింది. "ఏమిటా పిచ్చి కేకలు, పిచ్చివేషాలు" అన్నది భామ కోపంగా. "ఆ కర్ర తీసియ్యవే" అరిచాడతను. "మీకే చెప్పేది. అలా అరవద్దన్నానా? నోరుమూసుకుని కూర్చోండి" మెల్లగా అరిచింది భామ.

కృష్ణమూర్తి వారిరువురినీ గమనిస్తున్నాడు.



"భామగారూ .. ఈ పూట మీ భర్తగా నటించమని అద్భుతమైన పాత్రనిచ్చారు. నేను ఆ పాత్రలో దూరి లీనమైపోయాను. మాములు రంగస్థలం మీద రెండు వేల ఏడువందల ముప్పై రెండు పాత్రల్లో దూరాను. కానీ ఇది జీవనరంగస్థలం. ఇటు మీ భర్తగా.. అటు నడుము విరిగిన అవిటివాడిగా.. " అతను చెబుతుండగా అతని మాటలు ఎవరైనా వింటున్నారేమోనని సంశయంతో అటు ఇటు చూసి 'ష్' అని అతన్ని వారించింది భామ.

కానీ అతను భామ భయాన్నేమీ పట్టించుకున్నట్లు లేదు. " నన్ను ఆపకండి. నాకు హద్దులు పెట్టకండి. నాలోని కళాతపస్వి గడ్డాలు పెంచేసుకుని ఎదిగిపోయాడు. మీరు డబ్బులు ఎగేసినా సరే... నా నటస్వేచ్ఛని చంపకండి" గొంతెత్తి అరిచాడతను.

"ష్" అరిచింది భామ.

అంతలో శ్రీధరం అందరినీ పలుకరిస్తూ అటుగా రావడం కనిపించింది. ఆయనను చూసి



"ఏమిటీ బొత్తాములు పెట్టడం.. ఎగుడు దిగుడుగా.. ..సరిగా పెట్టు ఊ" గదిమాడు భామను అవ్యక్తి.

కొండల్రావుతో సహ వస్తున్న శ్రీధరంగారిని చూసి "నమస్కారమండీ" అన్నది భామ.

"ఏమమ్మా...వీరేనా మీ ఆయన? ఆఁ.... బాగా కోలుకున్నట్లున్నారే.." పరామర్శించాడు శ్రీధరం. " ఏదో తమ..."అని అతను అంటుండగా

"నడుం బాగా సులువైందండీ.." చెప్పింది భామ.

తన డైలాగ్‌కు అడ్డం వచ్చేసరికి భామ మీద కోపం వచ్చిందతనికి.. "ఇష్.. ఏదో తమలాంటి పుణ్యదంపతుల తాంబూలం అనగానే శక్తి అదే వచ్చిందండీ" అన్నాడతను.

"మొత్తానికి భలే అదృష్టవంతుడివయ్యా... ఆ సావిత్రి సత్యవంతుడిని బతికించినట్లుగా నీభార్య అంటూ కొండల్రావు" అభినందిస్తుండగ

"నిజం బాబాయ్... ఈ రోజుల్లో ఇలా ఉద్యోగం చేసి గడించి, భర్తనూ, కుటుంబాన్ని పోషించడమంటే.." అంటూ తాను మెచ్చుకున్నాడు శ్రీధరం.

"ఆ... అదే... మహాపతివ్రతలే ఇలా చేస్తారు."అని తిరిగి వంత పాడాడు కొండల్రావు.

వీరి సంభాషణ వింటూ కృష్ణమూర్తి కూడా వారితో కలిశాడు. "కరెక్టు సార్... మాములు పతివ్రతలు అయితే.." అని ఏదో చెప్పబోయాడు.

శ్రీధరం చిరుకోపంగా "..ఛీ...ఛీ....ఏమిటా మాటలు? మాముళ్ళూ, మహాలూనూ? అయినా పతివ్రతల గురించి బ్రహ్మచారివి నువ్వు మాట్లాడటమేమిటయ్యా" అన్నాడు కృష్ణమూర్తితో అక్కణ్నుంచి వెళ్ళిపోతూ.

ఆ నటుడిని పలుకరించాడు



కృష్ణమూర్తి. "హల్లో....అయామ్ కె.కె. ..మిస్టర్ కిమోజీ.." షేక్ హ్యాండిచ్చాడు.

అతను కూడా పొరబాటుగా "అయామ్ కిమోజి"అని అంతలోనే పొరబాటు సవరించుకుని " కాదు కాదు..." అయామ్ కృష్ణాజీ" అన్నాడు.

కృష్ణమూర్తి నవ్వి "దానికంటే కిమోజీ బాగా సూటవుతుందండీ." అని మరెవరినో విష్ చేస్తూ వెళ్ళిపోయాడు.

కృష్ణాజికి ఆ వ్యంగ్యం అర్థం కాక 'కిమోజీ అంటాడేంటీ' అన్నాడు నోరు తెరిచి.

"కి అంటే కిరాయి" అర్థం చెప్పింది భామ.

"ఆఁ.. అంటే కిరాయి మొగుడనా? ఈ విషయం వాడికెలా తెలుసు? అసలు వాడికీ నీకూ ఏమిటి సంబంధం ? ఆఁ.. "గద్దించాడు కృష్ణాజి.

"నా అసలు మొగుడు కదలలేడని చెప్పాను కదా! ఈ అయిడియా ఇచ్చింది ఆయనే" చెప్పింది భామ.

"ఓ..ఓ... " తలూపాడతను.

(ఇంకావుంది)

**రచన : ఆచార్య ఆత్రేయ    గానం : ఘంటసాల, సుశీల**

అతడు : గిల్లి కజ్జాలు తెచ్చుకునే అమ్మాయీ
నీ కళ్లల్లో వున్నదీ బలే బడాయీ...
ఆమె : బుల్లి కారున్న షోకిలా అబ్బాయీ
నీ పోజుల్లో వున్నదీ బలే బడాయీ...
అతడు : వయసుతోటి దోరదోర సొగసులొస్తాయీ
సొగసులతో ఓరఓర చూపులొస్తాయీ
ఆ చూపులతో లేనిపోని గీరలొస్తాయీ
ఆ గీరలన్నీ జారిపోవు రోజులొస్తాయీ...
ఆమె : బుల్లి కారున్న షోకిలా అబ్బాయీ
నీ పోజుల్లో వున్నదీ బలే బడాయీ
కుర్రకారు కోరికలు గుర్రాల వంటివి
కళ్ళాలు వదిలితే కదం తొక్కుతాయీ
పట్టు తప్పినంతనే పరువే తీస్తాయీ...
ఒళ్ళు దగ్గరుంటే మంచిదబ్బాయీ...
అతడు : గిల్లి కజ్జాలు తెచ్చుకునే అమ్మాయీ
నీ కళ్లల్లో వున్నదీ బలే బడాయీ
మొదట మొదట కళ్లతోటి మొదలుపెట్టి లడాయీ
హృదయమంత పాకుతుంది హుషారైన హాయీ
కలకాలం వుండదు ఈ పడుచు బడాయీ
తొలినాడే చల్లబడిపోవునమ్మాయీ...
ఆమె : బుల్లి కారున్న షోకిలా అబ్బాయీ
నీ పోజుల్లో వున్నదీ బలే బడాయీ
కళ్ళు చూసి మోసపోయి కలవరించకు
ఓరచూపు కోరచూపు ఒకటనుకోకు
ఇస్తేను హృదయమెంతో మెత్తనైనదీ
ఎదురుతిరిగితే అదే కత్తివంటిదీ... ॥గిల్లి॥

**రచన : ఆచార్య ఆత్రేయ    గానం : ఘంటసాల, సుశీల**

అతను: ఓహొహొహొహొ
పరుగులుతీసే నీ వయసునకు
పగ్గము వేసెను నా మనసు
పరుగులుతీసే నీ వయసునకు
పగ్గము వేసెను నా మనసు
ఉరకలువేసే నా మనసునకు
ఉసిగొలిపెనులే నీ సొగసు...
ఆమె: హో ... హో ...
అతను: కోయని పిలిచె నా పిలుపునకు
ఓయని పలికెను నీ వలపు
ఒహొాయని పలికెను నీ వలపు
ఓయని పలికే నీ వలపునకు
తీయగ మారెను నా తలపు
తీయ తీయగ మారెను నా తలపు
ఆమె: ఓహొా... హొా...
అతను: తొణకని చెదరని నీ బిగువులతో
దోబూచాడెను నా నగవు
అహో... దోబూచాడెను నా నగవు
దోబూచాడెను నా నగవులతో
దొరగ పండెను నీ మరులు
దొర దొరగ పండెను నీ మరులు
ఆమె: ఓహొా... హొా
అతను: లేదనిపించే నీ నడుము
ఆమె: ఆహహా
అతను: నాదనిపించెను ఈ క్షణము
ఆమె: చ్... చ్... చ్...
అతను: లేదనిపించే నీ నడుము నాదనిపించెను ఈ క్షణము
ఉందో లేదో ఈ జగము ఉందో లేదో ఈ జగము
ఉందువు నీవు నాలో సగము
ఇదే నిజము కాదనుము

**రచన : ఆచార్య ఆత్రేయ    గానం : ఘంటసాల, సుశీల**

ఆమె : చిటపట చినుకులు పడుతూవుంటే
చెలికాడే సరసన వుంటే
చెట్టాపట్టగ చేతులు పట్టి
చెట్టునీడకై పరుగెడుతుంటే
చెప్పలేని ఆ హాయీ ఎంతో వెచ్చగ ఉంటుందోయీ...
చెప్పలేని ఆ హాయీ ఎంతో వెచ్చగ ఉంటుందోయీ...
అతడు : ఉరుములు ఫెళఫెళ వురుముతుంటే
మెరుపులు తళతళ మెరుస్తూ వుంటే
మెరుపు వెలుగులో చెలి కన్నులలో
బిత్తర చూపులు కనబడుతుంటే
చెప్పలేని ఆ హాయీ ఎంతో వెచ్చగ ఉంటుందోయీ...
చెప్పలేని ఆ హాయీ ఎంతో వెచ్చగ ఉంటుందోయీ...
ఆమె : కారుమబ్బులు కమ్ముతువుంటే
అతడు : కమ్ముతువుంటే
ఆమె : ఓఓఓ... కళ్లకు ఎవ్వరు కనబడకుంటే
అతడు : కనబడకుంటే
ఆమె : ఆఆఆ... కారుమబ్బులు కమ్ముతువుంటే
అతడు : కమ్ముతువుంటే
ఆమె : ఓఓఓ... కళ్లకు ఎవ్వరు కనబడకుంటే
అతడు : కనబడకుంటే
ఆమె : జగతిని వున్నది మనమిద్దరమే అనుకొని హత్తుకుపోతుంటే
జగతిని వున్నది మనమిద్దరమే అనుకొని హత్తుకుపోతుంటే
చెప్పలేని ఆ హాయీ ఎంతో వెచ్చగ వుంటుందోయీ
చెప్పలేని ఆ హాయీ ఎంతో వెచ్చగ వుంటుందోయీ ॥చిట॥
అతడు : చలిచలిగా గిలి వేస్తుంటే
ఆమె : ఆహాహా...
అతడు : గిలిగింతలు పెడుతువుంటే
ఆమె : ఓహొాహొా... ॥చలి॥
చెలి గుండియలో రగిలే వగలే చలిమంటలుగా అనుకుంటే
చెప్పలేని ఆ హాయీ ఎంతో వెచ్చగా వుంటుందోయీ..
చెప్పలేని ఆ హాయీ ఎంతో వెచ్చగా వుంటుందోయీ ॥ఉరుములు॥
ఇద్దరు : ॥చిటపట చినుకులు॥

**రచన : ఆచార్య ఆత్రేయ    గానం : ఘంటసాల, సుశీల**

ఆమె: ఎక్కడికి పోతావు చిన్నవాడా
నా చూపుల్లో చిక్కుకున్న పిల్లవాడా...
ఎక్కడికి పోతావు చిన్నవాడా
నా చూపుల్లో చిక్కుకున్న పిల్లవాడా...
కళ్ళు కళ్ళు కలిసినాక వెళ్లలేవు
వెళ్లినా మూణ్ణాళ్ళు వుండలేవు
మనసు మనసు తెలిసినాక మారలేవు ॥2॥
మారినా మనిషిగా బ్రతుకలేవు ॥ఎక్కడికి॥
నన్నిడిచి నీవెళితే నీవెంట నేనుంట
నిన్నిడిచి నేవెళితే నువు బ్రతుకలేవంట ॥నన్నిడిచి॥
ఇది నీగొప్ప నాగొప్ప కాదు పిల్లోడా ॥ఇది॥
ప్రేమంటే అంతేరా పిచ్చివాడా...
అతడు: ఎక్కడికి పోతావు చిన్నదానా
నా చూపుల్లో చిక్కుకున్న పిల్లదానా ॥ఎక్కడికి॥
పాడు... ఊఁ... పాడుఁ....
ఆమె: పాడమంటే పాడేది పాటకాదు
ఆడమంటే ఆడేది ఆటకాదు ॥పాడమంటే॥
ఇవ్వమంటే యిచ్చేది మనసుకాదు
పువ్వయినా నవ్వయినా నీకోసం పూయదు
ఎక్కడికయినా పోవోయి చినవాడా
నీ చూపులను ఓపలేను పిల్లవాడా
అతడు: ఎక్కడికి పోతాను చిన్నదానా
నీ చూపుల్లో చిక్కుకొంటి పిల్లదానా
డాన్స్.... ఊఁ... డాన్స్... ఐ సే డాన్స్...

రచన : ఆచార్య ఆత్రేయ గానం : సుశీల

నాలుగు కళ్ళు రెండైనాయీ
రెండు మనసులు ఒకటైనాయీ...
ఉన్న మనసు నీకర్పణజేసి
లేనిదాననైనానూ- ఏమీ
లేనిదాననైనానూ... ॥నాలుగు॥
కనులకు కలలే బరువైనాయీ
కన్నీళ్ళయినా కరువైనాయీ ॥కనులకు॥
రెండూలేక పండురేకులై
ఎందుకు నాకీ కనుదోయీ...
ఇంకెందుకు నాకీ కనుదోయీ... ॥నాలుగు॥
కదిలే శిలగా మారిపోతిని
కథగానైనా మిగలనైతినీ ॥కదిలే॥
నిలువున నన్నూ దోచుకుంటివీ
నిరుపేదగ నే నిలిచిపోతిని
నిరుపేదగ నే నిలిచిపోతిని ॥నాలుగు॥

రచన : ఆచార్య ఆత్రేయ గానం : ఘంటసాల, సుశీల

అతడు: తెల్లవారనీకు ఈ రేయిని
తీరిపోనీకు ఈ తీయని హాయినీ... ॥తెల్ల॥
నీ కన్నులలో మధువులన్ని జుర్రుకోనీ
ఆ కైపులో లోకాలే మరువనీ ॥నీ కన్నులలో॥
ఆమె: మనసులో మనసునై మరువనీ
నీ మనిషినై మమతనై మురిసిపోనీ
అతడు: తెల్లవారనీకు ఈ రేయిని
ఆమె: తీరిపోనీకు ఈ తీయని హాయినీ
తెల్లవారనీకు ఈ రేయినీ
అతడు: నీ కురులే చీకటులై కప్పివేయనీ
ఆ చీకటిలో పగలు రేయి ఒకటైపోనీ
అమె: నీ వలపువాన కురిసి కురిసి తడిసిపోనీ
తడియారని హృదిలో నను మొలకలెత్తనీ
అతడు: తెల్లవారనీకు ఈ రేయినీ
తీరిపోనీకు ఈ తీయని హాయినీ
అమె: తెల్లవారనీకు ఈ రేయినీ
అతడు: మల్లెపూల తెల్లదనం మనసు నిండనీ
అల్లరీ పడచుదనం కొల్లబోనీ ॥మల్లెపూల॥
అమె: కొల్లగొన్న మనసే నా యిల్లని
చల్లగా కాపురం ఉండిపోనీ
ఇద్దరు: తెల్లవారనీకు ఈ రేయినీ
తీరిపోనీకు ఈ తీయని హాయినీ
తెల్లవారనీకు ఈ రేయినీ

# కథా సంగ్రహం

ఆనంద్ జగదీశ్వరి పంచదార మిల్లులో ఇంజనీరుగా వుంటూ అందరి మంచినీ సంపాదించుకున్న అతిమంచివాడు. మంచితనం, మంచి మనుషులంటే గిట్టని మంగపతి ఆ మిల్లుకి మేనేజరు. మిల్లు యజమానురాలు జగదీశ్వరి ఈ విషయాన్ని గుర్తించి మంగపతిని మిల్లు నుండి తొలగించి ఇంట్లోనే వుండి ఇంటి వ్యవహారాలు, ఎస్టేటు పనీ చూడమంది. తన ఆశ్రయంలో పెరుగుతున్న కుమారి జయకు మిల్లు యాజమాన్యం బాధ్యతలు అప్పగించింది. ఆనంద్‌ని జయకు ఫాక్టరీ వ్యవహారాలు పరిచయం చేయమంది.

ఒకరికొకరు తెలీకముందు చిలిపి కజ్జాలాడుకున్న జయ-ఆనంద్‌ల వయసూ, మనసూ ఇప్పుడు వొకటై పరిమళించింది. మూడు పూవులు ఆరు కాయలుగా వర్ధిల్లింది. క్షణం జాగు చేయకుండా, జగదీశ్వరిగారి అనుమతిని పొంది వివాహం చేసుకుందామని నిర్ణయించుకున్నారు.

కాని-

రచన : ఆచార్య ఆత్రేయ గానం: పిఠాపురం నాగేశ్వరరావు, స్వర్ణలత

అతడు : రంజు రంజు రంజు భలే రామచిలకా ॥రంజు॥
అబ్బబ్బ నీ సోకు ఓయబ్బ నీ టీకు నీ సోకు నీ టీకు
హొయ్ రంజు రంజు రంజు భలే రామచిలకా ॥రంజు॥
ఆమె : రంజు రంజు రంజు భలే గోరింకా ॥రంజు॥
అబ్బబ్బ నీ సోకు ఓయబ్బ నీ టీకు నీ సోకు నీ టీకు
హొయ్ రంజు రంజు రంజు భలే గోరింకా
అతడు : కందిరీగ నడుముదానా కంతిరీ నవ్వుదానా
కందిరీగ నడుముదానా కంతిరీ నవ్వుదానా
కందిపప్పు చాయదానా అందినావే నేటికైనా॥హొయ్॥
ఆమె : పిందెమనసు పిల్లగాడా సందెవేళ సోగ్గాడా
ముందు ముందు చాలవుంది తొందరేల మొనగాడా
అతడు : ఓహొ...!
ఆమె : ఓహొయ్ రంజు రంజు రంజు భలే గోరింకా
అతడు : మనసుతోటి మింగివేయనా,
కళ్ళతోటి నమిలివేయనా ॥మనసు॥
అట్టాటిట్టాటిదాన వూరికె పోనిద్దునా
హొయ్ రంజు రంజు రంజు భలే రామచిలుకా
ఆమె : కొత్తకుండ నీరుతీపి కోరిన పెండ్లామే తీపి
అత్తగారి అడ్డులేని కాపురమే భలేతీపి
అతడు : ఒహొ...
ఆమె : హొయ్ రంజు రంజు రంజు భలే గోరింకా
అతడు : అబ్బబ్బ నీ సోకు
ఆమె : ఓయబ్బ నీ టీకు
అతడు : నీ సోకు
ఆమె : నీ టీకు
అతడు : ఓయ్ రంజు రంజు రంజు భలే రామచిలకా
ఆమె : ఒహొయ్ రంజు రంజు రంజు భలే గోరింకా

జగదీశ్వరి ఏకైక పుత్ర రత్నం - కుమార్ అస్పత్రి నించి పారిపోవడంతో ఆ తల్లిగుండె బ్రద్దలయింది. ఇన్నేళ్ళు దాచి పెట్టిన కుమార్ పిచ్చి సంగతి ఆనంద్‌కి చెప్పి, తన బిడ్డని తనకప్పగించి పుణ్యం కట్టుకోమని కన్నీరు మున్నీరుగా విలపించింది. ఆనంద్ మాట ఇచ్చి - బయలుదేరాడు.

క్షణం క్షణం హత్యకో, ఆత్మహత్యకో తలపడే కుమార్‌ని ఆనంద్ చావు బ్రతుకులకు లోనై పట్టుకొని ఇంటికి తీసుకొచ్చి జగదీశ్వరికి అప్పచెప్పాడు. మర్నాడే పారిపోవాలనుకున్న కుమార్‌కి జయ అందం, ఆటాపాటా నచ్చింది. ఆగిపోయాడు. 'పిచ్చికుదిరింది. జయనే పెళ్ళాడతాన'న్నాడు కుమార్. జగదీశ్వరి ఆనందానికి అంతులేదు. కాని - జయ ఆలోచించుకుని చెబుతానంది. ఎలాగైనా పెళ్ళికి జయను వొప్పించి-తన కుమార్ జీవితాన్ని నిలబెట్టమని ఆనంద్‌ని జగదీశ్వరి వేడుకొంది.

తారుమారైన ఈ పరిస్థితుల్లో త్యాగమే తన ధర్మంగా భావించి ఆనంద్ జయకి కర్తవ్యబోధచేసి వొప్పించాడు. అందుకు ఫలితంగా తను ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి వెళ్ళిపోయాడు.

ఈర్ష్యాళువైన మంగపతి మంత్రాంగంతో జయ-ఆనంద్‌ల ప్రణయ కథ కుమార్‌కి తెలిసింది. అతని బుర్రలో హింసోన్మత్తత రేగింది.

లెక్కలు సరిచూడాలన్న నెపంతో కుమార్ - ఆనంద్‌ని రప్పించాడు. ఆనంద్‌ని హత్య చేయాలని విఫల ప్రయత్నం చేశాడు. కుమార్‌ని తీవ్రంగా హెచ్చరించి వెళ్ళిపోతాడు ఆనంద్. ఇప్పుడు కుమార్ విషదృష్టి జయమీద పడింది. క్షణంలో రానున్న మృత్యువును తప్పించుకొని అర్ధరాత్రి జయ ఇల్లువిడిచి పారిపోయింది. ఆనంద్ ఆశ్రయాన్ని అర్థించింది.

కుమార్‌లో హింసోన్మత్త పిశాచం తాండవం చేయ సాగింది. పథకం మార్చి పగ సాధించాలనుకున్నాడు. మనసు మారిందనీ, జయ ఇప్పుడు ఆనంద్‌ని పెళ్ళి చేసుకుంటే తనకి ఎలాంటి అభ్యంతరం లేదని, తానిచ్చే పెళ్ళి బహుమతుల్ని స్వీకరించమని కోరి, ఆనంద్‌ని రప్పించాడు. ఎటువంటి అభ్యంతరాల్ని లెక్కచేయకుండా ఆనంద్ వచ్చాడు.

కాని - కుమార్ చచ్చి సాధించాలనుకున్నాడు. ఆనంద్ చావుని కళ్ళారా

చూడాలనుకున్నాడు మంగపతి. అలాగే జరిగింది. కుమార్ ఆత్మహత్య చేసుకున్నాడు. అదే సమయానికి అక్కడకు చేరుకున్న ఆనంద్‌పై హత్యానేరం పడింది. అరెస్టు అయ్యాడు. ఆధారాలన్నీ రుజువయ్యాయి. ఉరిశిక్ష విధించారు ఆనంద్‌కి.

ఉరి(శిక్ష)కై ఎదురుచూసే ఆనంద్‌కి, లోకమే చీకటైన జయకి - మిగిలిందల్లా ఆత్మబలం, పవిత్ర విశ్వాసం మాత్రమే.

కుమార్‌కి ఇరవైయేళ్లు వైద్యం చేసిన డాక్టరూ, జగదీశ్వరి ప్రాణస్నేహితుడు సుందరం - ఇద్దరూ ఆనంద్ నిర్దోషి అనీ కుమార్ ఆత్మహత్య చేసుకొన్నాడనీ నమ్మారు.

కాని - నిజానికి రుజువేది?

ఆనంద్‌ని బ్రతికించే ఆధారం ఒకటే వుంది.

అది కుమార్ డైరీ.

తాను చేయాలనుకున్న ఏ పనినైనా ఒకరోజు ముందర డైరీలో రాసుకునే అలవాటు కుమార్‌కు ఉందని, అది దొరికితే ఆనంద్‌ని తప్పించవచ్చుని కుమార్‌కి ఇరవై ఏళ్ల పాటు వైద్యం చేసిన డాక్టర్ చెబుతాడు. ఇవన్నీ చాటుగా విన్న మంగపతి ఆ డైరీని నిప్పుల్లో పడేస్తాడు.

ఆనంద్, జయల ఆత్మబలానికి దైవబలం తోడైంది. నిప్పుల్లో పడిన డైరీకి ఉన్న ప్లాస్టిక్ కవర్ మాత్రమే కాలుతున్న సమయంలో జయ అక్కడికి వచ్చింది. మంగపతితో పోరాడింది. డైరీని నిప్పుల్లోంచి తీసి చేజిక్కించుకుని క్షణాల్లో బయటకు పరుగులు తీసింది.

జైల్లో ఆనంద్ ఉరితీతకు అన్ని సన్నాహాలు పూర్తయ్యాయి. ఆనంద్ అచంచలమైన ఆత్మబలంతో ఉరికంబం ఎక్కాడు. ముఖానికి ముసుగు వేశారు. మెడకు తాడు తగిలించారు. టైం చూసుకుంటున్న జైలు సూపరింటెండెంట్ సిగ్నల్ ఇవ్వగానే ఆనంద్‌కి ఉరి పడిపోతుంది. సరిగ్గా ఆఖరి నిముషానికి జయ అక్కడికి చేరుకుంది. తన చేతిలోని కాగితాన్ని సూపరింటెండెంట్ చేతిలో పెట్టింది.

అది ఆనంద్ ఉరిని ఆపమంటూ జడ్జి గారు పంపిన ప్రత్యేక ఉత్తర్వు.

ఆనంద్ విడుదలయ్యాడు. అందరూ ఆనందంగా అతడికి స్వాగతం పలికారు. దూరాన మౌనంగా తన కోసమే ఎదురుచూస్తూ, తనను కాపాడుకున్న జయ అతనికి కనిపించింది. కృతజ్ఞతతో ఆమె చేతులు పట్టుకున్నాడు. ఆమె తన చేతిలో దాచుకున్న మంగళసూత్రాన్ని అతడికి అందించింది.

- శుభం -

## పాత్రలు - పాత్రధారులు

| | | |
|---|---|---|
| ఆనంద్ | : | నాగేశ్వరరావు |
| జయ | : | బి.సరోజాదేవి |
| కుమార్ | : | జగ్గయ్య |
| జగదీశ్వరి | : | కన్నాంబ |
| కూర్మం | : | రేలంగి |
| మంగపతి | : | రమణారెడ్డి |
| చిట్టి | : | గిరిజ |
| రంగమ్మ | : | సూర్యకాంతం |
| పార్వతి | : | హేమలత |
| రంగారావు | : | వై.వి.రాజు |
| జగన్నాథం | : | చదలవాడ కుటుంబరావు |
| కుమార్ (రాజా) | : | మాస్టర్ బాబు |

మరియు
నాగయ్య
గెస్టు
డాక్టర్ - గుమ్మడి

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| కథ మూలం | : | అగ్నిసంస్కార్ (బెంగాలీ చిత్రం) |
| మాటలు - పాటలు | : | ఆత్రేయ |
| సంగీతం | : | కె.వి.మహాదేవన్ |
| ఛాయ | : | సి. నాగేశ్వరరావు |
| కూర్పు | : | అక్కినేని సంజీవరావు |
| కళ | : | జి.వి.సుబ్బారావు |
| నృత్యం | : | హీరాలాల్,చిన్ని & సంపత్ |
| మేకప్ | : | చౌదరి, పీతాంబరం |
| దుస్తులు | : | కాదర్,జీనార్ట్ , సూర్యారావు |
| స్టిల్సు | : | సత్యం(జైహింద్ స్టూడియో) |
| ప్రొడక్షన్ -ఇన్‌చార్జి | : | పి.యస్.రెడ్డి |
| అసిస్టెంటు కూర్పు | : | అంకిరెడ్డి |
| అసిస్టెంటు డైరెక్టర్ | : | ధాత్రీధర్ |
| అసోసియేట్ డైరెక్టర్ | : | పి.యన్.రెడ్డి బి.ఏ. |
| ఆపరేటివ్ కెమెరామెన్ | : | చంద్రశేఖర్ |
| స్టూడియో | : | శ్రీ సారథి (హైద్రాబాద్) |
| నిర్మాత | : | వి.బి.రాజేంద్రప్రసాద్ |
| దర్శకత్వం | : | వి.మధుసూదనరావు |


వి.బి.రాజేంద్రప్రసాద్


వి.మధుసూదనరావు


కె.వి.మహాదేవన్


ఆత్రేయ


ఘంటసాల


పి.సుశీల


పిఠాపురం నాగేశ్వరరావు


స్వర్ణలత

# ఎవరన్నారు 'శాంతా' టీకాల కంపెనీ మాత్రమేనని...?

**స్వదేశీ ప్రజ్ఞను బహుముఖాలుగా**
**వెలారిస్తున్న శాంతాగ్రూప్**
**రథసారథులు**
**తెలుగువారే...!**

క్యాన్సర్, హెపటైటిస్-బి వంటి అనేక భయానక వ్యాధుల
చికిత్సలో ఉపయోగపడే ఇంటర్‌ఫెరాన్ ఆల్ఫా 2
**శాన్ ఫెరాన్**

భారతదేశంలో మునుపెన్నడూ
లేని విధంగా యునిసెఫ్‌కు టీకాల విక్రయం

అంతర్జాతీయ ధార్మిక సంస్థల కోరిక మేరకు
వారి తరఫున టీకాల ఉత్పత్తి

అనుబంధ సంస్థ **శాంతా వెస్ట్**
(అమెరికా) ద్వారా క్యాన్సర్
చికిత్సా మూలకాలపై పేటెంటు

కాంట్రాక్టు పద్ధతిపై ఫారిన్
కంపెనీల తరఫున పరిశోధన



హృద్రోగులకు
అత్యవసర సమయాలలో
ప్రాణదానం చేసే
స్ట్రెప్టోకైనేస్
**శాన్ కైనేస్**

చికిత్సకు లొంగని కాలేయపు వ్యాధి
హెపటైటిస్-బి నివారణకై **శాన్‌వాక్-బి**

చిన్నపిల్లలకు పలుమార్లు టీకాలు వేసే అగత్యం
తప్పించే కాంబినేషన్ వ్యాక్సిన్‌లను అభివృద్ధి చేస్తూ...

కలరా, టైఫాయిడ్, హిబ్, మెనింగోకోకల్
టీకాల రూపకల్పనలో ముందుకు సాగుతూ...

ప్రాణరక్షక ఔషధాలను సామాన్యుడికి
అందుబాటు ధరలో అందించే లక్ష్యంలో భాగంగా
విదేశాలపై ఆధారపడకుండా స్వదేశీ పరిశోధన

## ఔను...
## 'శాంతా'
## టీకాలు కూడా
## తయారు చేస్తుంది...

ఆ మాటకొస్తే శాంతాకు అనేక జాతీయ, అంతర్జాతీయ
ప్రశంసలు, అవార్డులు లభించడానికి తొలి సోపానం
టీకాలను పరిశోధించి, తయారు చేసి, మార్కెట్టు చేయడమే!
శరీర నిర్మాణానికి సన్నిహితంగా ఉండే జీవప్రక్రియ ద్వారా తయారయిన బయోటెక్ ఉత్పాదనలు మానవాళికి అనువైనవి. ఆరోగ్యరీత్యా సురక్షితమైనవి.

**బయోఫార్మా రంగంలో ప్రపంచపటంలో భారతదేశానికి స్థానం కలిగించిన ఔషధ సంస్థ శాంతా బయోటెక్నిక్స్**

- Pioneers in r-DNA Based Human Healthcare Products in India
- Customised Monoclonal & Polyclonal Antibodies
- Recombinant Protein Development, Manufacturing & Formulation
- Vaccines, Therapeutic Products & Diagnostics
- cGMP Compliant Facility for Manufacturing Biopharmaceuticals
- Nutraceuticals

W.H.O. (Geneva)
Pre-qualified
U.N. Supplier of
Hepatitis-B Vaccine

**SHANTHA BIOTECHNICS LTD.**
www.shanthabiotech.com
3rd Floor, Serene Chambers, Road No.7,
Banjara Hills, Hyderabad - 500 034. A.P., INDIA.
Ph: +91-40-23548507, 23543010, 23608843
Fax: +91-40-23548476
Email: info@shanthabiotech.com

